| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| పురుషార్థా శ్చ సర్వేఽపి<br>భూయాసు ర్భువి సర్వత:. | నన్ని పురుషార్థములను సిద్ధించునుగాక! (అని వాల్మీకి పలికెను.) |
| **బ్రహ్మోవాచ -** | **బ్రహ్మ పలికెను -** |
| 54. వల్మీకజన్మన్ సుమునే!<br>రామనామప్రభావత:,<br>శాపా త్త్వం నీచవృత్తస్థోఽ<br>ప్యేవం జాతో మునీశ్వర:. | 54. ఓ వాల్మీకిమహర్షీ! నీవు శాపమువలన నీచవృత్తి యం దున్నవాడవైనను రామనామ ప్రభావమున మునీశ్వరుడ వైతివి. |
| 55. నామ్న ఏవం ప్రభావశ్చే<br>ద్రామస్య పరమాత్మన:,<br>కిము తచ్చరితాంభోధౌ<br>ప్లవనా దఘనాశనే. | 55. నామమాత్రముననే ఇంత ప్రభావము కలిగినచో నిక రామచరిత్ర యను సముద్రమున నీదుటచే పాపములు నశించుననుటలో నాశ్చర్య మేమి యుండును? |
| **వాల్మీకి రువాచ -** | **వాల్మీకి పలికెను -** |
| 56. న జ్ఞాయతే కథం బ్రహ్మన్!<br>రామనామప్రభావత:,<br>ఏవం ముని రహం జాత:<br>శాపశ్చ మమ వేదృశ:. | 56. ఓ చతుర్ముఖా! రామనామ ప్రభావమున నేనిట్లు మునినెట్లైతిని? నా శాపమెట్టిది? |
| **బ్రహ్మోవాచ -** | **బ్రహ్మ పలికెను -** |
| 57. వర్ణనే త్వచ్చరిత్రస్య<br>న కాలోఽయం తథాఽప్యహం,<br>తవౌత్సుక్య నివృత్త్యర్థం<br>సంక్షేపా త్ప్రబ్రవీమి తే. | 57. ఓ వాల్మీకిమహర్షీ! నీ పూర్వచరిత్రను విస్తారముగ జెప్పుట కిప్పుడు వ్యవధిలేకున్నది. కాని నీ కుతూహలమును తీర్చుటకై సంక్షేపముగ చెప్పెదను. |
| 58. వరుణస్య సుత: పూర్వం<br>త్వ మభూ ర్హరితాభిధ:. | 58. పూర్వము నీవు హరితుడను పేర వరుణుని పుత్రుడవైతివి. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 59. కదాచి త్తవ గేహే తు<br>వరుణేన సమాహుతాః,<br>మునయః సనకాద్యాస్తు<br>సంగతాః బ్రహ్మవాదినః. | 59. ఒకానొకతరి వరుణునిచే పిలువబడి (బ్రహ్మవాదులగు) సనకాదిమహామునులు మీయింటికి విచ్చేసిరి. |
| 60. సఙ్కల్ప్యూర్మిథ స్తత్ర<br>శ్రుతిస్మృత్యాశ్రయాః కథాః. | 60. అచ్చట వారొండురులతో శ్రుతిస్మృతులలోని కథలను ముచ్చటించిరి. |
| 61. ప్రసంగేన చ రామస్య<br>హరే రవతరిష్యతః,<br>వధాయ దశకంఠస్య<br>కథాం తే చక్రిరే తదా. | 61. ప్రసంగవశమున తుదకు దశకంఠుని సంహరించుటకై యవతరింపబోవు విష్ణువుయొక్క రామావతారమునుగూర్చి ప్రసంగించిరి. |
| 62. క్రీడాపరవశ స్త్వం తు<br>తదాఽ భూ ర్గృహబర్హిణా,<br>తత్కేకాభిశ్చ తే హాసైః<br>కథావిఘ్నో బభూవ హ. | 62. అప్పుడు నీవు నీ పెంపుడునెమలితో నాడుచుంటివి. దాని కూతలవలనను నీ నవ్వుల వలనను కథ ఆగిపోవలసివచ్చెను. |
| 63. సనత్కుమారః కుపితః<br>శశాప త్వాం తదా కిల,<br>యస్మా ల్లోకోత్తరకథా<br>విఘ్నాయ కిల దర్పతః. | 63. సనత్కుమారు డంతట కోపించి నీవు గర్వమున లోకోత్తరమగుకథకు విఘ్నమునుకలిగించితివి. |
| 64. పక్షిణా క్రీడసే తస్మా,<br>ద్వ్యాధత్వం తు గమిష్యసి. | 64. పక్షితో ఆడుచుండుటచే నీవు కిరాతుడవగుమని శపించెను. |
| 65. ఇత్యుక్తే వచనే తేన<br>సంభ్రాంతా మునయో ఽఖిలాః,<br>త్వం తు నిశ్చేతనో జాతో<br>వరుణో దుఃఖితో ఽభవత్. | 65. ఈ శాపమునువిని మునులందరును భయపడిరి. నీవు నిశ్చేష్టుడవై తివి. నీతండ్రియగు వరుణుడు మిక్కిలి దుఃఖించెను. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము. |
| --- | --- |
| 66. ప్రసాదయామాస మునిం<br>పితా తే శాపశాన్తయే. | 66. మరియు వరుణుడు నీ శాపమును పోగొట్టుమని యాతనిని వేడెను. |
| 67. తతః ప్రపన్న స్స మునిః<br>పున స్త్వాం వాక్య మబ్రవీత్,<br>తవ భ్రాతు ర్భృగో ర్వంశే<br>ప్రచేతా నామ వై మునిః,<br>ఆస్తేఽద్య దండకారణ్యే<br>తపః కుర్వ౯ సుదుశ్చరం. | 67. అంతట సనత్కుమారుడు ప్రసన్నుడై నీ సోదరుడగు భృగువుయొక్క వంశమున ప్రచేతసుడను ముని కలడు. అతడిప్పుడు దండకారణ్యమున ఘోరతప మాచరించు చున్నాడు. |
| 68 భవితాసి సుత స్తస్య<br>వేదవేదాంగపారగః. | 68. నీవాతనికి వేదవేదాంగపారంగతుడగు పుత్రుడుగా జన్మించెదవు. |
| 69. కాలేన వ్యాధవృత్తిశ్చ<br>భవితాసి గిరా మమ. | 69. కొంతకాలమునకు నా శాపవశమున కిరాతక వృత్తిగలవాడ వగుదువు. |
| 70. సప్తర్షీణాం ప్రసాదేన<br>రామనామప్రభావతః,<br>పూతో భూత్వా తపః కృత్వా<br>మునివర్యత్వ మేష్యసి. | 70. సప్తమహర్షుల ప్రభావమునను, రామనామ మహిమవలనను పవిత్రుడవై తప మాచరించి మునిశ్రేష్ఠుడ వగుదువు. |
| 71. ఇత్యుక్త్వా స ముని ర్యాత<br>స్త్వం చ ప్రాచేతసోఽభవః. | 71. అని పలికి ముని వెడలిపోగా నీవు ప్రచేతసునకు పుత్రుడవై తివి |
| 72. వేదవేదాంగనిష్ణాతో<br>హ్యభూ స్త్వం బాల్య ఏవ చ. | 72 నీవు బాల్యముననే వేదవేదాంగములయందసమానపాండిత్యము నార్జించితివి. |
| 73. సమిత్కుశాదీ నాహర్తుం<br>జాతు త్వం వనమధ్యగః. | 73. నీవొక పర్యాయము సమిధలను దర్భలనుతెచ్చుటకై వనమధ్యమున కేగితివి. |
| 74. బహూ న్నానాయతో బద్ధా౯<br>వధ్యమానాం శ్చ వై మృగా౯, | 74. అచట వలలో కట్టబడి చంపబడుచున్న పెక్కు మృగములజూచి |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| పశ్యం స్త్వం రమమాణోఽభూ<br>ర్వ్యాధేన మునిశాపతః. | మునిశాపవశమున వ్యాధునితో నాటలాడుచు నచటనే యుంటివి. |
| 75. అహూతోఽపి చ పిత్రా త్వం,<br>నాధ్యగచ్ఛః స్వ మాశ్రమం. | 75. తండ్రి పిలచినను నీవాశ్రమమునకు రాలేదు. |
| 76. నైషాద్యా వర్తమాన స్త్వం<br>వృత్త్యా హింసన్ మృగాన్ ఖగాన్,<br>పరిణీయ చ భిల్లానాం<br>కన్యాం కామపి సంయతః.<br>పుత్రా నుత్పాదయన్ తస్యాం<br>భరం స్తాం శ్చ మృగైః ఖగైః. | 76. నీవు వ్యాధుని వృత్తిలోనుండి మృగములను పక్షులను హింసించుచు, నొక చెంచుకన్ని యను వివాహమాడి పుత్రులను కనుచు వారి పోషణకై మృగములను, పక్షులను చంపి వారలను పోషించుచుంటివి. |
| 77. కుటుంబభరణాత్ ఖిన్నో<br>బహువర్షసహస్రతః,<br>జాతు త్వం వనమధ్యస్థ<br>స్తరుస్థం హ్యవధీః ఖగం. | 77. ఇట్లు కుటుంబరక్షణమునకై వేలకొలది సంవత్సములు శ్రమజెంది ఒక దినమున అడవియందలి చెట్టుపైనుండు పక్షిని కొట్టితివి. |
| 78. పలాయిత స్స చ ఖగః<br>స చ బాణోఽపత త్త్వయి. | 78. ఆ పక్షి పారిపోవుటచే ఆ బాణము తిరిగి క్రింద పడి నీకు తగిలెను. |
| 79. తేన విద్ధాంసదేశ స్త్వం<br>రుదితో వేదనావశాత్. | 79. ఆ బాణముచే భుజమునకు దెబ్బ తగిలెను. నీవు బాధవలన నేడ్చుచుంటివి. |
| 80. తదా సప్తర్షయో మార్గా<br>గతా స్త్వాం వీక్ష్య కంపితాః,<br>దైన్యరాశిం త్వా మథోచు<br>ర్దయయాభిపరిప్లుతాః. | 80. అప్పుడు సప్తర్షు లామార్గమునవచ్చి నిను జూచి జాలిచే కంపించినవారై దుఃఖించుచున్న నిన్నిట్లు దయతో పలికిరి. |
| 81. అహో మూర్ఖ స్త్వ మేత త్తే<br>విప్రో భూత్వా కులోద్భవః.<br>ఈదృశీం వృత్తి మాపన్నో<br>ఽస్యరే! నిష్కృతివర్జితాం. | 81. ఓరి మూర్ఖుడా! నీవు బ్రాహ్మణవంశమున జన్మించి ఇట్టి ప్రాయశ్చిత్తములేని యీనీచవృత్తి నవలంబించితివి కదా! |

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము |
|---|---|
| 82. యథా త్వం ఖిద్యసే మూఢ<br>బాణేనానేన విధ్యతా,<br>తథా మృగవిహంగానాం<br>వ్యథా కిం నేతి తే మతి:. | 82. బాణము తగులుటచే నీవెట్లు బాధ నొందు చుంటివో అట్లే పక్షులును బాధపడునని నీకు తెలియదా? |
| 83. స్వం మాంసం పరమాంసేన<br>య: పుష్యతి నరాధమ:,<br>రురవో భక్షయిష్యంతి<br>తస్య మాంసం యమాలయే. | 83. ఎవడు తన మాంసమును ఇతరుల మాంసముచే పోషించుకొనునో ఆతని మాంసమును నరక లోకమున రౌరవులు భుజింతురు. |
| 84. న త్వం నిర్విద్యసే మూఢ!<br>అపీమాం వేదనాం గత:. | 84. నీవిట్టి బాధ ననుభవించుచును మూఢుడవగు టచే నిర్వేదమును చెందకున్నావు. |
| 85 ఇత్యుక్తే వచనే తైస్తు<br>కరుణార్ద్రితమానసై:,<br>కాలయోగాత్తు నిర్విణ్ణ:<br>సంజాత స్త్వం మృగాత్యయాత్. | 85. ఇట్లు దయతోకూడిన మనస్సు కలవారై వారు పలుకగా కాలవశమున మృగముల చంపుట వలన నీకు విచారము కలిగెను |
| 86. తా నబ్రవీ: ప్రాంజలి స్త్వం<br>తేభ్యో నత్వాఽథ దూరగ:. | 86. నీవు వారికి దూరముగా నుండి నమస్కరించి ఇట్లంటివి. |
| 87. అహో అధన్యతా మేఽద్య<br>యదహం విప్రవంశజ:,<br>భూత్వాఽపి వృత్తి మాపన్నో<br>మృగమాంసై: స్వయంహృతై:. | 87. అయ్యో నేను ఉత్తమ బ్రాహ్మణవంశమున జన్మించియునుకూడ మృగములను స్వయముగ చంపి వాని మాంసములచే జీవితమును గడుపు చుంటిని అందుచే నేనతిదుర్మార్గుడను. (అని పలుకగా) |
| సప్తర్షయ ఊచు: – | సప్తర్షులు పలికిరి – |
| 88. తుష్టా వయం త్వద్వినయాత్,<br>ఇచ్ఛామ: త్వత్సముద్ధృతిం. | నాయనా! మేము నీ వినయమునకు సంతసించి తిమి. నిన్ను ఉద్ధరింపగోరుచున్నాము. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 89. కింతు త్వం పతితో జాత:<br>ప్రాయశ్చిత్తం న తే శ్రుతం,<br>వక్ష్యామోఽథాపి కృపయా<br>త్వం కురుష్వ యథోదితం. | 89. పతితుడవైన నీకు ప్రాయశ్చిత్తము లేదు. ఐనను దయతో మేము చెప్పినట్లు చేయుము. |
| 90. పాత్రాపాత్రవిచారో న<br>రామనామ్నాం ప్రకీర్తనే,<br>శ్రవణే చోపదేశే చ<br>తస్మా త్త్తే ద్యతు క్షమం. | 90. రామనామోచ్చారణకుగాని, వినుటకుగాని, ఉపదేశమునకుగాని పాత్రాపాత్ర విచక్షణ యక్కరలేదు. కావున నీకీ మంత్రమే తగినది. |
| 91. రామనామ సముచ్చార్య<br>యస్మా త్పాపా న్న ముచ్యతే,<br>త్రిలోక్యా మస్తి తన్నైవ<br>సత్య మేత త్పురీకీర్తితం. | 91. రామనామ ముచ్చరించినచో పోనట్టి ఘోర పాపము మూడులోకములలోను నేదియును లేదు. ఇది ముమ్మాటికిని సత్యము |
| 92. జాతోఽద్యైవ రఘో ర్వంశే<br>రామనామ వహన్ హరి:,<br>త్వం తదామ్నాయ భక్త్యాఽద్య<br>మోక్ష్యసే సర్వపాతకై:. | 92. నేడే రఘువంశమున విష్ణువు రామనామముతో నవతరించెను. నీవాతని చరిత్రయందలి భక్తిచే సర్వపాపములనుండి విముక్తి నొందెదవు. |
| 93. ఉపవిశ్యాశ్వత్థమూలే<br>కామక్రోధౌ విసృజ్య చ,<br>ఆజానుబాహుం దీర్ఘాక్షుం<br>నీలకుంచితమూర్ధజం. | 93. నీవు కామక్రోధముల వీడి రావి చెట్టు మొదటకూర్చొని, మోకాలివరకునుండు దీర్ఘ బాహువులు కలిగియున్నట్టియు, సువిశాల నేత్రములు కలిగియున్నట్టియు, నల్లని ముంగురులు కలిగియున్నట్టియు, |
| 94. ప్రగృహ్యా వామహస్తేన<br>చాపం సవ్యేన సాయకం. | 94. ఎడమచేతియందు ధనుస్సును, కుడిచేత బాణములను ధరించినట్టియు, |
| 95. ప్రావృషేణ్యపయోవాహ<br>స్వచ్ఛకాంతిమనోహరం, | 95. వర్షకాలమునందలి మేఘమువంటి కాంతికలిగి ప్రకాశించునట్టియు, బంగారు ఆభరణములచే |

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము. |
|---|---|
| నిష్కాభరణవిస్తీర్ణ<br>వక్షసం వనమాలినం. | సువిశాలమగు వక్షస్థ్సలము కలిగినట్టియు, వన<br>మాలను ధరించినట్టియు, |
| 96. సుప్రసన్న ముఖాంబోజం<br>సుమృష్టమణికుండలం,<br>చింతయన్ రాఘవం బుద్ధ్యా<br>రామనామజపాఽఽద్రుత:. | 96. చిరునవ్వుచే నొప్పు ముఖపద్మము కలిగినట్టియు,<br>మంచి మణికుండలములు కలిగినట్టియు,<br>శ్రీరాముని ధ్యానించుచు రామనామ జపమునం<br>దాదరము కలిగియుండుము. |
| 97. ఉపకృత్యేతి కృపయా,<br>నివృత్తా స్తే స్వకం పదం. | 97. అని సప్తర్షులును దయచేత నీకుపకారము జేసి,<br>వారు తమ లోకమునకు బోయిరి. |
| 98. త్వం తత: పుత్రదారాది<br>చింతా ముత్సృజ్య దూరత:,<br>రామ రామేతి రామేతి<br>జపన్ నిశ్చలతాం గత:.<br>కాలేనాల్పేన తే దేహం<br>వల్మీక: ప్రావృణో న్మహాన్. | 98. నీవు భార్యాపుత్రాదివ్యామోహమును దూర<br>ముగ విడచి "రామ రామ రామ" యని<br>ధ్యానించుచు నిర్మలమనస్కుడవైతివి. కొద్ది<br>కాలముననే నీశరీరము పుట్టలచే కప్పబడెను. |
| 99. అతీతే వత్సరే కాలే<br>త్వస్థిమాత్రావశేషితం,<br>జపంతం రామ రామేతి<br>వల్మీకాచ్ఛాదితాంగకం. | 99. ఇట్లు జపముచే ఒక సంవత్సరకాలము గడచి<br>నంతనే నీకు ఎముకలుమాత్రమే మిగిలి<br>యుండెను. మరియు నీవు పుట్టచే గప్పబడి<br>రామనామమును జపించుచుంటివి. |
| 100. రామనామజపా న్ముక్త<br>పాతకం త్వాం విచింతయన్,<br>అహం కమండలుజలై<br>రభ్యుక్ష్య త్వాం వ్యబోధయం. | 100. రామనామ జపమువలన పాపములు వీడిన-<br>నిన్ను తలచుచు నేను నాకమండలములోని<br>ఉదకమును నీపై జల్లి నిన్ను లేపితిని. |
| 101. కాయం చ పూర్వవ త్కృత్వా<br>తపసే త్వాం సమైరయం. | 101. నీ శరీరమునుగూడ పూర్వమువలె జేసి నిన్ను<br>తపస్సునందు ఆసక్తికలవానిగా జేసితిని. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 102 స్వవృత్తి మనుచింత్య త్వం<br>యత: ఖిన్నో ౽భవ: పురా,<br>అతీతానాం విస్మరణం<br>తతో౽హ మదదాం తవ. | 102. పూర్వపు నీప్రవర్తనను గురించి నీవు పశ్చాత్తాపపడితివి గాన జరిగిన సంగతులు మరచి పోవునట్లు జేసితిని. |
| 103. తత: శుద్ధాత్మతాం ప్రాప్య<br>మునిశ్రేష్ఠత్వ మాగత:,<br>య త్త్వం వల్మీకతో జాతో<br>వాల్మీకిరితి త ద్భవాన్. | 103. అటుపిమ్మట నీవు నిర్మలమగు మనస్సు కలిగి మునిశ్రేష్ఠుడవై వల్మీకమునుండి (పుట్టనుండి) పుట్టుటచే వాల్మీకియను పేర ప్రసిద్ధికెక్కితివి. |
| 104. ఇదమేవ నవం జన్మ<br>తవ కృత్వా౽హ మాహ్వాయం,<br>వాల్మీకిరితి తేన త్వం<br>ఖ్యాతో నామ్నా౽మునైవ తే. | 104. పుట్టనుండి బయటకు వచ్చుటచే నూతన జన్మముగ భావించి నేను నిన్ను 'వాల్మీకి' యని పిలచుటచే నీ పేరు వాల్మీకి అయ్యెను. |
| 105. ఖ్యాతో లోకే సర్వలోకై:,<br>రామనామ్నా౽సి సమ్మత:. | 105. రామనామముచే ననుగ్రహింపబడి ముల్లోకములయందును కీర్తిని గడించితివి. |
| 106. తస్మా త్త్వం కురు రామస్య,<br>చరితం కావ్యరూపత:. | 106. కావున నీవు రామచరిత్రను కావ్యరూపముగ వ్రాయుము. |
| 107. న తే వా గనృతా కావ్యే<br>కాచి దత్ర భవిష్యతి,<br>రసపుష్టి ర్భావపుష్టి:<br>శ్లోకానాం తే భవిష్యతి. | 107. ఈ కావ్యరచనమున నీ వాక్కు ఒకటియు అనృతము గాదు. నీవు రచించు శ్లోకములకు రసపుష్టియు, భావపుష్టియు నుండును. |
| 108. న చాపశబ్దో భవితా<br>చ చార్థగుణవిచ్యుతి:,<br>ప్రమాణం రామచరితే<br>కావ్యం తవ భవిష్యతి. | 108. నీ కావ్యమున అపశబ్దముగాని, అర్థచ్యుతి గుణచ్యుతులుగాని ఉండవు. రామచరిత్రమున నీవు రచించిన కావ్యమే ప్రమాణగ్రంథమైయుండగలదు. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము. |
|---|---|
| 109. రహస్యం చ ప్రకాశం చ<br>రామస్య చరితం మహత్,<br>తవైవ విదితం భూయా<br>న్నాన్యో జ్ఞాస్యతి తత్త్వతః. | 109. రహస్యముగ జరిగినను, ఎదురుగ జరిగినను రామ చరిత్రయంతయు నీకు బాగుగా తెలియును. ఇతరు లెవరును కూడ యథార్థ విషయమును నీవలె తెలిసికొనలేరు. |
| 110. ఇత్యుక్తే చ మయా తత్ర<br>వాక్య మూచే సరస్వతీ. | 110. ఇట్లు నేను పలుకగనే సరస్వతి ఇట్లు పలికెను. |
| **సరస్వత్యువాచ -** | **సరస్వతి పలికెను -** |
| 111. మా తే భూత్ కావ్యకరణే<br>భయం శబ్దార్థసంశ్రయం. | 111. నీకు కావ్యరచనమున శబ్దార్థముల గూర్చిన భయము అవసరములేదు. |
| 112. యథా యథా కర్షసి మాం<br>శబ్దత శ్చార్థతోపి వా,<br>తథాతథా ఽనుయాస్యే త్వాం<br>త్వదాశయవశానుగా. | 112. నీవు నన్ను శబ్దార్థములయం దెట్లు ప్రవర్తింప జేసిన అట్లే నీ అభిప్రాయము ననుసరించి నిన్ను నేను వెంబడించెదను. |
| 113. తవ యత్నం వినై వాహం<br>రసం భావం చ పోషయే,<br>త్వన్ముఖత: కృతార్థాస్యా<br>ముక్త్వా రామకథాం మునే. | 113. నీ ప్రయత్నము లేకుండగనే రసమును భావమును పోషింతును. నీవలన రామకథను నేను పలికి కృతార్థురాల నయ్యెదను. |
| 114. త్వన్మార్గాలంబనా ద్యే వై<br>కవయో రాఘవీం కథాం,<br>వివక్షన్తీహ తేషాం చ<br>భవిష్యామి వశానుగా. | 114. నీమార్గము ననుసరించి రామాయణమును జెప్పగోరు కవుల వశమందునుగూడ నేనుండ గలను. |
| 115. పశ్చాత్కవీనా మాధారం<br>కావ్యం తవ భవిష్యతి. | 115. నీ తరువాత కవులకు నీ కావ్య మాధార మగును. నీ మార్గము ననుసరించిన కవులు |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| రంజయిష్యంతి లోకాంస్తు<br>కవయ స్త్వత్ప్రథానుగాః. | గూడ లోకమును సంతోషపెట్ట గలుగుదురు. |
| 116 ఇత్యుక్తవత్యాం వాగ్దేవ్యాం<br>సావిత్రీ వాక్య మబ్రవీత్. | 116. సరస్వతి ఇట్లు పలుకగా సావిత్రి పలికెను. |
| **సావిత్రి వరప్రదానమ్ -** | **గాయత్రి వరమిచ్చుట -** |
| 117. కురు రామకథాం పుణ్యాం<br>కావ్యరూపాం మనోరమాం,<br>ప్రవిష్టా స్యాం చ తే కావ్యే<br>ప్రతిశ్లోకసహస్రకం,<br>విభక్తావయవా భూత్వా<br>చతుర్వింశతిధా హ్యహం. | 117. నీవు రామచరిత్రను మనోహరమగు కావ్యముగ రచింపుము. ప్రతి వేయిశ్లోకములయందును నేను ప్రవేశించి యుందును. నా అవయవముల విభజించి ఇరువదినాలుగు రూపములుగ నుందును. |
| 118. కావ్యచింతైకమనసా<br>త్వయా చేదనుపస్థితా,<br>న తే కుప్యామి బుద్ధే శ్చ<br>ప్రసాదం తే దదా మ్యహం. | 118. నీవు కావ్యరచనమునగల ఏకాగ్రచిత్తతచే నన్ను పిలువకున్నను నేను కోపింపక నీబుద్ధికి వికాసము నిచ్చుచునే యుందును. |
| 119. త్వన్మార్గాలంబనో యే స్యూ<br>రామస్య చరితం శుభం,<br>కావ్యాత్మనోద్యతాః కర్తుం<br>యశసే వా ధనాయ వా,<br>ప్రసీదామి చ తేభ్యోఽపి<br>తేన మే స్యా త్కృతార్థతా. | 119. నీమార్గము ననుసరించి శుభమగు రామ చరితము నెవరైనను కీర్తికొరకుగాని ధనము కొరకుగాని రచింపజూతురో వారినికూడ నను గ్రహించి కృతార్థురాల నగుదును. |
| **బ్రహ్మోవాచ -** | **బ్రహ్మ పలికెను -** |
| 120. ఇత్యేవ మనుగృహ్యైనం<br>నివృత్తాః స్మో వయం మునే! | 120. ఇట్లు పలికి మే మాతనిని అనుగ్రహించి వెడలి పోయితిమి. |
| 121. అథాయం జ్ఞానతో వీక్ష్య<br>కృత్స్నం రామస్య సత్కథాం, | 121. అటుపిమ్మట జ్ఞానమువలన రాఘవుని అను గ్రహమువలనను మాయొక్క విశేషానుగ్రహము |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| రాఘవస్య ప్రసాదేన<br>అస్మాకం చ విశేషతః.<br>రామాయణం మహాకావ్యం<br>చకార చరితవ్రతః. | వలనను శిష్టాచార సంపన్నుడైన వాల్మీకి రామకథను తెలిసికొని రామాయణమను మహా కావ్యమును రచించెను. |
| 122. చతుర్వింశతి సాహస్రం<br>శ్లోకానా ముక్తవాన్ ఋషిః. | 122. వాల్మీకి తన రామాయణ కావ్యమున ఇరువది నాలుగువేల శ్లోకములను రచించెను. |
| 123. గాయత్ర్యాద్యాక్షరం త్వాదౌ<br>విన్యస్యా రబ్ధవాన్ తతః,<br>ప్రతిశ్లోక సహస్రస్య<br>సమాప్తా వేక మక్షరం.<br>వినియుంజం శ్చ గాయత్ర్యా<br>న్యబధ్నా ద్రాఘవీం కథాం. | 123. గాయత్రియందలి మొదటి అక్షరమును తన గ్రంథాదిగ ప్రారంభించి ప్రతి వేయిశ్లోకముల చివరను గాయత్రియొక్క యొక్కొక్క అక్షరమునుగూర్చి రామాయణమును రచించెను. |
| 124. త్రివర్గమాత్రశరణ -<br>శరణ్యాం ప్రథమం మునిః,<br>శ్రీరామస్య మహీప్రాప్తి<br>పర్యంతాం నిర్మమే కథాం. | 124. వాల్మీకి మొదట ధర్మార్థకామముల గోరువారు పఠించుటకుతగునట్లు శ్రీరాముని పట్టాభిషేకము వరకే శ్రీరామకథను రచించెను. |
| 125. తత శ్చతుర్వర్గపరైః<br>సేవనీయాం ప్రయత్నతః,<br>స్వధామప్రాప్తి పర్యంతాం<br>రాఘవస్యా ఒకరో త్కథాం. | 125. తరువాత చతుర్విధపురుషార్థములను కోరువారిచే పఠింపబడదగు నట్లు శ్రీరాముడు పరమపదమునకు వేంచేయువరకుగల కథను రచించెను. |
| 126. తస్మా దుక్తం నిత్యపాఠే<br>ముముక్షూణాం చ పాఠకే,<br>నప్తాపికాండాః పాఠ్యాః స్యుః<br>షట్కాండాః ఫలకామ్యయా. | 126. కావున నిత్యము పారాయణము చేయువారును ముక్తికాములును కాండలనేడింటిని పఠించవలెను. ఫలమును కోరినచో నారు కాండలు మాత్రము పఠించవలెను. |
| 127. తస్మా న్నారద! వాల్మీకి<br>ప్రోక్తా రామస్య సత్కథా, | 127. కావున నారద! వాల్మీకులచే చెప్పబడిన రామకథ ముల్లోకములయందును ప్రసిద్ధి |

సంస్కృత మూలము

ప్రశస్తా సర్వలోకేషు,
స చ తత్కారణా న్మునిః.

ఆంధ్రానువాదము

జెందెను. రామాయణమును రచించుటచే వాల్మీకియు ప్రసిద్ధిజెందెను.

128. ఉపదేష్టృత్వా చ్చ తస్యాః
కథాయా స్తే యశః కృతే,
ఆద్యే సర్గే వర్ణిత స్త్వం
శ్లాఘ్య స్త్వం తేన భావితః.

128 నీవాకథను ఉపదేశించుటచే నీ యశమునకై ప్రథమసర్గయందు నీవు వర్ణింపబడి గౌరవింపబడితివి.

129. ఏవం త్వయా కృతాః ప్రశ్నాః
సమ్య గుత్తరితా మయా,
మునే! రామాయణం కృత్స్నం
చర గాయ న్నితః పరం.

129. ఇట్లు నీవు వేసిన ప్రశ్నలకు నేను సరియగు సమాధాన మిచ్చితిని. ఓ మునీ! ఇక నీవు శ్రీరామాయణమంతయు పాడుచు తిరుగుచుండుము. అని బ్రహ్మ నారదునిగూర్చి పలికెను.

ఇతి శ్రీ స్కందోపపురాణే పురాణవైభవ ఖండే బ్రహ్మ నారద సంవాదే రామాయణ ప్రణయనకథనం నామ చతుర్వింశోధ్యాయః.

ఇది స్కందోపపురాణమున పురాణవైభవ ఖండమున బ్రహ్మ నారద సంవాదమున రామాయణ రచనాకారణముల జెప్పుటయనెడు 24వ అధ్యాయము

* అత్ర ద్వితీయోఽధ్యాయః *

ద్వితీయము సంపూర్ణము.



సంస్కృత మూలము.

# తృతీయోఽధ్యాయః

నారద ఉవాచ –

1. తాత! ప్రీతోఽస్మి సంజాతో
రామాయణకథాశ్రవాత్,
ఇతఃపరం తాం గాస్యామి
వీణాహస్తః చరన్ముహుః.

2. మన్యే పూజ్యతమం లోకే
వాల్మీకిం మునిపుంగవం.

కామ్యపాఠక్రమః –

3. శ్రీరామాయణ వేదస్య
కామ్యపాఠః కథంవిధః.
లోకనాథ! మమ బ్రూహి
శుశ్రూషోః ప్రణతస్యచ.

బ్రహ్మోవాచ -

4. ధన్యోఽసి నారదమునే,
వక్ష్యామి శృణు తే హితమ్,
శ్రీరామాయణవేదస్య
కామ్యపాఠవిధిక్రమమ్.

5. చతుర్విధః కామ్యపాఠః
తత్తత్కాలోచితః స్మృతః.

ఆంధ్రానువాదము

# మూడవ అధ్యాయము

నారదుడు పలికెను -

1. తండ్రీ! చతుర్ముఖ! రామాయణకథను విని చాల సంతోషించితిని. ఇటుపైన వీణను ధరించి సంచరించుచు మాటిమాటికి కథను పాడుచుందును.

2. మునిశ్రేష్ఠుడగు వాల్మీకిమహర్షి లోకములో నందరికంటెను పూజ్యుడని తలచుచున్నాను.

కామ్యపాఠక్రమము -

3. ఓ లోకనాథుడా! నీకు శుశ్రూషచేయుచు నీకు వినమ్రుడనగు నాకు వేదసమానమైన శ్రీరామాయణమును కామ్యపాఠముగ నెట్లు పఠింపవలెనో తెలియజెప్పుము.

(అని నారదుడు బ్రహ్మనడుగగా బ్రహ్మ చెప్పుచున్నాడు.)

బ్రహ్మ పలికెను –

4. నారదముని! శ్రీమద్రామాయణమును కామ్యముగ పారాయణచేయు విధమును తెలిపెదను వినుము.

5. ఆయాసమయముల ననుసరించి కామ్యపాఠము నాల్గువిధములుగ నుండును.

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| **సప్తసర్గపారాయణక్రమః –** | **సప్తసర్గ పారాయణ క్రమము** |
| 6. శ్రీమత్సుందరకాండస్య సప్తసర్గప్రపాఠనం, సర్వాభీష్టప్రదం ప్రోక్త మమరాణా మపీహితమ్. | 6. సుందరకాండయొక్క సప్తసర్గ పారాయణము వలన అన్నికోరికలు సిద్ధించును. ఇది దేవతలకునుకూడ ప్రీతికరమైనది. |
| 7. శుభే దివసనక్షత్రే సంకల్ప్య విధిపూర్వకం, యథాశక్తి సువర్ణేన రజతేనాఽథతామ్రతః. | 7. శుభదివసమున శుభనక్షత్రమున యథావిధిగ సంకల్పించి తన శక్త్యనుసారము బంగారముచేగాని, వెండిచేగాని, రాగిచేగాని. |
| 8. రామస్య లక్ష్మణస్యాపి వైదేహ్యాశ్చ హనూమతః, విధాయ ప్రతిమా స్తాశ్చ ప్రతిష్ఠాప్య యథావిధి. పూజయే ద్దర్భపుంజే వా త్వరాచే ద్రఘునందనం. | 8. సీతారామలక్ష్మణహనుమంతుల విగ్రహములు చేయించి ప్రతిష్ఠింపజేసి, పూజింపవలెను, తొందరగనున్నచో శ్రీరామచంద్రుని దర్భకట్టపై నావాహనమును చేయవచ్చును. |
| 9. సహస్రనామభి ర్విష్ణో రభ్యర్చంశ్చ దినేదినే, పఠే త్సుందరకాండస్య సప్తసర్గీం విధానతః. | 9. విష్ణుసహస్రనామములచే ప్రతిదినమునను నారాధించు సుందరకాండయొక్క సప్తసర్గలను శాస్త్రోక్తముగ పఠింపవలెను. |
| 10. యదా తు సప్తమ స్సర్గః కాండ స్యాంతిమసర్గకః, భవిష్యతి తదంతం తు సప్తసర్గాణ పఠే ద్వ్రతీ. | 10. ప్రతిదినమును ఏడు సర్గలను చదువుచు కాండాంతము ఏడవసర్గతో పూర్తియగునట్లు నియమముల ననుష్ఠించుచు పఠించవలెను. |
| 11. అథ శ్రీరామచంద్రస్య సర్గం రాజ్యాభిషేచనే, | 11. కడపటిదినమున శ్రీరామచంద్రుని రాజ్యాభిషేకసర్గను చదివి పూజించి పారాయణ |

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము. |
|---|---|
| పఠిత్వా పూజయిత్వా చ<br>పఠనం తు సమాపయేత్. | మును సమాప్తిచేయవలెను. |
| 12. సమాప్తిదివసే కుర్యాత్<br>బహుబ్రాహ్మణభోజనం,<br>యద్య ద్విచింతితం చిత్తే<br>తత్సర్వం తు సమశ్నుతే. | 12. పారాయణము పూర్తియగు రోజున చాలమంది బ్రాహ్మణులకు తదీయారాధన మొనరింపవలెను. ఈ విధముగ నాచరించుటవలన తాను తన మనస్సులో కోరినవాటి నన్నింటిని పొందగలుగును. |
| పునర్వసు పారాయణక్రమః | పునర్వసు పారాయణ క్రమము – |
| 13. అథ రామాయణస్యాస్య<br>పాఠం వక్ష్యే పునర్వసౌ,<br>భుక్తిముక్తిఫలం నూతే<br>పాఠస్తస్య పునర్వసౌ. | 13. పునర్వసు పారాయణక్రమమును తెలిపెదను వినుము. పునర్వసు నక్షత్రమున శ్రీరామాయణమును పారాయణము చేసినచో భుక్తియు ముక్తియు కలుగును. |
| 14. నిర్మాయ మండపం దివ్యం<br>నానాలంకారశోభితం,<br>రత్నైర్వా మౌక్తికైర్వాపి<br>ధతుభిర్వా విశేషితైః. | 14. నానాలంకారములచే ప్రకాశించునట్లు రత్నములచేగాని, ముత్యములచేగాని ఉత్తమమగు సువర్ణాది ధాతువులచేగాని దివ్యమండపమును నిర్మించి, |
| 15. కృత్వా చిత్రా రంగవల్లీ<br>స్తత్ర వేదిం విధాయ చ,<br>అథో వ్రీహీన్ ప్రస్థమాత్రాం<br>స్తుషహీనాః ప్రసార్య చ. | 15. చిత్రములగు ముగ్గులచే నలంకరించి అచ్చట నొక పీఠమును తయారుచేసి, దానిపై తూమెడు పొల్లులేని వ్రీహులను (ధాన్యవిశేషము వడ్లు) పరచి, |
| 16. తానన్మాత్రాం శ్చంద్రశుభ్రాన్<br>తదుపర్యపి తండులాన్,<br>తత శ్చణకఖండాంశ్చ<br>నిస్తుషాః ప్రస్థమాత్రకాః. | 16. అదియే కొలతగ చంద్రునివలె తెల్లగనున్న బియ్యమును వాటిపై పోసి, అట్లే తూమెడు పొట్టులేని సెనగపప్పు వాటిపై పరచి, |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 17. తత స్తిలాన్ ప్రస్థమాత్రాన్<br>తతో మాషాన్ తథావిధాన్,<br>తదుపర్యపి గోధూమై<br>ర్మద్గై ర్వా హరితై ర్ఘృతమ్, | 17. ఆ సెనగపప్పుపై తూమెడు నువ్వులను, వాటిపై తూమెడు మినుములను పోసి, వాటిపై గోధుమలతోగాని, పచ్చని పెసలతోగాని నింపిన, |
| 18. ఘటం సంస్థాప్య తచ్ఛృంగే<br>నాళికేరఫలోపరి,<br>సువర్ణప్రతిమాం సీతా<br>రామలక్ష్మణశోభినీం. | 18. ఒక కలశమునుంచి దానిపై కొబ్బరికాయనుంచి దానిపై బంగారుచే చేయబడిన సీతారామ లక్ష్మణ ప్రతిమలను, |
| 19. నిధాయ చ ప్రతిష్ఠాప్య<br>సర్వోపకరణై ర్యుతః,<br>పూజాం పురుషసూక్తేన<br>విధాయ చ యథావిధి, | 19. ఉంచి, ప్రతిష్ఠ జేసి, సర్వసామగ్రులచే సన్నద్ధుడై పురుషసూక్తముచే యథావిధిగ పూజించి, |
| 20. అనుజ్ఞాప్య ద్విజా నగ్ర్యాన్<br>నాందీశ్రాద్ధం విధాయ చ,<br>హిరణ్యేనైవ పూర్ణేన<br>తోషకేణ ద్విజన్మనాం. | 20. బ్రాహ్మణుల యనుజ్ఞనుపొంది నాందీశ్రాద్ధము నొనరించి బ్రాహ్మణులను బంగారముచేతను పూర్ణమైన ఆనందకరమైన సన్మానములచేతను సత్కరించి, |
| 21. శ్రీరామాయణకోశే ఒథ<br>రామపూజాం విధాయ చ<br>పునర్వసుదినే శుద్ధే<br>కాలే సంగవనామకే. | 21. శ్రీరామాయణకోశమున శ్రీరామపూజ నొనరించి పునర్వసునక్షత్రయుక్త దివసమున సంగవ కాలమున శుభసమయమున, |
| 22. ఆంజనేయస్వరూపాం శ్చ<br>శ్రోతౄన్ భక్తాన్ రఘూత్తమే,<br>వృత్వా యథాసంభవం చ<br>కృత్వా చిత్తం రఘూత్తమే. | 22. ఆంజనేయునివలె రఘురామునియందు భక్తిగల శ్రోతలను వరించి, శ్రీరామచంద్రునియందు మనస్సునుంచి, |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 23. నారదేనోపదిష్టార్థ<br>సర్గ మారభ్య భక్తితః,<br>ఉచ్చైస్స్వరం రాగయుక్తం<br>పఠే త్సర్గాం స్తు వింశతిం. | 23. నారదునిచే నుపదేశింపబడిన సర్గమునుండియు ప్రారంభించి ఇరువది సర్గలను గట్టిగా రాగ యుక్తముగ పఠింపవలెను. |
| 24 స్వయమేవ పఠే చ్ఛక్తో<br>యది సర్గా నవిక్లబం,<br>నచే ద్విప్రముఖేనైవ<br>పఠేత్ తత్ స్మ్రాత్తు మధ్యమం. | 24. తానే స్వయముగ అర్థము చెడకుండునట్లు అపస్వరము లేకుండగ చదువగలిగినచో చదువవలెను. లేనిచో బ్రాహ్మణులచే చదివించ వలె. ఇది మధ్యమ తరగతిలో జేరును. |
| 25. పఠితం యచ్చ భుక్తేన<br>యచ్చ వ్యగ్రేణ వా పునః,<br>యచ్చాస్పష్టపదం భూయా<br>త్త త్సర్వం నిష్ఫలం స్మృతమ్. | 25. భుజించిన పిమ్మటగాని, అన్యమనస్సుతోగాని, వర్ణోచ్చారణ సరిగా లేకుండగాగాని చదివినచో అది నిష్ఫలమగును. |
| 26. మధ్యాహ్నే తు సమాయాతే<br>పాఠం కృత్వా సమాప్య చ,<br>పంచోపచారైః సంపూజ్యా<br>గుడాన్నాదినివేదనైః,<br>బ్రాహ్మణా న్భోజయే త్పశ్చాత్<br>దధి మధ్వాజ్యసంయుతం. | 26. మధ్యాహ్నముకాగానే పారాయణ సమాప్తిచేసి అర్ఘ్య-పాద్య-ఆచమనీయ-పుష్ప-ధూప - దీప నైవేద్యాద్యుపచారములచే పూజించి, శర్కర పొంగలి మున్నగునవి నైవేద్యముచేసి, పెరుగు నేతులతోగూడ మధుర పదార్థములతో బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. |
| 27. భోజనానంతరం సర్వైః<br>సహ విశ్రమ్య కించన,<br>ఆధృత్వా పి చ తాంబూలం<br>అనాభాష్య చ పుల్కసైః. | 27. భోజనానంతరమున విప్రోత్తములందరితోను కొంచెము విశ్రమించి తాంబూలమును సేవింపక చండాలులతో మాటలాడకుండగ - |
| 28. వక్తారం బ్రాహ్మణశ్రేష్ఠం<br>సర్వశాస్త్రార్థపారగం, | 28. సుస్పష్టమగు వాక్కుగలిగి సర్వశాస్త్రార్థములు నామూలాగ్రముగ నెఱింగి శాంతముకలిగి |

సంస్కృత మూలము

వాక్యార్థచతురం దాంతం
అలుబ్ధం సత్యవాదినం.

29. నానోపచారై స్సంపూజ్య
తోషయిత్వా చ తం ధనైః,
పూర్వం వృత్వోపవేశ్యైనం
ఉచ్చై రాసనమండలే.

30. ఉపవిశ్య తతో ఉధస్తాత్
రామే చిత్తం నిధాయ చ,
పూర్వాహ్ణే పఠితాన్ సర్గాన్
ప్రార్థయే ద్వాచయే తి చ,
తదుక్తార్థాం శ్చ శృణు యా
న్మంగలాశాసనాంతకం.

31. తతః సాయంవిధిం కృత్వా
విష్ణో ర్నామ సహస్రతః,
రఘునాథం సమభ్యర్చ్య
తతో భుక్త్వా స్వపేత్ క్రమాత్.

32. ఏవం ఏనే దినే కుర్వన్
ఉపచారై రనుక్రమాత్,
పఠిత్వా వింశతిం సర్గాన్
వాచయే చ్చ యథాక్రమమ్.

33. ప్రత్యేకదివసే కుర్యాత్
అన్యాన్యైః సంభవే సుమైః,
సహస్రనామభిః పూజాం
శ్రీరామస్య పదాబ్జయోః.

34. సీతాపాణిగ్రహో యత్ర
యత్ర సుగ్రీవసఖ్యకం,

ఆంధ్రానువాదము

లోభిగాక నిజము పల్కునట్టి బ్రాహ్మణశ్రేష్ఠుని-

29. సకలోపచారములచే పూజించి ధనాదులచే సంతోషింపజేసి, ముందుగ ప్రార్థించి ఎత్తైన ఆసనమున నాతనిని కూర్చుండబెట్టి -

30. తాను క్రింద కూర్చుండి శ్రీరాముని యందు మనస్సునిలిపి, పూర్వాహ్ణమున చదివినసర్గలను చెప్పుమని ఆతనిని ప్రార్థించవలెను. అతడు చెప్పినదానిని మంగళాశాసనము చివరవరకు నతిశ్రద్ధగ వినవలెను.

31. తరువాత సాయంకాల కృత్యముల తీర్చి విష్ణుసహస్రనామముతో రాముని పూజించి భుజించి నిద్రింపవలెను.

32. ఇట్లు ప్రతిదినమును యథావిధిగ పూజల నొనరించి దినమునకు ఇరువది సర్గలు చొప్పున చదివించి అర్థమును జెప్పించవలెను.

33. ప్రతిరోజును పలురకములపూలచే శ్రీరామచంద్రుని పాదపద్మములను సహస్రనామములతో పూజించవలెను.

34. సీతాకల్యాణసమయమునను, సుగ్రీవునితో స్నేహము చేసినసమయమునను, ఉంగరము

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము. |
| --- | --- |
| అంగులీయకదానం చ<br>రావణస్య వధ స్తథా. | నిచ్చు సందర్భమున, రావణుని వధ సమయమున - |
| 35. తత్ర తత్ర దినే కుర్యాత్<br>తూర్యలాస్యపురస్సరం,<br>అభ్యర్చ్యం రఘునాథస్య<br>వక్తారం చ ప్రపూజయేత్. | 35. మంగళవాద్యములతో రఘురాముని పూజించి రామాయణము చెప్పువారినిగూడ పూజింపవలెను. |
| 36. పఠిత్వైవంక్రమేణైవ<br>సప్తవింశతివాసరాన్,<br>పునః పునర్వసౌ ప్రాప్తే<br>రామస్య విదితాత్మనః.<br>పట్టాభిషేకసర్గం తు<br>పఠే న్మంగలపూర్వకం. | 36. ఇట్లు ఇరువదియేడు రోజులు క్రమముగా చదివి తిరిగి పునర్వసునక్షత్రము రాగానే శ్రీరామ చంద్రునకు పట్టాభిషేకమును మంగళవాద్యములతో నాచరింపవలెను. |
| 37. పునః పునర్వసుప్రాప్తి<br>స్తారావృద్ధిక్షయాదిభిః,<br>సప్తవింశే దినే చే త్స్యా<br>త్తదా తత్రైవ వాసరే,<br>శిష్టాన్ సర్గాన్ వాచయేత్తు<br>యావద్రామాభిషేచనమ్. | 37. నక్షత్రపరిమాణముల హెచ్చుతగ్గులలో పునర్వసు నక్షత్రము 27-వ రోజుననే అయినచో ఆరోజుననే రామపట్టాభిషేకమువరకు మిగిలిన అన్ని సర్గలను చదువవలెను. |
| 38. అథ వృద్ధ్యా తు సా చే త్స్యా<br>దేకోనత్రింశవాసరే,<br>అష్టావింశదినం పాఠ<br>శూన్యం కృత్వాఽర్చయే ద్విభుం.<br>ఏకోనత్రింశదివసే<br>పఠేత్ పట్టాభిషేచనం. | 38. వృద్ధిచే ఇరువది తొమ్మిదవ రోజున పునర్వసు నక్షత్రమగుచో 28-వ రోజున ఏమియు చదువక స్వామిని పూజించి ఇరువదితొమ్మిదవ రోజున పట్టాభిషేకమును చదివి శ్రీరామచంద్రుని పూజింపవలెను. |
| 39. అష్టావింశే క్రమేణైవ<br>సా చే త్తత్ర తు వాసరే, | 39. ఇరువది యెనిమిదవరోజున పునర్వసు నక్షత్రమగుచో నిరువది యేడవనాడు పట్టాభిషేక |

సంస్కృత మూలము.

పఠే త్పట్టాభిషేకాఖ్య
సర్గమాత్రం కృతోత్సవ:,
పూర్వేద్యు: పాఠసమయే
తం సర్గ మవశేషయేత్

ఆంధ్రానువాదము

సర్గమును చదువక మిగిల్చి యిరువదియెన్మిదవ నాడు పట్టాభిషేక సర్గమును మాత్రము చదివి మహోత్సవమును జేయవలెను.

40. ప్రాత:కాలే ఒహ్ని యత్రాతి
వ్యాప్తి ర్దృష్టా పునర్వసో:,
ఆరభేత చ తత్రైవ
తత్రైవ చ సమాపయేత్.

40. పునర్వసునక్షత్రము రెండుదినములున్నచో ప్రాత:కాలమున నధికవ్యాప్తిగల దినముననే ప్రారంభము చేయవలెను. అట్టిదినముననే పూర్తియు గావింపవలెను.

41. దినద్వయే సమా చే త్సా
రౌద్రవిద్ధాం పరిత్యజేత్.

41. ఆ నక్షత్రమునకు రెండుదినములయందును ప్రాత:కాలమున సమాన వ్యాప్తియున్నచో ఆర్ద్రావిద్ధను విడచి మరునాడే చేయవలెను. (పునర్వసు ప్రాత:కాలవ్యాప్తి ముఖ్యము)

42. సప్తవింశావరాన్ విప్రాన్
దధిమధ్వాజ్యపాయసై:,
భోజయే త్వరయా భక్త్యా
ధ్యాత్వా రాఘవవిగ్రహా౯.

42. ఇరువది ఏడుగురకు తక్కువ గాకుండగ బ్రాహ్మణులకు పెరుగు తేనె నేయి పాయసములచే (వారిని శ్రీరామచంద్రునిమూర్తులుగా ధ్యానించుచు) ఎక్కువ భక్తితో తదీయారాధనము జేయవలెను

43. వక్తారం పఠితారం చ
యథాశక్తి ప్రపూజయేత్.

43. అర్థము చెప్పువానిని చదువువానిని యథాశక్తిగ పూజించవలెను.

**ఏవం విధస్య పారాయణస్య ఫలమ్—**

**ఇట్టి పారాయణకు ఫలము -**

44. ఏవ మారాధితే రామే
సర్వలోకశరణ్యకే,
వంధ్యా నారీ ప్రసూయేత
పుత్రం సర్వగుణాధికం.

44. ఇట్లు సర్వలోక శరణ్యుడగు శ్రీరామచంద్రుని పూజించినచో గొడ్రాలైనను సర్వ సుగుణములు గల పుత్రుని కనును.

45. ఆపన్నో ముచ్యతే కృచ్ఛ్రా
దపమృత్యుం వ్యపోహతి.

45. ఆపదలందున్నవాడు ఆపదలనుండి విముక్తుడగును. ఎవడును అకాలమరణము పొందడు.

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| అతిక్రాంతచికిత్సాచ్చ<br>రోగా దుల్లాఘతాం వ్రజేత్. | ఔషధములచే పోని రోగములైనను త్వరలో నుపశమించును. |
| 46 భక్తిం చ రఘునాథస్య<br>పాదయో ర్విందతే దృఢాం,<br>అన్తే జ్ఞానేన ముక్త స్స్యా<br>దాన్తం స్యా ద్దుఃఖవర్జితః. | 46. శ్రీరామచంద్రుని పాదపద్మములయందు సుదృఢమగు భక్తిని పొందును, మరణ పర్యంతము దుఃఖముల వీడి జ్ఞానమార్గమున ముక్తిని పొందును. |
| 47. ఏష తూద్దేశతః ప్రోక్తో<br>మయా తే ఫలవిస్తరః,<br>నాహం పటుః ప్రవక్తుం స్యాం<br>సంపూర్ణఫలవిస్తరం. | 47. ఇంతవరకు పునర్వసునక్షత్రయుక్త రామాయణ పారాయణ క్రమమువలన కలుగు ఫలితమును కొద్దిగా చెప్పితిని. సంపూర్ణముగ చెప్పుటకు నేను సమర్థుడను కాను. |
| 48. యం యం కామయతే కామం<br>స స హస్తే భవిష్యతి. | 48. ఇట్లు పారాయణమాచరించువా రేది కోరినను సిద్ధించును. |
| 49. ముముక్షో రపి కార్యం స్యా<br>దేత త్పారాయణం భువి, | 49 మోక్షేచ్ఛ కలవాడైనను ఇట్లు రామాయణ మును పారాయణము చేయవలెను. |
| 50. ఏవం కర్తు మశక్తశ్చే<br>ద్విత్తలోభం వినా ద్విజః,<br>యథాశక్త్యర్చయిత్వా తు<br>రామం సర్వార్థసిద్ధిదం. | 50. ఇట్లు చేయజాలనివారైనచో తమ శక్త్యను సారముగ ధనలోపము లేకుండగ సర్వాభీష్ట ముల నొసగు శ్రీరామచంద్రుని యథాశక్తిగ పూజించి, |
| 51. పూర్వోక్తరీత్యా సర్గాణాం<br>కేవలం వింశతిం పఠేత్,<br>తస్యాపి ఫలసామగ్ర్యం<br>దద్యా ద్ధి రఘునందనః. | 51. పైన చెప్పినట్లు ఇరువది సర్గలు చొప్పున మాత్రమే చదువుచుండవలెను. అట్టివారికిని కూడ తప్పక శ్రీరామచంద్రుడు ఫలము నిచ్చును. |

సంస్కృత మూలము | ఆంధ్రానువాదము

**నవరాత్ర పారాయణ విధిః -**

52. అత: పరం ప్రవక్ష్యామి
నవరాత్రే తు పాఠనం.

53. చైత్రే వాఽఽఽశ్వయుజే మాసి
ప్రథమాయాం శుభే దినే,
ఆరభ్య చ నవమ్యన్తం
పఠే త్ప్రాత రపి క్రమాత్.

54. దశమ్యాం రావణవధం
పఠిత్వా తత్ర వై దినే
రామపట్టాభిషేకస్య
పఠన్ సర్గం సమాపయేత్.

55. పూర్వోక్తవిధి మాత్మిష్ఠే
దత్రాపి నియతో ద్విజ:,
అశక్త: కేవలం పాఠం
ఆచరేత్ భక్తిసంయుత:.

56. సర్వసిద్ధి స్తతో భూయాత్
ఆధివ్యాధీ వినశ్యత:,
రఘునాథ: ప్రసన్నాత్మా
తస్య స్యా దనుగ స్సదా.
పుత్ర మిత్ర కలత్రేషు
న హాని: ద్రక్ష్యతే క్వచిత్.

**ఐచ్ఛిక పారాయణ విధి: -**

57. అథ రామాయణస్యాఽస్య
వక్ష్యే మునివరోత్తమ!

**నవరాత్ర పారాయణక్రమము -**

52. ఇటుపైన తొమ్మిదిరాత్రులలో పారాయణ మొనరించు పద్ధతిని చెప్పెదను వినుము.

53. చైత్రమాసమునగాని, ఆశ్వయుజమాసమునగాని మొదటి శుభదినమున ఆరంభించి నవమివరకు ప్రాత:కాలమున పఠించవలెను.

54. పదవరోజున (దశమిరోజున) రావణవధను చదివి ఆ రోజుననే రామపట్టాభిషేకమును చదువుచు సర్గను పూర్తిచేయవలెను.

55. ఇప్పుడును పైన చెప్పినట్లే నియమముగా నాచరించవలెను. అందుకు శక్తిలేనివాడగుచో భక్తితో పారాయణము మాత్రమే చేయవలెను,

56. అట్లు చేసినచో అన్ని కోరికలు సిద్ధించి శారీరక మానసికరోగములు నశించును. శ్రీరామచంద్రుడు సంతసించి సర్వవేళలయందు అతనిని అనుసరించియుండును. భార్యాపుత్రులు మిత్రులు ఎట్టిహానియును చెందనివారలై క్షేమముగా నుందురు.

**ఇష్టానుసారముగ రామాయణమును పారాయణచేయు క్రమము -**

57. ఓ మునిశ్రేష్ఠా! కాలనియమములేని రామా-

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము. |
|---|---|
| పారాయణం త్వైచ్ఛికం యత్<br>కాలాపేక్షా న తత్ర హి. | యణ పారాయణమును చెప్పెద వినుము. |
| 58. మహావ్యాధిసముద్భూతౌ<br>విశ్లేషే బంధుజాయయోః,<br>రాష్ట్రక్షోభే చ దుర్భిక్షే<br>భూపాలాచ్చ భయాగమే. | 58 ఘోరవ్యాధులువచ్చినను, బంధువులభార్యాదుల వియోగము గలిగినను, తన రాష్ట్రమున కల్లోలము కలిగినను, దుర్భిక్షము కలిగినను రాజువలన భయము కలిగినను |
| 59. యస్యాం కస్యాం చ తారాయాం<br>జన్మర్క్షే చ విశేషతః,<br>శ్రీరామాయణకావ్యస్య<br>పారాయణ మథాచరేత్. | 59 ఏదియో ఒక నక్షత్రముననైనను శ్రీరామాయణ కావ్యమును పారాయణము చేయవలెను జన్మ నక్షత్రమున జేయుట విశేషము. |
| 60. న సర్గసంఖ్యానియమో<br>న ఘటస్థాపనాదికమ్,<br>న చాపి దినసంఖ్యాఽత్ర<br>పారాయణసమాపనే. | 60. ఇట్టి పారాయణమున సర్గలనియమము ఉండదు. కలశస్థాపనము కాని, రోజుల లెక్క కాని యుండదు. |
| 61. మంద్రస్వరం పఠేత్సర్గాన్<br>యథాసౌకర్యమేవ చ,<br>భుక్త్వా తు న పఠేత్కించి<br>న్న చ ప్రవచనం చరేత్. | 61. తనకు సుకరముగా నుండునట్లు గట్టిగాగాని మెల్లగాగాని పారాయణ మాచరింపవచ్చును. భోజనానంతరముచదువరాదు, కథచెప్పరాదు. |
| 62. పుష్పై ర్లబ్ధైశ్చ తులసీ<br>దలై ర్బిల్వదలై రపి,<br>విష్ణో ర్నామసహస్రేణ<br>ప్రయతః పూజయే త్ప్రభుం, | 62. దొరికిన పువ్వులతోను, తులసీదళములతోను (శ్రీదళము పెద్దమారేడు దళములతోగాని) విష్ణుసహస్రనామములతో భగవంతు నారాధించ వలెను. |
| 63. సర్వసంకల్పసిద్ధిః స్యా<br>దేతావన్మాత్రకే కృతే. | 63. ఈమాత్రముగ పఠించినను సర్వాభీష్టములు నెరవేరును.- |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 64. జన్మలగ్నవశాద్వాపి<br>చంద్రలగ్నవశాదపి,<br>గ్రహాణాం క్రూరతా యస్మిన్<br>కాలే భవతి దుఃఖదా. | 64. జన్మలగ్నదోషమువలనగాని, చంద్రలగ్న దోషమువలనగాని ఏకాలమున గ్రహములు క్రూరముగనుండి కష్టపెట్టునో అపుడు శ్రీరామాయణపారాయణము చేసిన నా గ్రహబాధ తొలగును. |
| 65. విశేషేణార్కపుత్రస్య<br>చంద్రపుత్రస్య వా గురోః,<br>దశా చాన్తర్దశా యత్ర<br>కాలే భవతి దుఃఖదా. | 65. ఎపుడు శనిదశాన్తర్దశలలోగాని, బుధదశాన్తర్దశలలోగాని, గురుదశాన్తర్దశలలోగాని కష్టములు సంభవించునో అపుడు శ్రీరామాయణపారాయణము చేసినచో నాబాధలు తొలగిపోవును. |
| 66. ఆత్మపీడా దారపుత్ర<br>పీడా చాపి ధనక్షయః,<br>తదా రామాయణం భక్త్యా<br>కామ్యపాఠక్రమాత్ పఠేత్. | 66. తనకుగాని తన భార్యాపుత్రులకుగాని బాధలు కలిగినను, ధననాశము కలిగినను రామాయణమును కామ్యపాఠముగ భక్తితో చదువవలెను. |
| 67. ప్రసంగా దేష కథితః<br>పాఠో రామాయణస్య తు. | 67. రామాయణపారాయణవిధానక్రమ మీవిధముగ ప్రసంగవశమున చెప్పబడినది. |
| **పునర్వసు త్రియాపేక్ష పారాయణ విధిః —** | **మూడు పునర్వసులలో రామాయణ పారాయణ విధానము —** |
| 68. ఐచ్ఛికం తుర్యపాఠం తు<br>కామ్యం వక్ష్యామి నారద! | 68. ఐచ్ఛికమును కామ్యము నగు నాల్గవవిధమును చెప్పెదను. |
| 69. పునర్వసౌ సమారభ్య<br>తృతీయే ఽథ పునర్వసౌ,<br>సమాపయే త్ప్రతిదినం<br>పఠేచ్చ దశసర్గకాన్. | 69. పునర్వసునక్షత్రమున ప్రారంభించి మరల మూడవ పునర్వసునక్షత్రమున పూర్తిచేయవలెను. ప్రతిరోజున పదిసర్గలు చొప్పున చదువవలెను. |
| 70. గీతాయా ఏకమధ్యాయ<br>మపి భక్త్యాఽఽదృతః పఠేత్. | 70. గీతలోని ఒక అధ్యాయమునుకూడ భక్తితో చదువుచుండవలెను. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 71. గృహే దేవాలయే వాపి<br>రామచంద్రస్య సన్నిధౌ,<br>పూజయిత్వా చంపకైర్వా<br>పద్మైర్వా తులసీదలైః. | 71. ఇంటిలోగాని దేవాలయములోగాని రామచంద్రుని సమీపమున సంపంగిపూవులచేగాని, పద్మములచేగాని, తులసీదళములచేగాని, |
| 72. విష్ణోర్నామసహస్రేణ<br>పాయసాపూపమిశ్రితమ్,<br>నివేదయిత్వా దివ్యాన్నం<br>ఆరభేత తతః పరం. | 72. విష్ణుసహస్రనామములతో (పూజించి) క్షీరాన్నము అపూపములతోకూడిన పరిశుభ్రమగు అన్నమును భగవంతునకు నివేదనముచేసి తరువాత పారాయణము నారంభింపవలెను. |
| 73. అనుజ్ఞాప్య ద్విజాన్ స్వర్ణైః<br>సంకల్ప్య చ యథావిధి,<br>పుణ్యాహవాచనం కృత్వా<br>కృత్వా శుద్ధం చ మండపం. | 73. బ్రాహ్మణులను బంగారముతో పూజించి వారి యనుమతినంది శాస్త్రోక్తముగ సంకల్ప మాచరించి పుణ్యాహవాచనముచేసి పరిశుభ్ర మండపమునుగూడ తయారుచేసి, |
| 74. శ్రోతార మేకం వృత్వా చ<br>పఠేద్వై దశసర్గకాన్,<br>సాయ మర్థప్రవచనం<br>నావశ్యక మిహేరితమ్. | 74. వినువానినిగూడ ఒకనిని నిర్ణయించి పది సర్గలను చదువవలెను. సాయంసమయమున నర్థముచెప్పుట ఈపారాయణమున నవసరము కాదు |
| 75. విష్ణోర్నామ్నాం సహస్రేణ<br>రామనామ్నాం శతేన వా,<br>అభ్యర్చ్య రాత్రౌ శ్రీరామం<br>తత్ప్రక్షీరం నివేదయేత్, | 75. రాత్రియందు విష్ణుసహస్రనామముచేగాని రామాష్టోత్తరశతముచేగాని శ్రీరామచంద్రుని పూజించి వేడిపాలను ఆరగింపు చేయవలెను. |
| 76. పారాయణస్య బహుకాలేన<br>సాధ్యత్వా ద్దైవయోగతః,<br>ఆశౌచేనాఽథ వా రోగైః<br>రాజోపప్లవనాదిభిః.<br>యజమానస్య విఘ్నశ్చేత్<br>స్వస్థానే ఽన్యం ప్రకల్పయేత్. | 76. ఈపారాయణము చాలకాలము జరుగవలసినది గాన దైవయోగమున అశౌచము, రోగము, రాజోపద్రవము మొదలగువానిచే పారాయణమునకు విఘ్నము గలిగినచో యజమానుడు తనస్థానమున మరియొకరిని నియమించవలెను. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము. |
|---|---|
| 77. యజమాన: పఠే ద్భక్త్యా<br>పాఠ మేనం దినేదినే,<br>అశక్త శ్చే త్తు శృణుయాత్<br>పాఠకం పరికల్ప్య చ. | 77. యజమానుడే ప్రతిదినమున ఈపారాయణమును భక్తితో నాచరింపవలెను. యజమాని స్వయముగ తాను చదువ శక్తిలేనివాడైనచో చదువుటకై మరియొకరిని ఏర్పాటుచేసి వారివలన తాను వినవచ్చును. |
| 78. చతు:పంచాశతాఽహోభి:<br>దశసర్గక్రమేణ తు,<br>ఏవం పారాయణం కృత్వా<br>తృతీయే తు పునర్వసౌ. | 78. ఏబదినాల్గురోజులలో రోజునకు పదిసర్గలు చొప్పున పారాయణమాచరించి మూడవ పునర్వసు నక్షత్రమున - |
| 79. పూర్వోక్తేన క్రమేణైవ<br>శ్రీమతో రాఘవప్రభో:,<br>మహోత్సవం ప్రకుర్వీత<br>సర్గం రాజ్యాభిషేచనం. | 79. పూర్వము చెప్పినరీతిని శ్రీరామచంద్రునకు మహోత్సవముచేసి పట్టాభిషేకసర్గను |
| 80. పఠిత్వా పూజయిత్వా చ<br>పాఠం తత్ర సమాపయేత్. | 80. చదివి పూజించి పారాయణమును ముగింపవలెను. |
| 81. కామ్యపాఠ స్త్వయం వత్స!<br>కరణీయ స్సుఖేన చ,<br>సులభ: స్యా ద్దరిద్రాణా<br>మపి సర్వార్థసిద్ధిద:.<br>అవశ్యక: త్రివర్గస్య<br>మర్త్యానాం కామనావతాం. | 81. నాయనా! కామ్యపాఠము నిట్లు సుఖముగా నాచరింపవలెను. ఇది దరిద్రులుగూడ నాచరించుటకు సులభమైనది. సర్వాభీష్టములనొసంగును. ధర్మార్థకామములను కోరువారందరకు నాచరింపదగిన విధాన మిదియే. |
| 82. పునర్వసుమహాపాఠ<br>ఉత్తమోత్తమ ఈరిత:,<br>అన్యే పాఠా శ్చోత్తమాస్స్యు:<br>యస్మా త్త్రైవర్గికా హి తే. | 82. పునర్వసునందలి పారాయణమత్యంత ముత్తమమైనది. తక్కిన పారాయణములును ధర్మార్థకామములనిచ్చునవియే గాన ఉత్తమమైనవి. |

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము. |
|---|---|
| ఇత్యుక్తో గుణవిస్తారః<br>సంగ్రహా న్నారదాఽద్య తే,<br>శ్రీరామాయణవేదస్య<br>కామ్యపారక్రమస్య తు. | ఓ నారదా! ఇపుడు నీకు ఇట్లు రామాయణ కామ్యపారాయణ విధానము సంగ్రహముగా చెప్పబడినది. |
| 83. విస్తరా ద్వక్తు మీశః స్యాత్<br>స ఏవ రఘునందనః. | 83 విస్తారముగా చెప్పవలెనన్న శ్రీరామచంద్రుడే సమర్థుడు. |
| 84. గచ్ఛ కామం చరన్ పుత్ర!<br>గాయన్ రామాయణం సదా. | 84. నాయనా! రామాయణము నెల్లప్పుడు గానము చేయుచు ఇష్టమువచ్చినట్లు సంచరింపుము. |
| | (నారదుడు పునర్వసు పారాయణదీక్షను జరుపుట) |
| **దాల్భ్య ఉవాచ -** | **దాల్భ్యుడు చెప్పెను -** |
| 85. శ్రుత్వా రామాయణస్యేత్థం<br>మాహాత్మ్యం నారదో మునిః,<br>నత్వా చతుర్ముఖం సద్యో<br>వాల్మీకి మభిగమ్య చ,<br>తం నమస్కృత్య బహుశః<br>ప్రశస్య చ పునఃపునః,<br>గీతం కుశలవాభ్యాం చ<br>శ్రుత్వా రామాయణం తతః. | 85. ఇట్లు రామాయణమాహాత్మ్యమును విని నారద ముని బ్రహ్మకు నమస్కరించి వాల్మీకివద్దకు వెళ్ళెను. మరియు నాతనికి నమస్కరించి మరలమరల స్తుతించి, కుశలవులచే గానము చేయబడిన రామాయణమును విని, తరువాత |
| 86. రామం నంతు మథాగచ్ఛత్<br>అయోధ్యాం మునిభి స్సహ. | 86. శ్రీరాముని నమస్కరించుటకు మునులతోగూడ నయోధ్యకు వెళ్ళెను. |
| 87. నిర్మాయ పర్ణశాలాం తు<br>నారదో మునిభి స్సహ,<br>గంగాద్వారే మహాపుణ్యే<br>రామపూజనతత్పరః. | 87. నారదుడును మునులతోగూడ పర్ణశాలను నిర్మించుకొని మహాపవిత్రమగు గంగాతీరమున రామపూజల నొనరించుచు |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 88. పునర్వసౌ సమారభ్య<br>శ్రీరామాయణ మాదృతః,<br>సర్గాణాం వింశతిం నిత్యం<br>పఠిత్వా విధిపూర్వకమ్. | 88. పునర్వసునక్షత్రమున రామాయణపారాయణము నారంభించి ప్రతిదినమును ఇరువది సర్గలను చదివి |
| 89. వక్తారం కల్పయిత్వాఽత్ర<br>వాల్మీకిం మునిపుంగవం,<br>వ్రతం సమాపయామాస<br>పునః ప్రాప్తే పునర్వసౌ. | 89. వాల్మీకి మహర్షిని వక్తనుగా చేసికొని తిరిగి పునర్వసురాగానే వ్రతమును పూర్తిచేసెను.<br><br>(నారదునకు శ్రీరామసాక్షాత్కారము) |
| 90. అథ దృశ్యత్వ మాపన్నః<br>సాక్షా త్తత్రోటజాంగణే,<br>స్నిగ్ధేందీవరపత్రాభః<br>పద్మరక్తాంతలోచనః. | 90. అంతట కుటీరప్రాంగణమున నారదునకు శ్రీరాముని సాక్షాత్కారమాయెను. అప్పుడు వికసించిన నల్లకలువవంటి శరీరకాంతి కలిగినట్టియు, పద్మములవలె ఎఱ్ఱనగు కనులచివరలు కలిగినట్టియు, |
| 91. యుక్తః కిరీటకటక<br>కేయూరాంగుళిభూషణైః,<br>వనమాలాయుతోరస్కః<br>పూర్ణచంద్రనిభాననః. | 91. కిరీటము, కటకములు, కేయూరములు దాల్చినట్టియు, ఉంగరములచేప్రకాశించు వ్రేళ్ళుకలిగినట్టియు, పూర్ణచంద్రునివలె ప్రకాశించు ముఖము కలిగినట్టియు, |
| 92. మందస్మితప్రభారూఢ<br>బింబోష్ఠవిలసన్ముఖః. | 92. చిరునగవుచే ప్రకాశించు ఎఱ్ఱనైన పెదవులు కలిగినట్టియు, |
| 93. వామహస్తేన కోదండం<br>దక్షిణేన చ సాయకం,<br>బిభ్రత్తూణౌ చ సంపూర్ణౌ<br>నిశితైః సాయకోత్తమైః. | 93. ఎడమచేతియందు కోదండమును, కుడిచేతియందు బాణములను ధరించి, వాడియగు బాణములచేనిండిన రెండమ్ములపొదులు ధరించినట్టియు |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 94. పార్శ్వస్థయా చ సర్వాంగ భూషణోజ్జ్వలయా పునః, సపద్మకరయా దేవ్యా సేవ్యమాన శ్చ సీతయా. | 94. తన ప్రక్కనుండి సర్వాంగభూషణములచే ప్రకాశించునట్టియు, పద్మము చేతియందు గలట్టియు సీతాదేవిచే సేవించబడుచున్నవాడై యున్నట్టియు, |
| 95. అగ్రే ధృతాంజలిం ప్రహ్వం హనుమంతం కృపాఢ్యయా, దృష్ట్యాఽనుగృహ్ణంతమపి ప్రసన్నవదనేక్షణం | 95. సీతారాముల కెదురుగా అంజలిని జోడించి వినమ్రుడై ప్రసన్నమగు ముఖమును చూపులు గల హనుమంతుని కృపాధికమగు దృష్టిచే ననుగ్రహించుచున్నట్టియు, |
| 96. సేవ్యమానో లక్ష్మణేన పార్శ్వే ప్రాంజలినా ముదా. | 96. ఒక ప్రక్కను వినమ్రుడగు లక్ష్మణునిచే సంతోషముగ సేవింపబడుచున్నట్టియు, |
| 97. నారద స్తు తమాలోక్య ప్రణిపత్య సహస్రశః, స్తుత్వా బహువిధై స్స్తోత్రై ర్వైదికై ర్లౌకికై రపి. | 97. శ్రీరామచంద్రుని గాంచి నారదుడు వేలకొలది పర్యాయములు నమస్కరించి వైదిక లౌకిక స్తోత్రములచే స్తుతించి, |
| 98. పాహి పాహీతి చ తతో ఽబ్రవీత్ ప్రేమాశ్రులోచనః. | 98. ఆనందాశ్రువులు స్రవింప రక్షింపుము రక్షింపుమని పలికెను. |
| **శ్రీరామ ఉవాచ -** | **శ్రీరామచంద్రుడు పలికెను -** |
| 99. వత్స నారద ! తుష్టోఽస్మి త్వద్రామాయణపాఠతః, పారాయణా త్పునర్వత్స్వాం విశేషానుగ్రహో మమ. | 99 నాయనా! నారద! నీ రామాయణపారాయణము వలన సంతోషించితిని. పునర్వసు రామాయణ పారాయణమువలన నేను మిక్కిలి సంతోషించితిని. |
| 100. యథాఽనేనాస్మి తుష్టోఽద్య తథా న తపసా తవ, రామాయణం యత్ర తత్ర భక్తితోఽ భక్తితోఽపి వా. | 100. నేను రామాయణపారాయణముచే సంతుష్టి నొందునట్లు నీ తపస్సుచేగూడ సంతృప్తి నొందను. భక్తితోగాని, భక్తి లేకగాని రామాయణము నెచ్చట పఠించినను, |

సంస్కృత మూలము | ఆంధ్రానువాదము

101. పఠ్యతే తత్ర సాన్నిధ్య
మహం కుర్వే యథేహ తు,
యో వాంఛతి ప్రసాదం మే
స తు రామాయణం పఠేత్.

101. ఇచ్చటనున్నట్లే అచ్చట నుందును నా అనుగ్రహము కోరువారు తప్పక శ్రీరామాయణమును పఠింపవలెను.

102. శ్రీమద్వాల్మీకివచసాం
మాధుర్యం మాం ప్రకర్షతి,
అహం చాకర్ణయిష్యామి
త్వయా చ త్వాదృశైః సహ.

102. వాల్మీకి మహర్షియొక్క వచోమాధుర్యము నన్నాకర్షించును. నీతోను, నీవంటి వారితోను, నేనుకూడ రామాయణమును విందును.

103. స చ కాలో భవేచ్ఛీఘ్రం
త్వమప్యాగచ్ఛ యత్నతః,
ప్రియతా మద్య చ వరో
యథేష్టం ప్రదదామి తే.

103 అట్లు రామాయణము వినుసమయ మతిత్వరలోనే కలుగును. నీవు తప్పక అప్పుడు రమ్ము. నీ కభిమతవరమును కోరుకొనుము, ఇవ్వగలను. (అని నారదుని రామాయణ పునర్వసు పారాయణమువలన సంతసించి ప్రత్యక్షమైన శ్రీరామచంద్రుడు పలికెను.)

నారద ఉవాచ –

నారదుడు పలికెను -

104. కిమిహాద్య వరైః కార్యం
నిస్సంగస్య మమేతరైః,
అయం వరో మే పరమో
యదేవం త్వాం విలోకయే.

104. ఇతర విషయములందాసక్తిలేని నాకు వరములతో నేమి ప్రయోజనము నిన్ను జూచు భాగ్యముగల ఈ వరమే నాకు మిక్కిలి గొప్పది.

105. దృష్టా మయా శంఖచక్ర
గదాపీతాంబరాన్వితా,
కౌస్తుభాభరణగ్రీవా
లక్ష్మీయుక్తా రసాన్వితా.
తపసా క్షీరపాథోధౌ
మూర్తి ర్నారాయణాహ్వయా.

105. శంఖచక్రగదాపీతాంబరములచే కూడినట్టియు, కౌస్తుభాభరణముచే నలంకరింపబడినట్టియు, లక్ష్మీదేవితో ప్రకాశించు వక్షఃస్థలము కలిగినట్టి నారాయణుడను పేరుగల నీ రూపమును క్షీరసముద్రమునజూచితిని.

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| వైకుంఠస్థానగా మూర్తి:<br>భుజాష్టకవిభూషితా,<br>సునందనందప్రముఖై:<br>సేవితా నిత్యసూరిభి:. | వైకుంఠమునందు అష్టభుజములతో, నలంకరింపబడి సునందనందాదులచేతను నిత్యసూరులచేతను సేవింపబడు నీ రూపమును జూచితిని. |
| 106. దృష్టా తప:ప్రభావేన<br>కృపయా దర్శితా త్వయా. | 106. తప:ప్రభావమునను, నీ దయచేతను నీ రూపమును జూచితిని. |
| 107. నరనారాయణాభిఖ్యే<br>లోకరక్షార్థ మాదృతే,<br>తపస్వివేషే తే మూర్తీ<br>దృష్టే బదరికాశ్రమే. | 107. లోకరక్షణకై ఆదరింపబడి మునివేషములో నున్న నీ నరనారాయణరూపములను బదరికాశ్రమమున జూచితిని. |
| 108. సర్వావతారబీజాత్మా<br>వైరాజీ సాపి తే తను:,<br>నానావిశ్వమయీ దృష్టా<br>శ్వేతద్వీపే మయా పురా. | 108. అన్ని అవతారములకు బీజభూతమై ప్రకాశమానమైన విశ్వరూపమును శ్వేతద్వీపమున జూచితిని. |
| 109. న తథా హర్ష మగమం<br>యథాఽద్య తవ దర్శనాత్. | 109. ఇన్ని పర్యాయములు దర్శించితిని కాని నేడు నిన్ను జూచినందువలన నాకు కలిగిన యానందానుభవము ఇంతవరకు దర్శించిన నీయొక్కయేరూపదర్శనమువలనను కలుగలేదు. |
| 110. బాణకోదండపాణేశ్చ<br>జానక్యా సేవితస్య చ,<br>దివ్యతేజోనిధేస్తేఽద్య<br>దర్శనా న్నిర్వృణో మ్యహం. | 110. బాణమును కోదండమును ధరించి సీతాదేవిచే సేవింపబడు నీ దివ్యతేజోరూపమును నేడు చూచి నేను చాల యానందించుచున్నాను. |
| 111. మనో మే మోదతేఽత్యర్థం<br>మన్యే పూర్వం న చేదృశం. | 111. నా మనస్సు మిక్కిలి సంతసించుచున్నది పూర్వమెప్పుడును ఇంత యానందము కలుగలేదని నేను తలచుచున్నాను. |

సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము

112. తదహం ప్రార్థయే త్వా ఽద్య
వరం సర్వవరోత్తమం,
యదాయదా ఽహం వాంఛామి
ద్రక్ష్యామి త్వాం తదా తదా.
ఏవం బాణధనుష్పాణిం
సీతాలక్ష్మణసేవితం.

112. కావున నేను నిన్ను నేడు మిక్కిలి యుత్కృష్ట మగు వరము నొకదానిని వేడుచున్నాను. ఇట్లు ధనుష్పాణివై సీతాలక్ష్మణులచే సేవింపబడు నీరూపమునే నేనెపుడు కోరిన నపుడు చూచు నటుల నాకు వరమిమ్ము

113. అచంచలా చ త్వద్భక్తిః
స్యా న్మే కారుణ్యత స్తవ.

113. నీ దయవలన నాకు నీయందు దృఢమగు భక్తియుండుగాక!

114. కిం చైవం కామ్యపాఠేన
శ్రీరామాయణ మాదరాత్,
పునర్వసౌ సమారభ్య
యః పఠే ద్విధిపూర్వకం.

114. ఏ మనుష్యుడు పునర్వసు నక్షత్రమున ప్రారంభించి కామ్యపాఠముగ శ్రీరామాయణమును పారాయణము జేయునో

115. భక్తితో దంభతో వాఽపి
తస్య త్వం ప్రీతమానసః,
ధర్మార్థకామమోక్షాఖ్యం
చతుర్వర్గం దిశ ప్రభో.

115. అతడు భక్తితో చదివినను డంబముతో చదివినను నీవు సంతసించి ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములను అనుగ్రహింపుమా.

116. పుత్రాన్ పౌత్రాన్ సంపదశ్చ
జ్ఞాన మన్తే చ సోఽశ్నుతామ్.

116. అట్టివాడు పుత్రులను పౌత్రులను సంపదలను పొంది తుదకు జ్ఞానమును పొందునుగాక.

**శ్రీరామ ఉవాచ -**

**శ్రీరాముడు పలికెను --**

117. సత్యముక్తం త్వయా బ్రహ్మన్!
మద్భక్తా మామకీం తనుం
కోదండపాణిం సంద్రష్టుం
సమీహంతే న చాన్యథా.

117. ఓ నారద! నీవు నిజము పలికితివి. నా భక్తులు కోదండము ధరించిన ఈ నా రూపమును చూడగోరుదురు గాని యితర రూపమును మెచ్చరు.

118. ఈదృశీ మే తనుః పూర్వం
స్వతేజఃపుంజసంవృతా,

118. నా తేజఃపుంజముచే నావరింపబడిన ఈ నా శరీరము కోటిసూర్యులతో సమానమగు

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము. |
| --- | --- |
| కోటిసూర్యసమాభాసా<br>రక్తచందనసేవితా. | కాంతిగలట్టియు, రక్తచందనముచే నలంక-<br>రింపబడినట్టియు, |
| 119. సీతయా సేవితా పార్శ్వే<br>వాలవ్యజనహస్తయా,<br>మాయాం దర్శనమాత్రేణ<br>నిహంత్రీ భేదధీప్రదామ్. | 119. పార్శ్వభాగముననుండి చామరమును చేతియం<br>దుంచుకొనిన సీతచే సేవించబడుచున్నట్టియు,<br>భేదజ్ఞానము పుట్టించు మాయను దర్శనమాత్ర<br>ముననే హరించునట్టిదియునగు ఈరూపమును |
| 120. చిర మాశాసమానాయ<br>మత్ప్రసాదాభికాంక్షయా,<br>సనత్కుమారా ద్విజ్ఞాయ<br>మమావిర్భావ మంజసా. | 120. నా అనుగ్రహమును పొందగోరి చాలకాలము<br>నుండి నా యీ రూపదర్శనము నెదురుచూచు<br>చున్నట్టియు, సనత్కుమారునివలన నేను<br>అవతరింపనుండుట నెఱింగి, |
| 121. సారథ్యా న్మంత్రికృత్యాచ్చ<br>ఇక్ష్వాకుకులసేవినే,<br>దర్శితా ఽభూ త్సుమంత్రాయ<br>ప్రస్థాస్యే ఽహం యదా వనం. | 121. సారథిగను, మంత్రాలోచనలను చెప్పు<br>మంత్రిగను నుండి ఇక్ష్వాకుకులమును సేవించు<br>సుమంత్రునకు నేను వనమునకేగు సమయమున<br>జూపితిని. |
| 122. శబర్యై శరభంగాయ<br>వాలినే చ ముమూర్షవే,<br>దర్శితా ఽభూ దిదానీం త్వం<br>దృష్టవాన్ మత్కథాబలాత్. | 122. శబరికిని, శరభంగునకును, చనిపోవ సిద్ధముగా<br>నున్న వాలికిని ఈ రూపమును జూపితిని;<br>నేడు నా కథాపఠనబలమున నీవును నా ఈ<br>రూపము చూడగలిగితివి. |
| 123. నిత్యం రామాయణం యే వా<br>పఠేయుః కామతో ఽపి వా,<br>ముక్తయే వా ఽపి తే సర్వ<br>ఏవం రూపం తు మాం మునే! | 123. కోరికలు కోరిగాని, మోక్షముకొరకు గాని<br>ఎవరు రామాయణమును పఠింతురో వారందరు<br>ఈ రూపమును, |
| 124. అన్తే దృష్ట్వా ప్రాప్నుయు ర్మాం<br>నాత్ర కార్యా విచారణా. | 124. మరణకాలమున సేవించి నన్నే పొందుదురు;<br>ఇందు సందియము లేదు. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము. |
|---|---|
| 125. యే వా పునర్వసుదినే<br>సమారభ్య యథావిధి,<br>శ్రీమద్రామాయణం భక్త్యా<br>పఠేయుః పుత్రకామ్యయా. | 125. ఏ మనుజులు పుత్రులనుగోరి పునర్వసురోజున శ్రీరామాయణమును ప్రారంభించి భక్తితో చదువుదురో, |
| 126. ధనాప్తయే వా విపదాం<br>తారణాయాఽథవా మునే!<br>అన్తే తేషాం సుప్రసన్నః<br>పాఠస్యాస్య యథేప్సితం. | 126. లేక ధనము పొందుటకుగాని, అపదలను పోగొట్టుకొనుటకుగాని పఠింతురో, వారికి ప్రసన్నుడనై వారి కోరికలను, |
| 127. సర్వాన్కామాన్ దదామ్యేవ<br>న తే శోచంతి భూతలే. | 127. అన్నింటిని ఇచ్చెదను. వారెపుడును భూమిపై దుఃఖముల నొందరు. |
| 128. ప్రారబ్ధమపి దుఃఖం స్యాత్<br>తేషాం నిర్వీర్య మంజసా. | 128. వారి ప్రారబ్ధకర్మరూప దుఃఖముగూడ క్షణములో నిర్వీర్యమగును. |
| 129. నాహం స్వాధ్యాయతో వాపి<br>బాహాభ్యంతరపూజనాత్,<br>తపసా త్యాగతో వాఽపి<br>ప్రసీదామి తథా మునే!<br>యథా రామాయణకథా<br>పఠనశ్రవణాదిభిః. | 129. నేను వేదాధ్యయనముచేగాని, హృదయమున అంతరాత్మరూపునిగను, బయట విగ్రహరూపునిగను పూజించుటవలనగాని, తపస్సుచేగాని, త్యాగమువలనగాని దేనివలననైనను సరియే శ్రీరామాయణపారాయణమును వినుటవలన ఎంతగ ప్రసన్నుడ నగుదునో, అంతగ ప్రసన్నుడను కాను |
| 130. దర్శయిష్యామి తే మూర్తిం<br>ఏవం రూపాం మనోరమాం,<br>యదాయదా వాంఛసి త్వం<br>యత్ర క్వాపి మునీశ్వర ! | 130. ఓ నారద ! నీవు ఎచట ఎప్పుడు కోరిన నచ్చట ఈ మనోహరరూపమును చూపగలను. |
| 131. మత్ప్రసాదా ద్దక్షశాపో<br>న త్వా మభ్యభవ న్మునే. | 131. ఓ మునీ! నా అనుగ్రహమువలన దక్షశాపము నిన్ను పీడింపదు. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 132. అత్ర స్థితం మాసమాత్రం<br>క్షణమాత్ర మతఃపరం,<br>నాత్ర స్థేయ మిత స్తస్మాత్<br>గచ్ఛ లోకా న్యథాసుఖమ్. | 132. నీవిటనుండిన నెలదినములును క్షణమాత్రముగ గడచినవి. ఇంక నీవిట నుండరాదు. నీకిష్టము వచ్చిన లోకముల కేగుము. |
| 133. త్వం చ నిత్యం చరన్ గాయేః<br>శ్రీరామాయణ మాదృతః,<br>ప్రకాశయ కథా మేతాం<br>లోకానాం సుఖసిద్ధయే. | 133. నీవు ఆదరపూర్వకముగ రామాయణమును పాడుచు లోకములకు సుఖము కలుగుటకై ఈ నా కథను వెల్లడిచేయుము. |

## శ్రీరాముడు వాల్మీకితో నిటులనెను –

| | |
| --- | --- |
| 134. వాల్మీకే త్వం చ శిష్యాభ్యాం<br>గాయద్భ్యాం మత్కథాం సదా,<br>ఆనంద మాప్నుహి పరం<br>నాన్యలభ్యాం కథంచన. | 134. ఓ వాల్మీకిమహర్షీ! నీవును ఇతరుల కలవిగాని నా కథను నీశిష్యులు పాడుచుండగా విని సంతసింపుము. |
| 135. ఆహరిష్యా మ్యశ్వమేధం<br>స్వర్ణసీతాసమన్వితః,<br>ఆగచ్ఛ సహ శిష్యాభ్యాం<br>మత్పుత్రాభ్యాం సహాధ్వరం. | 135. నేను బంగారు సీతతో అశ్వమేధయాగ మొనరించునపుడు నీ శిష్యులగు నా పుత్రులతో గూడ యాగమునకు రమ్ము. |
| 136. తదా కర్మాంతరే కావ్యం<br>త్వత్కృతం మత్కథాశ్రయం,<br>శ్రోష్యామి బహుభి స్సార్ధం<br>సభాయాం రాజభి స్సహ. | 136. అపుడు నేను చాలమందిరాజులతో యాగమున గూడిన సభలో యాగక్రియా విశ్రాంతి సమయములందు నా కథచే కూర్పబడిన నీచే రచింపబడిన రామాయణకావ్యమును విందును. |
| 137. అశ్వమేధకథాఘట్టం<br>మునిభి శ్చ భవాదృశైః<br>అన్తం తత శ్చ శ్రోష్యామి<br>త్వం యశోభా గ్భవిష్యసి. | 137. అశ్వమేధ కథాఘట్టమును తుదివరకు నీవంటి మునులతో గూడ విందును. నీవును కీర్తిమంతుడ వగుదువు. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 138. పుత్రౌ చ స్వీకరిష్యామి<br>సర్వలోకస్య సన్నిధౌ. | 138. అందరు చూచుచుండగా నా పుత్రులనుగూడ స్వీకరింతును. |
| 139. ఇదం రహస్యం ప్రోక్తం తే<br>త్వయా ప్రోక్తం చ కావ్యకే. | 139. ఈ రహస్యము నీకు నేను చెప్పితిని. నీవు కూడ నీ రామాయణకావ్యమున చెప్పితివి. ఈ విషయము రహస్యమైనది సుమా. |
| 140. త్వం నివత్స్యసి మల్లోకే<br>మత్సమో బహుకల్పకం,<br>మామేవైష్యసి చాన్తే త్వం<br>సత్యం ప్రతిశ్రుణోమి తే. | 140. నీవు నా సారూప్యమును పొంది అనేక కల్పముల వరకు నా లోకముననుండి చివరకు నన్నే పొందెదవు. నేను నీకు నిజము చెప్పుచున్నాను. అని శ్రీరాముడు వాల్మీకితో పలికెను. |
| **దాల్భ్య ఉవాచ –** | **దాల్భ్యుడు చెప్పెను -** |
| 141. ఇత్యుక్త్వాంతర్హితో రామః<br>సీతాద్యై రనుగై స్సహ. | 141. అని పలికి రాముడు సీతాదిసహచరులతో నంతర్ధానమాయెను. |
| 142. అద్యాపి గాయతి మునిః<br>చరన్ రామాయణం సదా. | 142. నేటికిని నారదమహర్షి ఎల్లప్పుడును రామాయణమును పఠించుచు తిరుగుచుండును. |
| 143. స ఏన మర్థం ప్రావోచత్<br>వ్యాసాయామితతేజసే. | 143. అత డీవార్తను అమితతేజశ్శాలియగు వ్యాసునకు చెప్పెను. |
| 144. ఉపాదిశ త్స్వపుత్రాయ<br>సోఽపి రాజన్ శుకాయ చ, | 144. ఓ ధర్మరాజా! అతడు తన పుత్రుడగు శుకున కెఱింగించెను. |
| 145. స మే కథితవాన్ పూర్వం<br>ప్రసంగాత్ భక్తసంసది,<br>మయా తవోపదిష్టం చ<br>శ్రీరాయణవైభవం. | 145. అతడొక పర్యాయము భక్తుల సభలో ప్రసంగవశమున నాకు దానిని చెప్పెను. దానిని నేను నీ కుపదేశించితిని. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 146. త్వం చాదిత్యే సమాయాతే<br>మదుక్తవిధిపూర్వకం,<br>పఠ రామాయణం భక్త్యా<br>వక్తారం పరికల్ప్య చ.<br>శ్రోతౄంశ్చ పరమోదారాన్<br>తరిష్యసి మహాపదం. | 146. నీవు పునర్వసునక్షత్రము రాగానే నేను చెప్పిన ప్రకారముగ వక్తనొకనిని నియమించుకొని భక్తితో రామాయణమును చదువుము, వినువారినికూడ మిక్కిలి ఉదారులను కూర్చుకొని మహాపదలను దాటగలవు. |

(ధర్మరాజు పునర్వసు పారాయణ మొనరించుట)

| యుధిష్ఠిర ఉవాచ – | ధర్మజుడు పలికెను – |
|---|---|
| 147. శ్రీమన్మునిగణశ్రేష్ఠ<br>దాల్భ్య సర్వజ్ఞ సంమత !<br>ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి<br>విపదం తారితోఽస్మి చ. | 147. మునిశ్రేష్ఠుడవగు నోదాల్భ్యమహర్షీ ! సర్వజ్ఞుడవని అందరిచే సమ్మతింపబడినవాడా ! ధన్యుడనైతిని. అనుగ్రహింపబడితిని. ఆపదలనుండి నీవలన నుద్ధరింపబడితిని. |
| 148. అహం రామాయణం భక్త్యా<br>పఠిష్యామి పునర్వసౌ,<br>వక్తా భవ మహాభాగ !<br>నాన్యోఽస్తి మమ సంమతః. | 148. నేను భక్తితో పునర్వసు నక్షత్రమున రామాయణము చదివెదను. పూజ్యుడా ! నీవే నాకు వక్తగా నుండుము. నాకు మరియొకనిని వక్తగా నుంచుట కిష్టములేదని ధర్మజుడు దాల్భ్యుని ప్రార్థించెను. |

| శ్రీసూత ఉవాచ - | శ్రీ సూతుడు పలికెను – |
|---|---|
| 149. ఇత్యుక్త్వా పాండుతనయః<br>సంభారాన్ భ్రాతృభి ర్ముదా,<br>సంపాద్య చ తతో వృత్వా<br>శ్రోతౄన్ భక్తాన్ రఘూత్తమే. | 149. ధర్మజు డిట్లుపలికి కావలయు సామగ్రులను తమ్ములతోకూడ సంపాదించినవాడై తరువాత శ్రోతలను రఘురామునియందు భక్తికలవారిని సంపాదించి |
| 150. దాల్భ్యం వక్తార మాధాయ<br>ద్వారకాం ప్రేష్య చానుజాన్,<br>గోవిందం చ సమానీయ<br>ప్రోక్తవాన్ స్వమనీషితం. | 150. దాల్భ్యుని వక్తనుగా జేసికొని తమ్ములను ద్వారకకు పంపి శ్రీకృష్ణుని రావించి తన కోరికను తెలిపెను. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 151. స చైన మబ్రవీ ద్రాజ! తుష్టోఽస్మి తవ కార్యతః. | 151. అంతట శ్రీకృష్ణుడును "రాజా! నీవు చేయ దలచిన కార్యమునకు నేనెంతయు సంత సించితిని |
| 152. అస్మిన్న ప్యవతారేఽహం మమ పూర్వావతారకే, రామాత్మకే య చ్చరితం తద్యో వర్ణయతే ముదా. | 152. నా పూర్వావతారమగు శ్రీరామావతారమున జరిగిన చరిత్రను ఎవడేని సంతోషముగా వర్ణించినయెడల నేను ఈ కృష్ణావతారమున గూడ |
| 153. తదా పరవశో రాజ౯ భవామి ప్రీతమానసః, కిముతాద్య మహీపాల! శ్రీరామాయణపాఠతః. | 153. పరవశుడనై సంతసింతును. ఓ రాజా! శ్రీరామాయణపారాయణమువలన నింక సంత సింతునని వేరుగ చెప్పవలెనా? |
| 154. చర త్వయం విధిః సర్వం శ్రోష్యామి చ సహ ద్విజైః. | 154. ఈపద్ధతియంతయు జరుగుగాక! నేనును బ్రాహ్మణులతో నంతయు విందును. |
| **సూత ఉవాచ –** | **సూతుడు పలికెను –** |
| 155. తతో యుధిష్ఠిరో రాజా సంకల్ప్య విధిపూర్వకం, ద్రౌపద్యా సహ ధర్మాత్మా పునర్వసుమహాదినే. | 155. తరువాత ధర్మరాజు యథావిధిగ సంకల్పించి ద్రౌపదీదేవితోకూడ పునర్వసు మహాదినమున |
| 156. రామాయణం యథాన్యాయం సమారభ్య పఠ౯ స్వయం, సమాపయచ్చ విధినా కృత్వా కృష్ణం సభేశ్వరం. | 156. రామాయణమును యథావిధిగ నారంభించి స్వయముగా చదువుచు కృష్ణుని సభాపతిగ నుంచి పూర్తిచేసెను. |
| 157. యదా సభాం పూజయితుం ఉత్థితో ధర్మనందనః, | 157. ధర్మరాజు సభను పూజించుటకు లేచినంతనే అచ్చట కృష్ణుడు కానరాకపోగా నాతని |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| న దదర్శ తదా కృష్ణం<br>తత్స్థానేఽన్యం దదర్శ హ. | స్థలములో మరియొకని గాంచెను. |
| 158. సవ్యే పాణౌ చ కోదండం<br>దక్షిణే చాపి సాయకం,<br>సీతాలక్ష్మణసంసేవ్యం<br>పాదాన్తే చ హనూమతా. | 158. (ఆతడెవ్వడనిన) ఎడమచేతియందు కోదండ మును, కుడిచేతియందు బాణమును (ధరించి) సీతా, లక్ష్మణులచే పూజింపబడుచున్నట్టియు, పాదమూలమున హనుమంతునిచే పూజింప బడుచున్నట్టియు, |
| 159. శ్రీరామం పుష్పవర్షేణ<br>కీర్యమాణం నభఃసదాం,<br>సూర్యకోటిసమాభాసం<br>ప్రసన్న వదనాంబుజం | 159. ఆకసమునుండి దేవతలు తనపై పుష్పవర్షము కురియించుచుండగా కోటిసూర్యులవలె ప్రకాశించుచున్న ప్రసన్నమైన ముఖపద్మము కలిగినట్టి శ్రీరామచంద్రుని |
| 160. దృష్ట్వా పరవశో భూత్వా<br>హర్షేణ కురునందనః,<br>సహస్రకృత్వః ప్రాణంసీత్<br>తుష్టావ చ పునఃపునః. | 160. ధర్మజుడు చూచి సంతోషముచే పరవశత్వము నొంది వేలకొలది నమస్కారములజేసి మిక్కిలి స్తోత్రము చేసెను. |
| 161. పాద్యార్ఘ్యాచమనీయేన<br>సమ్య గారాధయన్ముదా. | 161. సంతోషముతో అర్ఘ్యపాద్యాచమనీయాదులచే పూజించెను. |
| 162. భగవానపి సర్వాత్మా<br>రాజాన మిద మబ్రవీత్. | 162. సర్వజ్ఞుడగు భగవానుడు రాజునుగూర్చి ఇట్లు పలికెను. |
| **శ్రీభగవానువాచ -** | **పరమాత్మ పలికెను -** |
| 163. తుష్టోఽస్మ్యనేన విధినా<br>శ్రీరామాయణపాఠతః,<br>అవాప్స్య స్యఖిలాన్ కామా<br>నన్తే సాయుజ్య మేష్యసి. | 163 ఇట్లు రామాయణపారాయణమువలన సంత సించితిని. నీవన్ని కోరికల ననుభవించి చివరకు నా సాయుజ్యమును పొందగలవు. |

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 164. శత్రూన్ హనిష్య స్యఖిలాన్<br>ప్రతిజ్ఞాన్తే నృపోత్తమ !<br>రాజ్యం ప్రాప్స్యసి భూయోఽపి<br>భ్రాతృభిః పరివారతః. | 164. నీ గడువుగడిచినంతనే శత్రువులను జయింతువు. రాజ్యమును మరల నీ సోదరపరివారములతో పొంది సుఖింతువు |
| 165. ఇత్యుక్త్వాఽఽసీ త్పునః కృష్ణః<br>సర్వాలంకారశోభితః. | 165. అని పలికి కృష్ణుడు సర్వాలంకారములతో మరల ప్రత్యక్షమాయెను. |
| 166. సదస్యా విస్మయాంభోధౌ<br>మగ్నాః శ్రీరామదర్శనాత్,<br>తుష్టువుః ద్వారకానాథం<br>తన్మాహాత్మ్యవశీకృతాః. | 166. శ్రీరామచంద్రుని దర్శనభాగ్యముచే సభలోని వారందరు ఆశ్చర్యమును పొందిరి. శ్రీకృష్ణ పరమాత్మయొక్క మాహాత్మ్యమునకు వశమైన వారై అందరు ద్వారకానాథుడగు శ్రీకృష్ణుని స్తోత్రముచేసిరి. |
| 167. రాజాపి కర్మ తత్సమ్యక్<br>సమాప్య విధిపూర్వకం,<br>అన్నైశ్చ షడ్రసోపేతైః<br>సూర్యపాత్రవినిర్మితైః. | 167. రాజును మిగిలిన కర్మకాండనంతయు యథా విధిగ పూర్తిచేసి సూర్యపాత్రచే నిర్మింపబడిన షడ్రసోపేతమగు అన్నములతో |
| 168. బ్రాహ్మణాన్ భోజయామాస<br>సహస్రాధికసంఖ్యయా. | 168. వేలకొలది బ్రాహ్మణులకు భోజనము నిడెను. |
| 169. వక్తారం పూజయామాస<br>కృష్ణదత్తై ర్ధనాదిభిః. | 169. రామాయణమును చెప్పవానికి కృష్ణునిచే నీయబడిన ధనాదుల నొసగి పూజించెను. |
| 170 తతో వ్యతీతే వనవాసదుఃఖే<br>జిత్వా రిపూన్ భీష్మముఖాన్ మహాత్మా,<br>సహోదరైః సేవితపాదపద్మో<br>మహీం ప్రపేదే మహతీం ముదం చ. | 170. వనవాసమువలన కలిగిన కష్టము ఉపశమించి నంతనే భీష్మాదిమహావీరులగు శత్రువులను జయించి సహోదరులచే సేవింపబడు పాద పద్మములు కలవాడై రాజ్యమునొంది సంతసించెను. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| **సూత ఉవాచ -** | **సూతుడు పలికెను –** |
| 171. యో రామాయణమాహాత్మ్యం<br>ఇద ముక్తం మునీశ్వరాః,<br>పఠేద్వా శృణుయాద్వా పి,<br>స రామే భక్తిమాన్ భవేత్.<br>శ్రీరామస్య ప్రసాదేన<br>సర్వాన్ కామా నవాప్నుయాత్. | 171. ఓ మునీశ్వరులారా! ఈ చెప్పబడిన రామాయణమాహాత్మ్యము నెవ్వడు పఠించునో వినునో యాతడు శ్రీరాముని యందు భక్తికలిగినవాడగును. మరియు శ్రీరామచంద్రుని యనుగ్రహముచే కోరికలన్నిటిని పొందగలుగును. అని సూతుడు మునులతో చెప్పెను. |
| ఇతి శ్రీస్కందోపపురాణే పురాణవైభవఖండే బ్రహ్మనారదసంవాదే రామాయణమాహాత్మ్యే కామ్యపాఠనిరూపణం నామ పంచవింశోఽధ్యాయః | ఇది శ్రీస్కందోపపురాణమున పురాణవైభవఖండమున బ్రహ్మనారదసంవాదమున రామాయణ మాహాత్మ్యమున కామ్యపాఠ నిరూపణమను ఇరువదియైదవ అధ్యాయము. |
| * అత్ర తృతీయోఽధ్యాయః * | * మూడవ అధ్యాయము సమాప్తము. * |

## కుమారసంహితోక్తః శ్రీరామాయణ నవాహ పారాయణవిధిః.

సంస్కృత మూలము.

**మాండుకర్ణి రువాచ -**

1. కుంభసంభవ ధర్మజ్ఞ
విష్ణుభక్త నమోఽస్తు తే,
రామాయణస్య యత్ ప్రోక్తం
నవాహపఠనం త్వయా.

2. విస్తరా చ్ఛ్రోతు మిచ్ఛామి
తదద్య మునిపుంగవ,
పూజా పారాయణం దానం
జపహోమార్చనాదికం,
కథం కార్యం కదావాపి
కుత్ర వా వద విస్తరాత్.

**అగస్త్య ఉవాచ -**

3. మునే వక్ష్యామి తే పృష్టం
శ్రూయతా మవధానతః,
తుష్టో స్మ్యనేన ప్రశ్నేన
రాఘవం స్మారితో స్మ్యహం.

4. ధర్మకామనయా వాపి
అర్థకామనయా పి వా,
మోక్షకామోఽథవా రామ
ప్రీతిమాత్రాభిలాషతః.

## కుమారసంహితయందు చెప్పబడిన శ్రీరామాయణమును తొమ్మిదిరోజులలో పారాయణముచేయు విధానము.

ఆంధ్రానువాదము.

**మాండుకర్ణి పలికెను -**

1. ధర్మముల నెఱింగిన అగస్త్యమహర్షీ! విష్ణువు నందు భక్తికలవాడా! నీకు నమస్కారము. రామాయణమును తొమ్మిదిరోజులలో చదువు విధానమును చెప్పితివి.

2. ఓ మునిశ్రేష్ఠా! దాని నిపుడు విస్తరించి వినగోరుచున్నాను. దాని పూజయు, పారాయణము, దానము, జప, హోమ, అర్చ నాదులను ఎటుల, ఎపుడు, ఎచ్చట నాచ రింపవలసినదియును, సవిస్తరముగా చెప్పుమని మాండుకర్ణి అగస్త్యు నడిగెను.

**ఆగస్త్యుడు పలికెను -**

3. ఓ మాండుకర్ణిమహర్షీ! నీవడిగిన దానిని చెప్పెదను. సావధానముగా వినుము. నీ ప్రశ్నచే సంతసించితిని. నేను రాఘవుని తలచునట్లు చేసితివి.

4. ధర్మార్థకామమోక్షములను కోరికాని, రాముని ప్రీతినిమాత్రమే కోరిగాని

| సంస్కృతమూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 5. అపస్మారాదిరోగైశ్చ<br>దుశ్చికిత్స్యైః ప్రపీడితః,<br>నవగ్రహాణాం దౌష్ట్యేన<br>పీడితో వాపి చైకదా. | 5. లేక చికిత్స చేయుటకు సాధ్యముగాని అపస్మారాది రోగములచే పీడింపబడిగాని, ఒకవేళ నవగ్రహములచే బాధితుడైగాని, |
| 6. శ్రీమద్రామాయణాఖ్యస్య<br>ఇతిహాసోత్తమస్య చ,<br>నవాహపఠనం కృత్వా<br>సర్వం సౌఖ్య మవాప్నుయాత్. | 6. శ్రీమద్రామాయణమను ఈ మహోత్కృష్టమగు ఇతిహాసమును తొమ్మిదిరోజులలో చదివినచో అట్టివారందరునుకూడ సర్వసౌఖ్యములను పొందగలరు. |
| 7. గృహే దేవాలయేవాపి<br>మహాభోగాంగణాన్వితే,<br>కుర్యా న్మండపికాం చిత్రాం<br>పట్టవస్త్రవితానికాం. | 7. విశాలమగు ముంగిలిగల ఇంటిలోగాని, దేవాలయములోగాని, పట్టువస్త్రపుచాందినీలచే నొక చిన్న మండపమును నిర్మింపవలెను. |
| 8. తోరణాలంకృతాం దిక్షు<br>కదలీస్తంభసంవృతాం,<br>కోమలై ర్నారికేలైశ్చ<br>పర్ణైః పూగఫలైరపి. | 8. అన్నివైపుల తోరణములచేతను, అరటిచెట్లచేతను, లేతకొబ్బరికాయలచేతను, తములపాకులచేతను, పోకలచేతను అలంకరింపబడినదై, |
| 9. శోభితాం రంగవల్లీభి<br>శ్చిత్రాభిః సర్వతో వృతాం<br>శంఖచక్రాబ్జమీనాది<br>రూపాభిః కృతభక్తిభిః. | 9, 10. శంఖము, చక్రము, మత్స్యము మొదలగు రూపములతో రేఖలుతీర్చి ముగ్గులను చక్కగా నమర్చి విశాలమై నలుమూలలుగల యొక వేదికను కూర్చవలెను. |
| 10. మహతీం చతురశ్రాం చ<br>కుర్యా త్తత్ర చ వేదికాం. | |
| 11. తత్ర వ్రీహీన్ సంప్రసార్య<br>ద్వాదశప్రస్థసంమితాన్,<br>అనాహతేన శుక్లేన<br>వస్త్రేణాచ్ఛాద్య తా నథ. | 11. ఆచ్చట వ్రీహులను (వడ్లను) పండ్రెండుతూములుపోసి క్రొత్త తెల్లని వస్త్రముచే వానిని కప్పవలెను. తరువాత, |

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము |
|---|---|
| 12. తదర్ధపరిమాణేన<br>తండులాన్ తస్య చోపరి,<br>నిక్షిప్య తత్ర విలిఖేత్<br>పద్మ మష్టదలం శుభం. | 12. ఆరు తూముల బియ్యమును దానిపై పోయవలెను. దానిపై ఎనిమిది దళముల పద్మమును వ్రాయవలెను. |
| 13. పరితః తస్య విలిఖేత్<br>భూపురద్వితయం తతః. | 13. దానికి చుట్టును భూపురములను రెండింటిని వ్రాయవలెను. |
| 14. త్రికోణద్వయ మాలిఖ్య<br>కర్ణికాయాం సరోరుహః,<br>ప్రణవం రామబీజం చ<br>సీతాబీజం తథైవ చ. | 14. అటుపిమ్మట పద్మముయొక్క దుద్దునందు త్రికోణద్వయమును వ్రాసి (ఓమ్) ప్రణవమును, (రాం) రామబీజమును, (శ్రీం) సీతాబీజమును |
| 15. విలిఖ్య దర్భై రాచ్ఛాద్య<br>తండులాన్ తాన్ సమంతతః,<br>తస్య చోపరి గంగాది<br>తీర్థసంపూరితం ఘటం,<br>హాటకం రాజతం వా పి<br>తామ్రం వా స్థాపయే చ్ఛుభం. | 15. వ్రాసి, ఆబియ్యము నన్నిటిని దర్భలతో కప్పి, దానిపై గంగాది తీర్థములతోనిండిన బంగారుతో గాని లేక వెండితోకాని లేక రాగితోగాని చేయబడిన శుభకలశము నుంచవలెను. |
| 16. పంచపల్లవకూర్చాది<br>పట్టవస్త్రాద్యలంకృతే,<br>ఉదక్ఛిఖం నారికేళం<br>పక్వం విన్యస్య తత్ర చ. | 16. ఆ కలశమునందు పంచపల్లవములను. కూర్చను ఉంచి, పట్టువస్త్రమును చుట్టి దానిపైన పండుకొబ్బరికాయను జుట్టు పైకుండునట్లుగా ఉంచవలెను. |
| 17. సువర్ణస్యా థ రౌప్యస్య<br>పలద్వయవినిర్మితాం,<br>స్నపితాం పంచగవ్యేన<br>యథావచ్చ ప్రతిష్ఠితాం. | 17, 18. రెండు పలముల బరువుగల బంగారు లేక వెండి రేకుపై అష్టదళపద్మముయొక్క మధ్యభాగమునందు సీతను ఒడియందిడుకొని చిన్ముద్రతోకూడిన శ్రీరామచంద్రుని విగ్రహమును |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 18. ప్రతిమాం యత్రాఽష్టదళ<br>పద్మమధ్యే రఘూద్వహః,<br>ఉత్సంగే సీతయా సార్ధం<br>భాతి చిన్ముద్రయాఽన్వితః. | చిత్రించి పంచగవ్యముతో అభిషేకముచేయించి శాస్త్రోక్తముగా ప్రతిష్ఠించవలెను. |
| 19. స్థాపయిత్వా ద్విజశ్రేష్ఠై<br>రనుజ్ఞాతో గణాధిపం,<br>పూజయిత్వా ప్రార్థ్య తం చ<br>శ్రీరామాయణపుస్తకే,<br>ప్రతిమాయాం చ సంపూజ్య<br>తతః సంకల్పయే న్ముదా. | 19. ఇట్లు అభిషేకముగావించిన పిదప బ్రాహ్మణో త్తముల యనుజ్ఞ బడసి గణాధిపతిని పూజించి ఆతనిని ప్రార్థించి శ్రీరామాయణపుస్తకము నందును శ్రీరామప్రతిమయందును పూజను గావించి ఆనందముతో సంకల్ప మాచరింప వలెను. |
| 20. పఠితారౌ కుశలవ<br>స్వరూపౌ ద్వౌ వృణీత చ,<br>వక్తారమపి వాల్మీకి<br>రూప మేకం వృణీత చ. | 20. కుశలవులవంటి ఇద్దరిని చదువుటకు వరించ వలెను. వాల్మీకిస్వరూపుడగు ఒక విప్రుని వక్తనుగా వరించవలెను. |
| 21. శ్రోతార మేకం హనుమ<br>త్స్వరూపం వృణుయా త్తతః,<br>ఉపశ్రోతౄన్ తత స్త్రీంశ్చ<br>వృణుయా ద్రాఘవప్రియాన్. | 21. పిమ్మట వినునట్టి ఒకనిని హనుమంతునిగా వరించవలెను. శ్రీరామభక్తులగు మరిముగ్గురు- ఉపశ్రోతలను వరించవలెను. |
| 22. పఠనే వా ప్రవచనే<br>శ్రవణే వా యథా స్వయం,<br>పటుర్భవే త్తథా కుర్యాత్<br>తథా సంకల్పమేవ చ. | 22. తాను చదువుటకో చెప్పుటకో వినుటకో దేనికి సమర్థుడైన దానికి ఉపయోగపడవచ్చును. సంకల్పముగూడ అట్లే చేయవలెను. |
| 23. తతః పఠే న్నారదోప<br>దిష్ట మారభ్య సర్గకం,<br>ఆబాలకాండసంపూర్తేః<br>పఠేత్తు ప్రథమే దినే. | 23. పిమ్మట మొదటిరోజున నారదోపదేశముగల మొదటిసర్గను ప్రారంభించి బాలకాండ ముగియువరకు చదువవలెను. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము. |
| --- | --- |
| 24. ద్వితీయే వై దశరథ ప్రాణయాత్రాంతమేవ చ, తృతీయే తు దినే పాఠ్యం అయోధ్యాకాండశేషకం. | 24. రెండవదినమున దశరథుని మరణాంతము (64 వ సర్గాంతము వరకు) చదువవలెను. మూడవదినమునఅయోధ్యాకాండ సాంతముగ చదువవలెను. |
| 25. చతుర్థే తు పఠేత్ గృధ్ర రాజమోక్షావధి క్రమాత్, బిలప్రవేశా త్పూర్వం తు పంచమే విరమే త్పునః. | 25. నాల్గవదినమున జటాయుమోక్షాంతము (అరణ్యకాండ - 68 వ సర్గాంతము వరకు) చదువవలెను, ఐదవదినమున వానరుల బిలప్రవేశమునకు ముందుగనే (కిష్కింధకాండ - 49 వ సర్గాంతమున) విరమించవలెను. |
| 26. హనూమతో నివృత్త్యంతం షష్ఠే లంకాపురాత్ పఠేత్. నాగపాశనివృత్త్యంతం సప్తమే దివసే పఠేత్. | 26. అరవదినమున హనుమంతుడు లంకాపురము నుండి మరలి వచ్చువరకు (సుందరకాండ - 56 వ సర్గాంతము వరకు) చదువవలెను. ఏడవ దినమున నాగపాశబంధవిముక్తి వరకు (యుద్ధకాండ-50 వ సర్గాంతమువరకు) చదువవలెను. |
| 27. రావణస్య వధాంతం చ దివసే చాష్టమే పఠేత్, నవమే దివసే పాఠ్యం యావద్రామాభిషేచనం. | 27. ఎనిమిదవరోజున రావణసంహారమువరకు (యుద్ధకాండ - 111 వ సర్గాంతము వరకు) చదువవలెను. తొమ్మిదవరోజున శ్రీరామాభిషేకాంతము (యుద్ధకాండ-131 వ సర్గాంతము వరకు) చదువవలెను. |
| 28. పఠనాంతే రాఘవస్య విష్ణో ర్నామసహస్రతః, మల్లికాచంపకై రర్చాం పద్మైర్వా తులసీదలైః. | 28. ఇట్లు పతిదినము పఠనానంతరమున శ్రీరామచంద్రుని విష్ణుసహస్రనామములతో మల్లె, సంపెంగ, తామరపుష్పములతోగాని తులసీదళములతోగాని పూజింపవలెను. |
| 29. కృత్వాఽథ పాయసాపూప భక్ష్యభోజ్యాదిసంయుతం, | 29. క్షీరాన్నము అప్పములు మొదలగు వివిధ భక్ష్యములతోగూడిన వరియన్నమును |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| శాల్యన్నం వినివేద్యాఽథ<br>బ్రాహ్మణాన్ భోజయేత్తత:. | తయారుచేసి భగవంతునకు నివేదించి పిమ్మట బ్రాహ్మణులకు ఈక్రింది విధముగా వడ్డించవలెను. |
| 30. ప్రథమే దివసే విప్రా:<br>భోజ్యా: ద్వాదశసంఖ్యకా:,<br>ద్వితీయేఽష్ట, తృతీయే తు<br>వింశతిశ్చ, చతుర్థకే. | 30. మొదటిదినమున పండ్రెండ్రుమందికిని, రెండవ దినమున ఎనిమిదిమందికిని, మూడవరోజున ఇరువదిమందికిని, నాల్గవరోజున పదిమందికిని, |
| 31. దశ విప్రా:, పంచమే తు<br>భోజ్యా: పంచదశ ద్విజా:,<br>షష్ఠే చ ద్వాదశైవ స్యు:<br>సప్తమే తూనవింశతి:. | 31. ఐదవదినమున పదునైదుమందికిని, ఆరవ దినమున పండ్రెండ్రుమందికిని, ఏడవదినమున పందొమ్మిదిమందికిని, |
| 32. అష్టమే దశ విప్రాశ్చ<br>న సంఖ్యా నవమే శ్రుతా, | 32. ఎనిమిదవదినమున పదిమంది బ్రాహ్మణులకును భోజనము పెట్టవలెను. తొమ్మిదవ దినమున మాత్రము సంఖ్యానియమము లేదు. అనగా పెక్కుమందికి పెట్టవలెను. |
| 33. మధ్వాజ్యఫలసంమిశ్రం<br>భోజనం సర్వదా దిశేత్,<br>దక్షిణామపి విప్రాణాం<br>దద్యాత్ భుక్తవతాం వ్రతీ. | 33. భోజనము నెల్లప్పుడును తేనె నేయి ఫలములతో నొసంగవలెను. ఈ వ్రతస్థుడు భోజనానంతరము బ్రాహ్మణులకు దక్షిణ నీయవలెను. |
| 34. సాయం చ యామే పూర్వే చ<br>రాత్రే: ప్రతిదినం తత:,<br>వక్తుర్ముఖాచ్చ శృణుయాత్<br>పూర్వాహ్ణపఠితస్య చ. | 34. సాయంకాలమందును, రాత్రియొక్క మొదటి జామునందను ప్రతిదినమును వక్తనుండి మధ్యాహ్నము చదివినదానియొక్క అర్థమును భక్తితో వినవలెను. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 35 భక్త్యార్థాన్, పూజయే త్తం చా<br>ప్యభీష్టైః ప్రతివాసరం, | 35. పిమ్మట ప్రతిదినమును ఆవక్తను సకలాభీష్ట వస్తువులతో పూజించవలెను. |
| 36. వక్తా శ్రోతా చ పఠితా<br>యజమాన స్తథైవ చ,<br>బ్రహ్మచర్యవ్రతపరా<br>భవేయు ర్నవ వాసరాన్. | 36 అర్థము చెప్పువాడును, వినువాడును, చదువువాడును, యజమానుడును ఈ తొమ్మిది దినములును బ్రహ్మచర్యవ్రతమును పాలించవలెను. |
| 37. ఏవం కృత్వా ప్రతిదినం<br>ప్రాప్తే తు నవమే దినే,<br>పఠనాన్తే తు సంకల్పం<br>కృత్వా కల్పోక్తమార్గతః. | 37. ఇట్లు ప్రతిదినముచేసి తొమ్మిదవదినము రాగానే పారాయణము పూర్తియైన పిమ్మట కల్పమున చెప్పబడినరీతిగా సంకల్పముజేసి |
| 38. కృత్వా పూజాం యథాశక్తి<br>పుష్పాదిద్రవ్యసంయుతాం,<br>కుర్యా త్పట్టాభిషేకాఖ్య<br>మహోత్సవ మథాదరాత్. | 38. పువ్వులు మొదలగు పదార్థములతో శక్తికొలది పూజను గావించి పిమ్మట భక్తితో పట్టాభిషేక మహోత్సవమును గావింపవలెను. |
| 39. స్వస్వగృహ్యోక్తవిధినా<br>ప్రతిష్ఠాప్య హుతాశనం,<br>క్షీరాన్నేన చ పాలాశ<br>సమిద్భిశ్చ ఘృతేన చ.<br>త్రిశతం రామగాయత్ర్యా<br>జుహుయా ద్రాఘవం స్మరన్,<br>(దాశరథాయ విద్మహే<br>సీతావల్లభాయ ధీమహి,<br>తన్నో రామః ప్రచోదయాత్.) | 39. తమ తమ గృహ్యసూత్రములలో జెప్పబడిన రీతిగా అగ్నిని ప్రతిష్ఠించి పరమాన్నము, మోదుగసమిధలు, నేయి అనెడు పదార్థములతో శ్రీరామచంద్రుని తలంచుకొనుచు రామగాయత్రితో మూడువందలసారులు హోమమును గావించవలెను. |

| సంస్కృతమూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| గుడాన్నేన చ దూర్వాభి<br>ర్ఘృతేన చ చతుశ్శతం,<br>మూలమన్త్రేణ జుహుయా<br>త్స్వయం వా ఽఽచార్యమూలతః.<br>(రాం రామాయ నమః) | చక్కెరపొంగలి, గరిక, నేయి అనెడు పదార్థములతో మూలమంత్రముతో తాను స్వయముగా గాని ఆచార్యునిద్వారాగాని నాలుగువందల సారులు హోమము చేయవలెను |
| 40. ధర్మాత్మేతి చ మన్త్రేణ<br>ఘృతాక్తాన్నేన సర్పిషా,<br>అశ్వత్థసమిధా చాపి<br>జుహుయా త్త్రిశతం వ్రతీ.<br>(ధర్మాత్మా సత్యసన్ధశ్చ<br>రామో దాశరథి ర్యది,<br>పౌరుషే చా ప్రతిద్వన్ద్వః<br>శరైనం జహి రావణిమ్.) | 40. 'ధర్మాత్మా సత్యసంధశ్చ' అనెడు మంత్రముతో నేతితో తడిపిన అన్నముతోను, నేతితోను, రావిసమిదలతోను వ్రతనిష్ఠుడు మూడువందల సార్లు హోమము చేయవలెను. |
| 41. తద్విష్ణోరితి మన్త్రేణ<br>జుహే దష్టోత్తరం శతం,<br>తత్ర హవ్యం తు శుద్ధాన్నం<br>సమిధ స్తు కుశాః స్మృతాః.<br>(తద్విష్ణోః పరమం పదం<br>సదా పశ్యన్తి సూరయః,<br>దివీవ చక్షు రాతతమ్.) | 41. 'తద్విష్ణోః' అనెడు మంత్రముతో కేవలము అన్నముతో, కుశలతో నూటయెనిమిదిసారులు హోమము చేయవలెను. |
| 42. హోమాశక్తౌ హోమమన్త్రాన్<br>హోమత్రిగుణసంఖ్యయా,<br>ఆవర్తయే ద్రఘుపతిం<br>కూర్చే ష్వావాహ్య చోచ్చకైః. | 42. హోమము చేయలేనిచో కూర్చయందు శ్రీరామచంద్రుని ఆవాహనచేసి హోమమంత్రములను హోమసంఖ్యకు మూడురెట్లుగా గట్టిగా నుచ్చరింపవలెను. |
| 43. ప్రతిమామ ప్యథోద్వాస్య<br>దద్యా ద్విప్రాయ యోగినే, | 43. పిమ్మట ఆ ప్రతిమకు ఉద్వాసనము చెప్పి దానిని యోగియగు బ్రాహ్మణునకు |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| స్నపయే ద్యజమానం చా ఽఽచార్య: కుమ్భజలేన చ. | దాన మొసంగవలెను. పిమ్మట ఆచార్యుడు కుంభతీర్థముతో యజమానుని స్నానము చేయించవలెను. |
| 44. వక్త్రే పఠిత్రే శ్రోత్రే చ వస్త్రాలంకరణాదిభి:, దీనారై రపి సంమానం తత: కుర్యా ద్యథోచితమ్. | 44. పిమ్మట అర్థమును చెప్పినవానికి, చదివినవానికి, విన్నవానికిని వస్త్రములు అలంకారములు మొదలగువాటితోను నాణెములతోను తగినరీతిగా సన్మానము గావించవలెను. |
| 45. ఇదం వ్రతం శుక్లపక్షే చైత్రే వాఽఽశ్వయుజేపి చ, ప్రథమాయాం సమారభ్య నవమ్యాం చ సమాపయేత్. | 45. ఈ వ్రతమును చైత్రమాసమునందుగాని, ఆశ్వయుజమాసమునందుగాని, శుక్లపక్షమున పాడ్యమినాడు ప్రారంభించి నవమితో ముగింపవలెను. |
| 46. తిథివృద్ధ్యా తు నవమీ యది స్యా ద్దశమే దినే, తదాఽఽరభే ద్వితీయాయాం నవాహం స్యా న్మహోత్సవ:. | 46 తిథిగడియలు వృద్ధితో నుండుటచే పదియవరోజున నవమియగుచో విదియనాడు ప్రారంభించి యీ మహోత్సవము తొమ్మిది దినములే జరుపవలెను. |
| 47. తిథిక్షయేణ సా చే త్స్యా దష్టమే దివసే భవేత్, అమాయాం తు వ్రత మిదం ప్రారభ్య నవ వాసరాన్. | 47. తిథి గడియలు క్షీణతలోనుండుటచే నెనిమిదవ నాడే నవమితిథియగుచో అమావాస్యనాడే ఈ వ్రతమును ప్రారంభించి తొమ్మిది దినములు జరుపవలెను. |
| 48. మధ్యాహ్నవ్యాపినీ గ్రాహ్యా నవమీ రామపూజనే. | 48. శ్రీరామపూజకు నవమి మధ్యాహ్నమువరకు ఉండు దినమునే గ్రహింపవలెను. |
| 49. కుర్యా ద్భక్త్యా చ తుష్ట్యా చ శ్రద్ధయా చ సమన్విత:, మాసద్వయం తు పూర్వోక్త ముఖ్యపక్షసమాశ్రయాత్. | 49. వెనుక చెప్పబడిన ముఖ్యపక్షము నవలంబించి భక్తితోను ఆనందముతోను శ్రద్ధతోను కూడి యున్నవాడై ముందుచెప్పిన చైత్రములోగాని, ఆశ్వయుజములోగాని ఈ రెండునెలలలో చేయుట యుత్తమము. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము. |
| --- | --- |
| 50. అన్యేష్వపి చ మాసేషు<br>శుక్లపక్షే యథారుచి,<br>కుర్యాద్ర్వత మిదం యత్రః<br>సర్వసంపత్సమృద్ధయే. | 50. తన యిష్టమువచ్చినట్లు ఇతరమాసములలోకూడ శుక్లపక్షములో సమస్త సంపదలు అభివృద్ధి చెందుటకై నియమముతో నీ వ్రతమును చేయ వచ్చును. |
| 51. ఏవం కృతే జగత్స్వామీ<br>రామభద్రః శ్రియః పతిః,<br>తుష్టో భవతి మోక్షాన్తాన్<br>సర్వాన్ కామాన్ దదాతి చ. | 51. ఇట్లాచరించినచో జగత్తునకు ప్రభువగు శ్రీరామచంద్రుడు సంతుష్టుడై మోక్షమువరకుగల యన్ని కోరికలను ప్రసాదించును. |
| 52. అపుత్రో లభతే పుత్ర<br>మపమృత్యుం తరేత చ,<br>భునక్తి సర్వాన్ భోగాంశ్చ<br>కుబేరేణ సమో భువి. | 52. కొడుకులు లేనివాడు కొడుకును కనును. అకాలమృత్యువువాత పడడు. భూమండలమందు కుబేరునివలె సకల భోగముల ననుభవించును. |
| 53. ఆచంద్రార్కం వంశవృద్ధిః<br>యజమానస్య వై భవేత్,<br>ప్రీయన్తే పితర స్తస్య<br>ఆవింశతికులం తతః.<br>నరకా దుత్తరన్త్యే తే<br>రామమాహాత్మ్యతోఽఖిలాః. | 53. ఇట్టి యజమానునికి ఆచంద్రార్కము వంశము వృద్ధిపొందుచుండును. ఇరువది తరముల వరకును ఇతని పితరులు సంతోషింతురు. నరకములోనున్న పితరులందరును శ్రీరామచంద్రుని మాహాత్మ్యమువలన నరకమును వీడి తరింతురు. |
| 54. ఆయుః కీర్తి శ్చ వర్ధేత<br>సర్వం దుఃఖం ప్రణశ్యతి. | 54. యజమానునికి ఆయుస్సు కీర్తియు వృద్ధి చెందును. దుఃఖయలన్నియు నశించును. |
| 55. ఇద ముక్తం మహాభాగ<br>మాండూకర్ణే! మహామునే!<br><br>రామాతిక్రమదోషాచ్చ<br>క్షత్రియభ్రూణనాశనాత్, | 55. ఈ రహస్యము అగస్త్యునిచే మాణ్డూకర్ణికి చెప్పబడెను.<br><br>పూర్వము పరశురాముడు శ్రీరామచంద్రుని ధిక్కరించిన దోషమును, క్షత్రియ సంతాన |

సంస్కృత మూలము | ఆంధ్రానువాదము

ఇదం యథోదితం చక్రే
జామదగ్న్యః పురా వ్రతమ్.

నాశదోషమును శమించుటకై ఈ చెప్పబడిన వ్రతమును నాచరించెను.

56. ప్రత్యక్షీభూయ రామశ్చా
ప్యనుజగ్రాహ తం తతః,
బహుభిశ్చ తతో భూపై
ర్మునిభిశ్చ ద్విజోత్తమైః.

56. అంతట శ్రీరామచంద్రు డాతనికి ప్రత్యక్షుమై ఆతని ననుగ్రహించెను. పిమ్మట పలువురు రాజులచేతను, బ్రాహ్మణోత్తములచేతను

57. అనుష్ఠితం వ్రతమిదం
తత్తత్కామనయాఽన్వితైః,
అనాయాసేన తే ప్రాప్తా
అభీష్టం రఘుసత్తమాత్.

57. ఆయా కోరికలు నెరవేరుటకై యీవ్రత మాచరింపబడెను. వారు తమకోరికల నన్నిటిని అనాయాసముగా రామచంద్రునివలన బడయ గల్గిరి.

58. ఏవం కర్తు మశక్త శ్చే
ద్విత్తలోభం వినా ద్విజః,
యావచ్ఛక్తి వ్రత మిదం
కుర్యా ద్భక్తి సమన్వితః.

58. ఈ చెప్పబడినరీతిగా చేయజాలనిచో ద్రవ్య లోభమును విడిచి తనశక్తికి తగినట్లు భక్తితో నీ వ్రత మాచరింపవలెను.

59. సర్వాశక్తౌ నవదినం
యథోక్తక్రమతః పఠేత్,
పూజయేచ్చ రఘూత్తమం
తేన రామః ప్రసీదతి.

59. బొత్తుగా పైవలె చేయ శక్తిలేనివాడైనచో తొమ్మిదిరోజులు చెప్పబడిన క్రమము తప్పక శ్రీరామాయణమును పఠించి శ్రీరాముని పూజింపవలెను. దానిచేగూడ శ్రీరాముడు సంతుష్టుడగును.

ఇతి శ్రీ కుమారసంహితాయాం అగస్త్య
మాణ్డూకర్ణి సంవాదే శ్రీరామాయణ నవాహ
పారాయణ విధిః.

ఇట్లు కుమారసంహితలోని అగస్త్య మాణ్డూకర్ణి
సంవాదమందలి నవాహ పారాయణ పద్ధతి
ముగిసెను.

## నవాహ్నిక రామాయణపారాయణక్రమమున ఒక్కొక్కరోజున చదువవలసిన కాండ-సర్గ-శ్లోకముల వివరము.

| రోజు | కాండము | సర్గలు | మొత్తము సర్గలు | ఒక్కొక్కనాటి శ్లోకసంఖ్య | పారాయణం అయిన శ్లోక సంఖ్య | బ్రాహ్మణ భోజనముల సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 1. | బాలకాండ | 1-77 | 77 | 2355 | 2,355 | 12 మందికి |
| 2. | అయోధ్యాకాండ | 1-64 | 64 | 2597 | 4,952 | 8 ,, |
| 3. | అయోధ్యాకాండ | 65-119 | 55 | 1760 | 6,712 | 20 ,, |
| 4. | అరణ్యకాండ | 1-68 | 68 | 2290 | 9,002 | 10 ,, |
| 5. | అరణ్యకాండ<br>కిష్కింధాకాండ | 69-75<br>1-49 | 7<br>49 | 250<br>2037 | 11,289 | 15 ,, |
| 6 | కిష్కింధాకాండ<br>సుందరకాండ | 50-67<br>1-56 | 18<br>56 | 501<br>2386 | 14,176 | 12 ,, |
| 7. | సుందరకాండ<br>యుద్ధకాండ | 57-68<br>1-50 | 12<br>50 | 499<br>1990 | 16,665 | 19 ,, |
| 8. | యుద్ధకాండ | 51-111 | 61 | 3154 | 19,819 | 10 ,, |
| 9. | యుద్ధకాండ | 112-131 | 20 | 905 | 20,724 | అసంఖ్యేయము |
| 9 | మొత్తము | 537 | 537 | 20,724 | 20,724 | |

## అంతమందుచేయు హోమము వివరము

1. రామగాయత్రితో 300 సార్లు పరమాన్నము-మోదుగసమిధలు-నేతితో
2. మూలమంత్రముతో 400 సార్లు శర్కరపొంగలి-దూర్వలు (గరిక)-నేతితో
3. ధర్మాత్మేతి మంత్రముతో 300 సార్లు నేతియన్నము-రావిసమిధలు-నేతితో
4. తద్విష్ణో అను మంత్రముతో 108 సార్లు అన్నము-కుశలతోను హోమము చేయవలెను.

## అథ
## వాయుపురాణాంతర్గతాయా ముమా సంహితాయాం కామనావద్భిః పఠనీయ ఘట్టనిరూపణం.

సంస్కృత మూలము.

**ఈశ్వర ఉవాచ -**

1. అథ వక్ష్యామి గిరిజే!
శ్రూయతా మవధానతః,
శ్రీమద్రామాయణగ్రంథే
కామనావద్భి రాదరాత్.

2. కామేప్సవో ద్విజాః ప్రాతః
స్నాత్వా దివ్యసరిజ్జలే,
ప్రయతాః శుద్ధభావాశ్చ
కృతజప్యా హుతాగ్నయః.

3. దివసస్యాష్టమం భాగం
పరిహృత్య తతఃపరం,
రామం సంపూజ్య విధివత్
పఠేయుః స్వేష్టఘట్టకమ్.

4. పఠితుం చే దశక్తః స్యాత్
శ్రుణుయా త్స గదాదిమాన్.

5. ద్విజేతరై స్తు శ్రోతవ్యం
సర్వదైవ ద్విజాననాత్,
పాఠకం మానయే దస్తే
మత్వా శ్రీరామవిగ్రహం.

## ఇక
## వాయుపురాణమందలి ఉమాసంహితలో కోరికలు కోరువారలకు చదువతగిన ఘట్టముల వివరణము

ఆంధ్రానువాదము

**ఈశ్వరుడు పలికెను -**

1. ఓ పార్వతీ! కోరికలను కోరువారు రామాయణ గ్రంథము నేయే ఘట్టములు చదువవలెనో చెప్పెదను, సావధానముగ వినుము.

2. కోరికలనుకోరు బ్రాహ్మణులు ప్రాతఃకాలమున దివ్యమగు నదీజలమున స్నాన మాచరించి ఇంద్రియనిగ్రహము కలవారై నిర్మలమనస్సు కలిగి ఇష్టజపములనుచేసి అగ్నిహోత్రములను వేల్చి.

3. పగటివేళలోని 8 వ భాగమును (తొలి $3\frac{3}{4}$ ఘడియల కాలమును) మాత్రము విడచి యథావిధిగ రామునిపూజించి తన కభిమతమగు ఘట్టమును చదువవలెను.

4. యజమానుడు రోగాదిబాధలచే చదువ లేకున్నచో చదివించి వినవలెను.

5. తక్కిన మూడు వర్ణములవారును బ్రాహ్మణుని వలననే రామాయణమును వినవలెను. అంతయు పూర్తియైన తరువాత చదువువానిని శ్రీరామ చంద్రునిగా తలచి గౌరవించవలెను.

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 6. ధర్మకామస్తు కౌసల్యా<br>రామసంవాద మాదరాత్,<br>మంగళాంతం పఠేత్ ప్రాత<br>ర్మధ్యాహ్నే వా స్మరన్ ప్రభుం. | 6. ధర్మమును కోరువారు కౌసల్యారామ సంవాద మును అయోధ్యాకాండములోని 21 మొదలు 25 వరకుగల సర్గలు ఆదరముగను మంగళాంతముగను ఉదయమునగాని మధ్యాహ్న మునగాని, ప్రభువును తలచుచు చదువవలెను. |
| 7. అనశ్నన్నేవ హి పఠేత్<br>ప్రాత ర్మధ్యాహ్న ఏవ చ,<br>పఠనం యస్య ఘట్టస్య<br>సాయం చ పరికీర్తితం. | 7. ఉదయమున మధ్యాహ్నమున భుజింపకయే పారాయణ మాచరింపవలెను సాయంకాలమున చదవవలసిన ఘట్టమును, |
| 8. తం పఠేత్ ప్రయత: సంధ్యాం<br>అనుష్ఠాయ ధృతవ్రత:,<br>అశుద్ధిశ్చే ద్దివా ప్రాప్తా<br>సాయం స్నాత్వా పఠే త్తత:. | 8. సంధ్యావందన మాచరించి నియమముతో చదువవలెను. పగలు అశుచిగానుండుట సంభవించినచో సాయంకాలము స్నానముజేసి చదువవలెను. |
| 9. అర్థకామ: పఠే త్సర్గం<br>యాత్రాదానకథాంశకమ్,<br>రామస్యారణ్యగమన<br>సమయే తు త్రిసంధ్యకం. | 9. ధనమును కోరువారు రాము డరణ్యప్రయాణ మునకుముందు దానముజేయు కథగల అయోధ్యాకాండములోని ముప్పదిరెండవసర్గను మూడుసంధ్యలలోను చదువవలెను. |
| 10. కన్యార్థీ చ వటు: కన్యా<br>ఉప్యనురూప వరార్థినీ,<br>సీతావివాహసర్గం తు<br>పఠే త్ప్రాత: ప్రయత్నత:.<br>గవ్యం నివేదయేత్ క్షీరం<br>సద్యోదుగ్ధం శుచిస్థలే. | 10. వివాహము నభిలషించు బ్రహ్మచారిగాని, కన్యగాని తమతమ కోరిక నెరవేరుటకై సీతాకల్యాణసర్గమును (బాల - 73వ సర్గము) నియమానుసారముగ ఉదయమున చదువవలెను. పరిశుభ్రస్థలమున అపుడు పితికిన క్షీరము నారగింపుచేయవలెను. |
| 11. మోక్షార్థిభి స్తు పాఠ్యా స్యా<br>జ్జటాయుర్మోక్షదానకా, | 11 మోక్షమును కోరువారు జటాయు మోక్షకథను చదువవలెను. మరియు రాముని లక్ష్మణుడు |

**సంస్కృత మూలము.** | **ఆంధ్రానువాదము.**

రామస్య లక్ష్మణాశ్వాసా
దారభ్య ప్రయత్నై: కథా.

ఓదార్చుకథను ఆరంభించి చదువవలెను. (అరణ్య - 65 మొదలు 68వ సర్గవరకు)

12. అపస్మార శ్వాసకాస
కుష్ఠాదిగదశాన్తయే,
ఆద్యే యుద్ధే దశాస్యస్య
మౌళిభంగం దినేదినే
పఠే ద్ద్వివారం నైవేద్యం
ఆదౌ మధు తత: పయ:.

12. మూర్ఛ, శ్వాస, దగ్గు, కుష్ఠాదిరోగము లుపశమించుటకై మొదటి యుద్ధమున రావణుని కిరీటపతనసర్గను (యుద్ధ - 59 సర్గ) ప్రతి దినము రెండుసారులు చదువవలెను. మొదట తేనె చివర పాలు ఆరగింపు జేయవలెను.

13. భూతవేతాల పీడా చేత్
లంకావిజయసర్గకం,
ఆదౌ గుడాన్నం నైవేద్యం
కృత్వా సాయం పఠే ద్యత:.
విమార్గ సర్వత్రేతిపద్య
స్యాంతే నీరాజనార్పణమ్.
కృత్వాఽథ ప్రణమే ద్భూమా
వాంజనేయం హృదా స్మరన్.

13. భూత, భేతాల పీడ యున్నచో లంకావిజయ సర్గను (సుందర - 3 సర్గ) ప్రారంభమున బెల్లము కలసిన అన్నమును నైవేద్యముచేసి సాయంకాలమున చదువవలెను. ఆంజనేయుల ధ్యానించుచు ''విమార్గ సర్వత్ర'' అను శ్లోకము చదివి కర్పూరహారతి నీయవలెను. సాష్టాంగ ముగ నమస్కరించవలెను.

14. ఉన్మాదదోష శాంత్యర్థం
హనూమచ్చింతనం పఠేత్.
అశోకవనికాయాన
సమయే సముపస్థితం.

14. పిచ్చిపోవుటకై అశోకవనమునకేగు సమయమున కలిగిన హనుమంతుని ఆలోచనాసర్గను (సుందర - 13 సర్గ) ఉదయమున చదువ వలెను.

15. నివేదయే ద్యత: ప్రాత
ర్మాషచూర్ణాన్న మాదృత:.

15 తరువాత మినపపిండితో కలిసిన అన్నమును ఆదరముగ నైవేద్యము చేయవలెను.

16. దారిద్ర్యధ్వంసకామస్తు
లంకాయాంతు హనూమతా

16. దారిద్ర్యమును పోగొట్టుకొన గోరువారు హనుమంతుడు లంకలో సీతనుజూచిన కథను

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము. |
|---|---|
| మైథిలీదర్శనప్రాప్తిం<br>పఠేత్ పాప విమోచనమ్. | (సుందర - 15) సర్గ చదువవలెను. |
| 17. దుఃఖధ్వంసన కామస్తు<br>రావణస్య వధోత్తరం,<br>సీతాంజనేయసంవాద<br>సర్గం తు ప్రయతః పఠేత్. | 17. దుఃఖములను పోగొట్టుకొన దలచినవాడు రావణ వధానంతరమందలి సీతాంజనేయ సంవాదమును (యుద్ధ - 116 సర్గను) చదువవలెను. |
| 18. అతర్కితాపదుద్ధార<br>కామశ్చే దభయార్పణం,<br>విభీషణాయ రామస్య<br>పఠే దర్థం విచింతయన్.<br>ఆదా వన్తే చ సంస్ఫోట్య<br>నాలికేరం నివేదయేత్. | 18. ఊహాతీతములగు ఆపదలనుండి విముక్తి పొందుటకు విభీషణునకు రామునిచే నభయ ప్రదానముచేయబడిన సర్గలను (యుద్ధ - 17, 18 సర్గలు) అర్థముతో చదువవలెను. మొదటను చివరను కొబ్బరికాయను బ్రద్దలుకొట్టి అరగింపు చేయవలెను. |
| 19. విశ్లిష్ట బంధుసంయోగ<br>కామనా చే ద్ధనూమతః,<br>రామాంగులీయార్పణం తు<br>సీతాయై సంధ్యయోః పఠేత్.<br>ఆదా వన్తేఽపి వా నిత్యం<br>పనసామ్రఫలార్పణం. | 19. విడిపోయిన బంధువుతో కలియవలెనను కోరిక యున్నచో హనుమంతుడు రామాంగులీయకమును సీతకొసగు (సుందర - 36) సర్గను ఉభయసంధ్యాకాలములందు చదువవలెను. ప్రారంభమునను ఆఖరునందును పనస మామిడిపండ్ల నైవేద్యము చేయవలెను. |
| 20. దుస్స్వప్న దోష శాన్త్యర్థం<br>త్రిజటాస్వప్న దర్శనం,<br>పఠేత్ త్ర్యహం ప్రాతరేవ<br>శర్కరాం వినివేదయేత్. | 20. దుస్స్వప్నములు నశించుటకై త్రిజటా స్వప్న సర్గను (సుందర - 27 సర్గ) మూడురోజులు ఉదయముననే చదివి పంచదార నారగింపు చేయవలెను. |
| 21. పారదారికతాదోష<br>శాంతయే హనుమత్కృతం,<br>నిర్వికారమనా భూత్వా<br>శుద్ధాంతే రావణస్య చ. | 21. ఇతరుల భార్యను పొందదలచిన దోషము శమింపుటకై రావణుని అంతఃపురమున హనుమంతుడు నిర్వికారుడై, |

సంస్కృత మూలము.

22. జానక్యన్వేషణకథా
సర్గపంచక మాదరాత్,
సకృత్ పఠేత్ ప్రాతరేవ
నివేద్యాపూపవింశతిం.

23. బుద్ధ్యాఽబుద్ధ్యా రామవిభో
ర్విహితాగః ప్రశాంతయే,
కాకానుగ్రహవృత్తాంత
సర్గం నత్వా పఠేత్ ప్రభుం.
సర్వసౌఖ్యాస్పదం భావిజన్మ
కాంక్షుద్భి రాదరాత్,
అయోధ్యాయాం రఘూత్తంస
రాజ్యపట్టాభిషేచనం.

24. పఠనీయం మాసమాత్రం
ముద్గాన్నం వినివేదయేత్.

25. పుత్రకామస్తు పుత్రీయా
మిష్టిం దశరథస్య తాం,
ఆగర్భధారణం స్త్రీణాం
పాయసేన పఠే చ్ఛుచిః.

26. నివేదయే త్ప్రతిదినం
ఘృతమిశ్రం తు పాయసం,
శ్రావయేచ్చాపి పత్నీం స్వాం
తుల్యాం వింశతివాసరాన్.

37. సుఖప్రసవకామస్తు
గర్భిణీనాం తు తచ్ఛృవే.

ఆంధ్రానువాదము

22. సీతాదేవిని వెదకిన అయిదు సర్గలను (సుందర-7, 8, 9, 10, 11 సర్గలు) ఉదయముననే 20 అపూపములను నైవేద్యముచేసి చదువవలెను.

23. తెలిసియైనను తెలియకయైనను రామునకుచేసిన అపరాధనివృత్తికై కాకాసురు ననుగ్రహించిన (సుందర - 38 సర్గను) శ్రీరామచంద్రునకు నమస్కరించి చదువవలెను. మరుసటి జన్మమున సర్వసౌఖ్యములు కలుగుటకై ఆదరమున అయోధ్యలో శ్రీరామచంద్రుని పట్టాభిషేకమును (యుద్ధ - 131 సర్గను)

24. ఒక నెలదినములు పులగమును (పొంగలి) నైవేద్యము చేయుచు పఠింపవలెను.

25. పుత్రులను కోరువారు దశరథుని పుత్రకామేష్టిని దశరథుని భార్యలగు కౌసల్యాదులు పాయసముచే గర్భము ధరించునంతవరకు (బాల - 15, 16) సర్గలు చదువవలెను.

26. ప్రతిదినము నేతితో కలిపిన పాయసము నైవేద్యము చేయవలెను. 20 రోజులు సత్కులప్రసూతయగు తన భార్యకు ఆ కథను వినిపింపవలెను.

27. సుఖముగా ప్రసవింపగోరువారు గర్భిణులకు చెవిలో రామావతార ఘట్టముగల సర్గను

# శ్రీ రామాయణ మాహాత్మ్యమ్

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| అవతారకథాసర్గం<br>రామస్య ప్రయతః పఠేత్.<br>యథాలబ్ధం తు నైవేద్యం<br>కార్యం ద్రవ్యేణ చాల్పశః. | (బాల - 18 సర్గను) చదివి చదివించి దొరకిన కొలది ద్రవ్యముతో నైవేద్యమును సమర్పింపవలెను. |
| 28. కారాగారప్రవేశ స్స్యాత్<br>ఇతి యస్యాఽస్తి వై భయం,<br>విభీషణేన సీతాయా<br>నయనం రామసన్నిధౌ.<br>స పఠే న్మధురైః ద్రవ్యైః<br>తోషయిత్వా రఘూత్తమం. | 28. జైలు ననుభవింపవలసివచ్చునను భయము కలవాడు రామునివద్దకు విభీషణుడు సీతను తెచ్చుసర్గను (యుద్ధ - 117 సర్గను) శ్రీరామ చంద్రునకు మధురపదార్థముల నారగింపుచేసి చదువవలెను. |
| 29. సర్వార్థసిద్ధిదం దేవి!<br>రామాయణ మనుత్తమం,<br>పఠేత్ సర్వప్రయత్నేన<br>కామిభిః పఠితం పురా.<br>మునిభిః సర్వతత్త్వజ్ఞైః<br>సర్వానిష్టనివారణం. | 29. ఓ పార్వతీ! శ్రీరామాయణము మిక్కిలి ఉత్కృష్టమగు గ్రంథము. సర్వసిద్ధుల నొసగును. సర్వతత్త్వముల నెఱింగిన మునులు సైత మీరామాయణము సర్వానర్థముల పోగొట్టు నని తలచి చదివియుండిరి. కాన కోరికలను కోరువారు నియమానుసారముగ చదువవలెను. |
| 30. విశ్వామిత్రస్య బ్రాహ్మణ్య<br>కథయా బ్రహ్మవర్చసం,<br>గంగావతారకథయా<br>ఉప్యక్షయ్యం పితృతర్పణం. | 30. విశ్వామిత్రుడు బ్రహ్మర్షియగు సర్గలను (బాల- 50-65 వరకుగల సర్గలను) చదివిన బ్రహ్మ వర్చస్సును, గంగావతారకథను (బాల-34-44 వరకుగల సర్గలను) చదువుటచే అక్షయ మగు పితృతర్పణఫలితమును పొందును. |
| 31. అయోధ్యాకాండప్రారంభే<br>శ్రీరామగుణసంతతేః,<br>పఠనా ద్గుణవాన్ పుత్రో<br>నిర్గుణోఽపి భవే ద్ధ్రువం. | 31. అయోధ్యాకాండ ప్రారంభమున శ్రీరామ చంద్రుని గుణములను (అయోధ్యా - 1, 2 సర్గలను) చదువుటచే పుత్రుడు గుణహీను డైనను గుణవంతుడగును. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 32. అత్రాఽనిర్దిష్టకామాస్తు<br>యే స్యుః నానావిధేప్సితాః,<br>తైః పాఠ్యం భార్గవజయ<br>కథాసర్గద్వయం యత్నైః.<br>పాయసాపూపనైవేద్యం<br>పఠనాంతే తు కారయేత్. | 32. ఇందు చెప్పబడిన మరి యెవేని పలువిధములగు కోరికలు గోరువారు పరశురామ విజయకథ యుండెడు (బాల - 75, 76 సర్గలు) రెండు సర్గలును, నియమానుసారము చదివి, చివరకు పాయసమును అపూపములను (అప్పములను) నైవేద్యమాచరింపవలెను. |
| 33. అనిర్దిష్టం తు యేషాం తత్<br>ఘట్టానాం స్యా ద్విశేషతః,<br>నైవేద్యం తత్ర కల్ప్యం స్యాత్<br>కదలీఫలపంచకం. | 33. నైవేద్యమునుగూర్చి చెప్పనిఘట్టములను పఠించువారు ఆ ఘట్టములకు 5 అరటిపండ్లను నైవేద్యము పెట్టవలెను. |
| 34. ఇమం శృణ్వంతి యే విప్రా<br>అధ్యాయం యే పఠంతి వా,<br>సర్వా న్కామా నవాప్యైతే<br>శ్రీరామస్య పదం గతాః. | 34 దీనిని విన్నను, చదివినను బ్రాహ్మణులు సమస్తమగు కోరికల ననుభవించి శ్రీరామచంద్రుని సాన్నిధ్యము నొందుదురు. |
| ఇత్యుమాసంహితాయాం కామనావద్భిః<br>పఠనీయ ఘట్టనిరూపణం. | ఇది ఉమాసంహితలో కోరిక కలవారు చదువవదగిన ఘట్టములను నిరూపించు నధ్యాయము. |
| శుభం భూయాత్. | శుభమగుగాక ! |

## ఫలకామనతో పఠించవలసిన ఘట్టము మున్నగువాని వివరములు.

| ఉద్దేశించిన కార్యము | కాండ | సర్గ | సమయము | నైవేద్యము మున్నగునవి |
|---|---|---|---|---|
| 1. ధర్మము | అయోధ్యా | 21-25 | ప్రాత:గాని మధ్యాహ్నమునగాని | 5 అరటిపండ్లు |
| 2. అర్థము | ,, | 32 | ప్రాత: | 5 అరటిపండ్లు |
| 3. కామము | బాల | 73 | ప్రాత: | గోక్షీరములు |
| 4. మోక్షము | అరణ్య | 65-78 | ప్రాత: | 5 అరటిపండ్లు |
| 5. అపస్మారము, శ్వాస కాసలు, కుష్ఠునివారణ | యుద్ధ | 59 | రెండువేళలందు | ప్రారంభమున తేనె అంతమున గోక్షీరములు |
| 6. భూతప్రేతపరిహారం | సుందర | 3 | సాయం హనుమద్ధ్యానము | ప్రారంభమున శర్కరపొంగలి అంతమున కర్పూరహారతి |
| 7. ఉన్మాదశాంతి | సుందర | 13 | ప్రాత: | మినుపపిండితోడి యన్నము |
| 8 దారిద్ర్యమోచనం | సుందర | 15 | ప్రాత: | 5 అరటిపండ్లు |
| 9. దు:ఖ నివృత్తి | యుద్ధ | 116 | ప్రాత: | 5 అరటిపండ్లు |
| 10. ఆపన్నివారణ | యుద్ధ | 17-18 | ప్రాత: | ఆద్యంతములయందు కొబ్బరి కాయలు |
| 11. బంధుసందర్శనం | సుందర | 36 | ప్రాత: | పనసపండు-మామిడిపండు |
| 12 దుస్స్వప్నదోషశాన్తి | సుందర | 27 | ప్రాత: | మూడుదినములు శర్కర |
| 13. పరస్త్రీవాంఛా దోషనివృత్తి | సుందర | 7-11 | ప్రాత: | 20 అప్పములు |
| 14 జ్ఞాతాజ్ఞాతరామా పచారదోషనివృత్తి | సుందర | 38 | ప్రాత: | 5 అరటిపండ్లు |
| 15.సుఖమయభావిజన్మ | యుద్ధ | 131 | ప్రాత: | ఒకనెల పారాయణము పొంగలి |
| 16. సంతానము | బాల | 15-16 | ప్రాత: | 20 దినములు నెయ్యిపాయసం |
| 17. సుఖప్రసవము | బాల | 18 | ప్రాత: | గర్భిణికి వినిపించవలెను. ఇష్టానుసారనైవేద్యం |
| 18. కారాగారభయ నివృత్తి | యుద్ధ | 117 | ప్రాత: | మధురద్రవ్యములు |
| 19. బ్రహ్మతేజస్సు | బాల | 50-65 | ప్రాత: | 5 అరటిపండ్లు |
| 20. పితృప్రీతి | బాల | 35-44 | ప్రాత: | 5 అరటిపండ్లు |
| 21. పుత్రగుణవృద్ధి | అయోధ్యా | 1-2 | ప్రాత: | 5 అరటిపండ్లు |
| 22. ఇతరఫలములు | బాల | 75-76 | ప్రాత: | పాయసము, అప్పము |

## నవగ్రహదశాభుక్తి దోషపరిహార పారాయణ క్రమః.

సంస్కృత మూలము.

ఈశ్వర ఉవాచ -

1. అథ వక్ష్యామి దోషాణాం
దశాభుక్తిషు పార్వతి!
నవగ్రహైః కారితానాం
పరిహారం యథోదితం.

2. బ్రహ్మా తదాత్మజా శ్చాపి
శక్రాద్యా శ్చ సురోత్తమాః,
రామాయణస్థఘట్టానాం
కేషాంచి త్పాఠమాత్రతః.
పీడాం నవగ్రహకృతా
ముక్తేరుః కృపయా ప్రభోః.

### సూర్య దశాంతర్దశాదోషపరిహారః -

3. దుష్టా దశా చే త్సూర్యస్య
నియమా త్పూతమానసః,
హరేణ గంగాధరణ
సర్గం నిత్యం పఠే ద్ద్విజః.

4. సూర్యస్యైవ దశాయాం తు
సూర్యభుక్తి స్తు దోషదా,
హరేణ కాలకూటస్య
భక్షణం యత్ర సర్గకే.
తం పఠే త్ప్రాతరైకాగ్ర్యా
ద్ధ్యాత్వా రుద్రం పరాత్పరం.

## నవ గ్రహముల దోషపరిహారరూప పారాయణ విధానము

ఆంధ్రానువాదము.

ఈశ్వరుడు పలికెను -

1. ఓ పార్వతీ! నవగ్రహములచే గలిగిన దోష పరిహారముల నెట్లు చేసికొనవలెనో చెప్పెదను వినుము.

2. బ్రహ్మయు నతని పుత్రులును దేవేంద్రాది దేవతలును శ్రీరామాయణమునందలి కొన్ని ఘట్టములను చదివినమాత్రముననే భగవత్కృపచే నవగ్రహబాధలనుండి విముక్తులైరి. అట్లు నవగ్రహబాధలను తొలగింపజేయు రామాయణపారాయణవిధానమును చెప్పెద నాకర్ణింపుము.

### సూర్యదశాంతర్దశాదోష పరిహారము -

3. సూర్యమహాదశ దోషభూయిష్ఠమగుచో శివుడు గంగనుధరించు గాథగల (బాల-43) సర్గను నిర్మలచిత్తముతో ప్రాతఃకాలమున నియమముతో పారాయణము చేయవలెను.

4. సూర్యదశలో సూర్యభుక్తి దుష్టమగుచో రుద్రుని కాలకూటభక్షణ (బాల - 45) సర్గను ప్రాతఃకాలమందు ఏకాగ్రచిత్తుడై పరమేశ్వరుని ధ్యానించి చదువవలెను.

| సంస్కృతమూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 5. చంద్రభుక్తి ర్యదా క్రూరా<br>సూర్యస్యైవ దశాంతరే,<br>పఠేత్ శూర్పణఖాభంగ<br>సర్గం త్రిషవణం యతః. | 5. సూర్యదశయందు చంద్రగ్రహభుక్తి దోషో పేతమగుచో శూర్పణఖా భంగకథగల (అర-18) సర్గను మూడుసంధ్యలయందును చదువ వలెను. |
| 6. కుజభుక్తి ర్దోషదా చే<br>త్సూర్యస్య చ దశాంతరే,<br>అధికం మేనిరే విష్ణుం<br>ఇతి సర్గం సదా పఠేత్. | 6. సూర్యదశలో కుజభుక్తి దోషముగ నున్నచో "అధికం మేనిరే విష్ణుం" అను (బాల-75) సర్గను పారాయణము చేయవలెను. |
| 7. గురోర్భుక్తి ర్దోషదా చే<br>దాదిత్యస్య దశాంతరే,<br>స రామో రథమాస్థాయే<br>త్యాదిసర్గం పఠే న్ముదా. | 7. సూర్యదశలో గురుభుక్తి దోషముగల దగుచో "స రామో రథ మాస్థాయ" అను అయోధ్యా-17) సర్గను చదువవలెను. |
| 8. శుక్రభుక్తిక్రౌర్యదోష<br>శాన్త్యర్థం భాస్కరాన్తరే,<br>సీతోక్తస్వవివాహాఖ్య<br>సర్గం సర్వాత్మనా పఠేత్. | 8. సూర్యదశలో శుక్రభుక్తి క్రూరముగ నున్నచో సీతచే చెప్పబడిన తన వివాహసర్గను (అయోధ్యా-118) ఏకాగ్రచిత్తముతో పఠింపవలెను. |
| 9. శనిభుక్తి ర్యది క్రూరా<br>దశాయాం భాస్కరస్య చ,<br>ఇంద్రజిద్వధసర్గం తు<br>పఠేచ్ఛృణుయా దపి. | 9. సూర్యదశలో శనిభుక్తి క్రూరమైయున్నచో ఇంద్రజిత్తువధ యుండు (యుద్ధ 91) సర్గను చదివినను చదువవలెను, లేదా వినవలెను. |
| 10. రాహోశ్చే ద్దోషదా భుక్తి<br>ర్దినరశ్మే ర్దశాంతరే,<br>దేవేభ్యః పార్వతీశాప<br>సర్గం తు ప్రయతః పఠేత్. | 10. సూర్యదశలో రాహువుభుక్తి దోషప్రదమై యున్నచో దేవతలను పార్వతి శపించిన (బాల-36) సర్గను నియమముతో చదువవలెను. |
| 11. కేతుభుక్తి స్తు దుష్టా చే<br>ద్దశాయాం తు రవే స్తదా, | 11. సూర్యదశలో కేతుభుక్తి దుష్టముగ నుండెనేని జటాయువుకు మోక్షమునిచ్చు |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| జటాయుషే మోక్షదాన<br>సర్గం భక్తియుత: పఠేత్. | (అరణ్య 68) సర్గను భక్తితో పఠించవలెను. |
| **చంద్రదశాంతర్దశాదోషపరిహారః –** | **చంద్రదశయొక్క యంతర్దశలదోష పరిహారము** |
| 12. సోమస్య చేద్దశా దుష్టా<br>తస్యా: శాంత్యర్థ మాదరాత్,<br>తత. స మధ్యంగతమి<br>త్యముం సర్గం పఠే న్నిశి. | 12. చంద్రగ్రహము దుష్టమయి యతని మహాదశ దుష్టముగ నున్నచో దాని శాంతికై ఆదరమున "తత: స మధ్యం గతం" అను శ్లోకములుగల (సుందర - 5) సర్గను శుక్లపక్షమున రాత్రులందు, సాయంసమయమునను పఠించవలెను. |
| 13 శుక్లపక్షే ప్రదోషే చ<br>తత శ్చంద్రం ప్రపూజయేత్. | 13. తరువాత చంద్రుని పూజించవలెను. |
| 14. అశుభా సోమభుక్తిశ్చే<br>త్సోమస్యైవ దశాంతరే,<br>నృగస్య చరితం కృత్స్నం<br>పఠే దుత్తరకాండగం. | 14. చంద్రదశయందు చంద్రభుక్తి దోషముతో కూడియున్నచో ఉత్తరకాండయందలి (53-54 సర్గలు) నృగమహారాజుచరిత్ర యంతయు చదువవలెను |
| 15. సూర్యభుక్తి ర్యదా క్రూరా<br>ప్రాప్య సోమస్య వై దశాం,<br>హనుమద్రామసంబంధ<br>సర్గం భక్త్యా చ వాచయేత్. | 15. చంద్రదశయందు సూర్యభుక్తి క్రూరముగ నున్నచో హనుమద్రామ సంబంధ (కిష్కింధ-3) సర్గను భక్తితో చదివింపవలెను. |
| 16. భౌమస్య భుక్త్యా దోషశ్చే<br>న్నిశాకరదశాంతరే,<br>విశ్వామిత్రేణ నయనం<br>పఠే ద్రాఘవయో ర్ముదా. | 16. చంద్రదశయందు కుజభుక్తి దోషభూయిష్ఠ మగుచో విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తోడ్కొనిపోవు (బాల - 19, 20, 21, 22) సర్గలు సంతోషముతో చదువవలెను. |
| 17. సౌమ్యభుక్తి రసౌమ్యా చే<br>త్సోమస్యైవ దశాంతరే,<br>సీతారాఘవసంవాద<br>సర్గా న్మధ్యందినే పఠేత్. | 17. చంద్రదశయందు గురుభుక్తి క్రూరమైనచో సీతారాఘవ సంవాదముగల (అయోధ్య - 26, 27, 28, 29, 30) సర్గలు మధ్యాహ్నమున చదువవలెను. |

| సంస్కృతమూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 18. చంద్రస్యైవ దశాయాం తు<br>గురుభుక్తి ర్యదాఽశుభా,<br>నారదోక్తాం రామకథాం<br>పూతాత్మా ప్రయత: పఠేత్. | 18. చంద్రదశయందు గురుభుక్తి అశుభముగ నున్నచో నారదునిచే చెప్పబడిన రామకథను (బాల 1 సర్గ) పవిత్రమగు మనస్సుతో నియమము కలిగి పఠించవలెను. |
| 19. శుక్రస్యాంతర్దశా దుష్టా<br>యది సోమదశాంతరే,<br>ఉత్థానసర్గం వహ్నే స్తు<br>సీతాయా: ప్రయత: పఠేత్. | 19. చంద్రదశయందు శుక్రుని యంతర్దశ దోషయుతముగ నున్నచో సీత అగ్నినుండి లేచు (యుద్ధ-121) సర్గను పఠించవలెను. |
| 20. శనైశ్చరస్య దుష్టా చే<br>ద్భుక్తి శ్చంద్రదశాంతరే,<br>సాయం ప్రాత: పఠే త్సర్గం<br>నిత్యం ఖరవధాత్మకమ్. | 20. చంద్రదశయందు శనిభుక్తి దుష్టమగుచో ఖర సంహారముకల (అరణ్య-30) సర్గను నిత్యము ఉదయమునను, సాయంకాలమునను చదువవలెను. |
| 21. రాహుభుక్తి ర్దోషదా చే<br>చ్చంద్రస్య తు దశాంతరే,<br>అహల్యా శాపనిర్మోక్ష<br>సర్గం భక్త్యాఽత్ర సంపఠేత్. | 21. చంద్రదశయందు రాహుభుక్తి అమంగళకరముగ నున్నచో అహల్యాశాపోపశమన (బాల-49) సర్గను భక్తితో చదువవలెను. |
| 22. మహాదశాయాం సోమస్య<br>కేతోశ్చే ద్భుక్తి రక్షమా,<br>రక్షోవధప్రతిజ్ఞాఖ్యం<br>పఠే త్సర్గం ప్రయత్నత:. | 22. చంద్రుని మహాదశయందు కేతుభుక్తి మిక్కిలి అహితముగ నున్నచో రక్షస్సంహారమునకై ప్రతిజ్ఞ చేసిన (అరణ్య 6) సర్గను చదువవలెను. |
| **కుజదశాంతర్దశాదోషపరిహార: -** | **కుజునిదశయందలి యంతర్దశల దోషపరిహారము** |
| 23. కుజస్య చే ద్దశా దుష్టా<br>కుమారోత్పత్తిసర్గకౌ,<br>పఠేద్వా శ్రుణుయాద్వాపి<br>సుబ్రహ్మణ్యార్పితాశయ: | 23. కుజునిమహాదశ సరిగా లేనిచో కుమారస్వామి జనించిన రెండు (బాల-36, 37, సర్గలను సుబ్రహ్మణ్యస్వామియందు మనస్సు నుంచి చదివినను, వినినను ఆ దోష ముపశమించును. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| పఠనాంతే చ వల్లీశం<br>పూజయే దాలయేపి వా. | పారాయణాంతమున కుమారస్వామిని ఆలయమునకైనను పూజించవలెను. |
| 24. మహాదశాయాం భౌమస్య<br>తస్యైవాంతర్దశాఽశుభా,<br>అగస్త్యపూజాం రామాయ<br>పఠే దుత్తరకాండగాం. | 24. కుజునిదశయందు కుజుని యంతర్దశ సరిగా లేనిచో ఉత్తరకాండయందు రామునకు అగస్త్యుడు పూజచేసిన (ఉత్తర-76) సర్గను పఠించవలెను. |
| 25. భౌమస్యైవ దశాభాగే<br>సూర్యభుక్తిః శుభా న చేత్,<br>కందర్పనాశనాఖ్యం తు<br>పఠే త్సర్గ మనుత్తమం. | 25. కుజదశయందు సూర్యాంతర్దశ సరిగాలేనిచో కామదహనముకల (బాల-23) యుత్తమ సర్గను పఠించవలెను. |
| 26. మహాదశాయాం భౌమస్య<br>సోమభుక్తి ర్న చే చ్ఛుభా,<br>వానరోత్పత్తి సర్గస్తు<br>భక్తియుక్త స్తదా పఠేత్. | 26. కుజుని మహాదశయందు చంద్రుని అంతర్దశ సరిగాలేనిచో వానరోత్పత్తి (బాల-17) సర్గను భక్తితో చదువవలెను. |
| 27. బుధభుక్తి ర్దోషదా చేత్<br>కుజస్యైవ దశాంతరే,<br>పాయసస్య ప్రదానాఖ్యం<br>పఠే త్సర్గం ప్రయత్నతః. | 27. కుజునిదశయందు బుధుని అంతర్దశ దోషప్రదముగ నున్నచో పాయసప్రదాన (బాల-16) సర్గను చక్కగా చదువవలెను. |
| 28. గురోశ్చే ద్దోషదా భుక్తి<br>ర్భౌమస్య తు దశాంతరే,<br>ఉపదేశం హనుమతో<br>రావణాయ తదా పఠేత్. | 28. కుజదశయందు గుర్వంతర్దశ సరిగాలేనిచో రావణునకు హనుమంతుడు హితోపదేశమును చేయు (సుందర-51) సర్గను పారాయణము చేయవలెను. |
| 29. శుక్రభుక్తి ర్దోషదా చే<br>ల్లోహితాంగదశాంతరే, | 29. కుజదశయందు శుక్రునియంతర్దశ క్రూరముగ నున్నచో హనుమంతుని కాల్చకుండుటకై |

సంస్కృత మూలము. — ఆంధ్రానువాదము.

సీతాయాః ప్రార్థనం వహ్ని
ముద్దిశ్య హనుమత్కృతే,
యత్ర తం సర్గ మాధ్యాయ
న్నాంజనేయం పఠేత్ క్రమాత్.

యగ్నినిగూర్చి సీత చేసిన స్తోత్రమునూ (సుందర-53) సర్గను పారాయణముచేయుచు ఆంజనేయుని ధ్యానింపవలెను.

30\. సౌరే రంతర్దశా క్రూరా
యది భౌమదశాంతరే,
కబంధబాహులవన
సర్గం ధ్యాయఞ్ఛనిం పఠేత్.

30\. కుజదశయందు శన్యంతర్దశ సరిగా లేనిచో కబంధబాహుచ్ఛేద (అరణ్య-70) సర్గను చదువుచు ధ్యానించవలెను.

31\. అంగారకదశాయాం తు
రాహో రంతర్దశాఽశుభా,
పఠేత్తు ప్రథమే యుద్ధే
రావణస్య పరాభవం.

31\. కుజదశయందు రాహువు నంతర్దశ సరిగా లేనిచో ప్రథమదివసమున రావణుని పరాభవ (యుద్ధ-59) సర్గను పఠించవలెను.

32\. కేతుభుక్తి ర్దోషదా చే
దంగారకదశాంతరే,
సీతాకృతాం రాక్షసీనాం
రక్షాం హనుమతః పఠేత్.

32\. కుజదశయందు కేతువుయొక్క అంతర్దశ దోషముగనున్నచో హనుమంతునినుండి రాక్షస స్త్రీలను సీత రక్షించిన (యుద్ధ-116) సర్గను చదువవలెను.

**రాహుదశాంతర్దశాదోషపరిహారః -**

**రాహుదశాంతర్దశా దోషపరిహారము -**

33\. దశాచే త్తమసో దుష్టా
కపిభిః కృత మాదరాత్,
లంకాదహనసర్గం తు
యుద్ధకాండగతం పఠేత్.

33\. రాహుమహాదశ దుష్టమగుచో యుద్ధకాండలోని వానరులు లంకనుగాల్చిన (యుద్ధ-75)సర్గను ఆదరముతో చదువవలెను.

34\. అన్తే జ్వాలామాలినే తు
పూజాం కృత్వాఽథయత్నతః,
నివేదయే దపూపాం శ్చ
మాధ్వీకం చ నివేదయేత్.

34\. చివరను జ్వాలామాలియగు సూర్యునిపూజించి అప్పములను తేనెను ఆరగింపు జేయవలెను.

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము |
|---|---|
| 35. తత్రైవ రాహుభుక్తి శ్చే<br>ద్దోషదా తత్ప్రశాంతయే,<br>నాగాస్త్రబంధనిర్మోక్షు<br>సర్గం భక్త్యా యుత: పఠేత్. | 35. రాహుదశయందు రాహుభుక్తి నీచస్థితిలో నున్నచో నట్టి దోషపరిహారమునకై నాగాస్త్ర బంధమును విడిపించు (యుద్ధ-50) సర్గను భక్తితో చదువవలెను. |
| 36. రాహో ర్దశాయాం సూర్యస్య<br>పీడా చే ద్భుక్తితో భవేత్,<br>బాలకాండగతం సూర్య<br>వంశ్యాఖ్యానం యత: పఠేత్. | 36 రాహుదశయందు సూర్యగ్రహాంతర్దశ బాధా కరమైనదగుచో బాలకాండయందలి సూర్య వంశకథను (బాల-70) సర్గను నియమముతో చదువవలెను. |
| 37. చంద్రభుక్తి ర్దోషదా చే<br>ద్రాహోరేవ దశాంతరే,<br>నర్మదాయాం రావణస్య<br>పూజాసర్గం యత: పఠేత్. | 37. రాహుదశయందు చంద్రభుక్తి దుష్టమైనదగుచో నర్మదానదిలో రావణుని పూజను గురించి యున్న (ఉత్తర-31) సర్గను నియమముతో పఠించవలెను. |
| 38. రాహో ర్దశాయాం భౌమస్య<br>భుక్త్యా చే ద్దురితం భవేత్,<br>పఠేత్ కైలాసచలనే<br>రావణస్య చ రోదనం. | 38. రాహుదశయందు కుజాంతర్దశ దుష్టముగ నున్నచో కైలాసపర్వతము నెత్తినపుడు రావణుని దు:ఖముగల (ఉత్తర-16) సర్గను చదువవలెను. |
| 39. బుధస్య భుక్త్యా దోష శ్చే<br>త్తమసస్తు దశాంతరే,<br>పఠే ద్బ్రహ్మకృతం స్తోత్రం<br>రావణస్య వధా త్పరం. | 39. రాహుదశలో బుధభుక్తి దుష్టముగ నున్నచో రావణుని వధానంతరము బ్రహ్మచే చేయబడిన స్తోత్రమును (యుద్ధ-120) సర్గను పఠించ వలెను. |
| 40. రాహో ర్దశాయాం భుక్త్యా చే<br>త్సురేజ్యస్యాఽశుభం భవేత్,<br>సర్గం రాజ్యాభిషేకాఖ్యం<br>సుగ్రీవస్య తదా పఠేత్. | 40. రాహుదశయందు గురుభుక్తి అనిష్టకరముగా నున్నచో సుగ్రీవుని రాజ్యాభిషేక (కిష్కింధ 26) సర్గను పఠింపవలెను. |

సంస్కృత మూలము | ఆంధ్రానువాదము

41. కవేర్భుక్తి రనర్థా చే
ద్రాహో ర్దత్తే దశాంతరే,
హనూమతా రాఘవాయ
చూడామణ్యర్పణం పఠేత్.

41. రాహుదశయందు శుక్రభుక్తి అనర్థదాయక మగుచో హనుమంతుడు రామునకు చూడామణి నొసగిన (సుందర-65) సర్గను పఠించవలెను.

42. శనైశ్చరస్య భుక్త్యా చే
ద్దోషో రాహుదశాంతరే,
హనూమతాఽక్షనాశాఖ్య
సర్గపారాయణం చరేత్.

42. రాహుదశయందు శనిభుక్తి సరిగా లేనిచో హనుమంతుడు అక్షకుమారుని చంపిన (సుందర-47) సర్గను పారాయణచేయవలెను.

43. కేతో రంతర్దశా దుష్టా
రాహోశ్చే త్స్యా ద్దశాంతరే,
రామేణ జామదగ్న్యస్య
లోకానాం నాశనం పఠేత్.

43. రాహుమహాదశయందు కేతువుయొక్క అంతర్దశ కష్టదాయకమగుచో రాముడు పరశురాముని పుణ్యలోకముల నశింపజేసిన (బాల-76) సర్గను పారాయణము చేయవలెను.

## గురుదశాంతర్దశాదోషపరిహారః —

## గురుదశయందలి యంతర్దశల దోషము పోపికొను విధము

44. గురో ర్దశాచే దుగ్రా స్యా
త్తదా సుందరకాండకే,
పఠే త్సముద్రతరణ
సర్గ మేకం హనూమతః.

44. గురుమహాదశ మిక్కిలి క్రూరముగ నున్నచో సుందరకాండయందలి హనుమంతుని సముద్ర లంఘనసర్గ నొకదానిని పారాయణమాచరింపవలెను.

45. అంతే చ సితయా మిశ్రాన్
లాజాన్ హనుమతేఽర్పయేత్.

45. చివరను పంచదారతో కలిపిన పేలాలను హనుమంతునకు నైవేద్య మొసగవలెను.

46. గురో ర్దశాయాం తస్యైవ
భుక్తిశ్చే ద్దోషదా భవేత్,
పఠేత్తు శరభంగస్య
మోక్షసర్గం ద్విసంధ్యయోః.

46. గురుదశయందు గురుభుక్తియే దుష్టమగుచో శరభంగుని మోక్షగమన (అరణ్య-40) సర్గను రెండువేళలయందు పఠించవలెను.

47. గురో ర్దశాయాం సూర్యస్య
భుక్తిశ్చే ద్దోషభావినీ,

47. గురుదశయందు సూర్యగ్రహాంతర్దశ దోషభూయిష్ఠమగుచో వానరులకు సుగ్రీవుడు

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| సుగ్రీవోక్తం వానరాణాం<br>పూర్వదిఙ్మార్గ మాపఠేత్. | చెప్పిన తూర్పుదిక్కు మార్గవివరణముగల<br>(కిష్కింధ-40) సర్గను చదువవలెను. |
| 48. గురో ర్దశాయాం చంద్రస్య<br>భుక్తి ర్యది విపత్తిదా,<br>సంపాతిపక్షిణోత్పత్తి<br>కథాసర్గాన్ పఠే త్సుధీః. | 48. గురుదశయందు చంద్రభుక్తి ఆపదల నొసగు<br>నదిగ నున్నచో జ్ఞానము కలవాడు సంపాతికి<br>రెక్కలువచ్చు కథగల (కిష్కింధ - 60-63)<br>సర్గలను చదువవలెను. |
| 49. గురో ర్మహాదశాయాం తు<br>కుజభుక్తి ర్యదాఽశుభా,<br>అయోధ్యావర్ణనం బాల<br>కాండస్థం సర్గ మాపఠేత్. | 49. గురుమహాదశయందు కుజభుక్తి సరిగాలేనిచో<br>బాలకాండయందలి అయోధ్యాపురవర్ణనమును<br>(బాల-5 సర్గ) పారాయణ చేయవలెను. |
| 50. గురో ర్దశాయాం సౌమ్యస్య<br>భుక్తి ర్యది విపత్ప్రదా,<br>దేవానాం ప్రార్థనాసర్గౌ<br>విష్ణుం ప్రతి యతః పఠేత్. | 50. గురుదశయందు బుధునిభుక్తి అపత్కారణ<br>మగుచో విష్ణువునుగురించి దేవతలు ప్రార్థించిన<br>(బాల-15,16) రెండుసర్గలను చదువవలెను. |
| 51. గురో ర్దశాయాం శుక్రస్య<br>భుక్తిశ్చే ద్దోషదా భవేత్,<br>బాలకాండాంతిమం సర్గం<br>పఠేత్ భక్తి సమన్వితః. | 51. గురుదశయందు శుక్రభుక్తి దుష్టముగనున్నచో<br>భక్తికలవాడై బాలకాండయందలి ఆఖరు<br>(బాల-77) సర్గను చదువవలెను. |
| 52. శనిభుక్తి ర్దోషదా చే<br>త్సురేజ్యస్య దశాంతరే,<br>సుమంత్రస్యానుగ్రహార్థం<br>పఠే ద్రామస్య దర్శనం. | 52. గురుదశయందు శనిభుక్తి కష్టముకలుగజేయు<br>నదిగనున్నచో సుమంత్రుని అనుగ్రహించుటకై<br>రామునిదర్శనముగల (అయోధ్య-16) సర్గను<br>చదువవలెను. |
| 52(a) రాహుభుక్తి ర్దోషదా చే<br>ద్గురోరేవ దశాంతరే,<br>శబరీమోక్షసర్గం తు<br>పఠే ద్భక్తి సమన్వితః. | 52 (a) గురుదశయందు రాహుభుక్తి సరిగాలేనిచో<br>శబరికి మోక్షమునొసగిన (అరణ్య-74) సర్గను<br>భక్తితో చదువవలెను. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము. |
|---|---|
| 53. కేతుభుక్త్యా భవే త్పీడా<br>గురో ర్యది దశాంతరే,<br>పఠే న్మధువనధ్వంస<br>సర్గద్వయ మనుత్తమం. | 53. గురుదశయందు కేతుభుక్తి అపత్కరమగుచో గొప్పవగు మధువనధ్వంస సర్గలను రెండింటిని (సుందర-61, 62) చదువవలెను. |

| శని దశాంతర్దశాదోషపరిహార: - | శనిదశయందలి యంతర్దశల దోషపరిహారము |
|---|---|
| 54. శనైశ్చరస్య దుష్టా చే<br>ద్దశా రాక్షసనాశనం,<br>విశ్వామిత్రాధ్వరే సర్గం<br>పఠే త్పూర్వం తు భోజనాత్. | 54. శనిమహాదశ దోషముగ నున్నచో విశ్వామిత్ర యాగసంరక్షణమున రాక్షసనాశన మొన రించిన (బాల-30) సర్గను భోజనము చేయక మునుపే పారాయణము చేయవలెను, లేక విన వలెను. |
| 55. పాఠకాలే భవే న్మౌనీ<br>శృణుయాద్వాపి తాదృశ:.<br>మృత్యుంజయాయ పాఠాంతే<br>తిలాన్నం వినివేదయేత్. | 55. చదువునపుడు వినునప్పుడును మౌనముగనుండి పారాయణానంతరమున శివునకు నువ్వులతో కలసిన అన్నమును నైవేద్యము చేయవలెను. |
| 56. శనే ర్దశాయాం భుక్తిశ్చే<br>చ్ఛనేరేవాఽహితా భవేత్.<br>బ్రహ్మాస్త్రబంధముక్త్యాఖ్యం<br>పఠే త్సర్గం హనూమత:. | 56. శనిదశయందు శనిభుక్తియే హానిని కలుగ జేయునది యగుచో హనుమంతుని బ్రహ్మాస్త్ర బంధచ్ఛేదసర్గను (సుందర - 48) చదువ వలెను. |
| 57. శనైశ్చరదశాయాం తు<br>సూర్యభుక్తి ర్యదాఽశుభా,<br>హనుమజ్జననం సర్గం<br>కిష్కింధాకాండగం పఠేత్. | 57. శనిదశయందు సూర్యభుక్తి బాగు లేనిచో కిష్కింధాకాండయందలి హనుమజ్జనన (66) సర్గను పఠించవలెను. |
| 58. చంద్రభుక్తి ర్దోషదా చే<br>చ్ఛనైశ్చరదశాంతరే, | 58. శనిదశయందు చంద్రభుక్తి దుష్టముగనున్నచో దోషము పోవువరకు |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| తాటకావధసర్గం తు<br>పఠే దాదోషనాశనం. | తాటకావధ (బాల-26) సర్గను పఠించవలెను. |
| 59. భౌమస్య భుక్తిశ్చే త్క్రూరా<br>శనేరేవ యదా దశా,<br>స్వయంప్రభాబిలోత్తార<br>సర్గపారాయణం చరేత్. | 59. శనిదశయందు కుజభుక్తి క్రూరముగనున్నచో స్వయంప్రభాబిలమును వానరులు దాటిన (కి-50,51) సర్గలను పారాయణము చేయవలెను. |
| 60. శనే ర్దశాయాం సౌమ్యస్య<br>భుక్తిశ్చే త్క్లేశదాయినీ,<br>లంకాదాహం హనుమతా<br>కృతం సర్గం తదా పఠేత్. | 60. శనిదశయందు బుధభుక్తి కష్టదాయకమగుచో హనుమంతుడు లంకను దహింపజేసిన సర్గను (సుందర-54) చదువవలెను. |
| 61. మహాదశాయాం సౌరస్య<br>గురుభుక్తిస్తు దోషదా,<br>రామాలింగనసర్గం తు<br>పఠే ద్దాసహనూమతః. | 61. శనిదశయందు గురుభుక్తి దోషముగ నున్నచో దాసుడగు హనుమంతుని రాము డాలింగన మాచరించిన (యుద్ధ-1) సర్గను చదువవలెను. |
| 62. శనే ర్దశాయాం శుక్రస్య<br>భుక్తి ర్యది విపత్ప్రదా,<br>చూడామణిప్రదానాఖ్యం<br>పఠే త్సర్గం హనూమతే. | 62. శనిదశయందు శుక్రుని అంతర్దశ విపత్కారిణి యగుచో హనుమంతునకు చూడామణి నొసంగిన (సుందర-38) సర్గను చదువవలెను. |
| 63. రాహోశ్చే ద్భుక్తి రశుభా<br>సౌరస్యాథ దశాంతరే.<br>మాయామృగవధాభిఖ్యం<br>పఠే త్సర్గం ప్రయత్నతః. | 63. శనిదశయందు రాహ్వంతర్దశ సరిగా లేనిచో మాయలేడిని చంపిన (అరణ్య-44) సర్గను నియమముతో చదువవలెను. |
| 64. కేతుభుక్తి రనర్థం చే<br>ద్దత్తే శనిదశాంతరే, | 64. శనిదశయందు కేత్వంతర్దశ సరిగా లేనిచో సుగ్రీవుడు సీత నగలమూటనిచ్చు (కిష్కిం-6) |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| సీతాభరణ జాలానాం<br>సుగ్రీవేణార్పణం పఠేత్. | సర్గను పారాయణ చేయవలెను. |

| **బుధదశాంతర్దశాదోషపరిహారః -** | **బుధదశాంతర్దశల దోషపరిహారము -** |
|---|---|
| 65. దశా బుధస్య దుష్టా చే<br>త్సీతాగ్రే హనుమత్కృతమ్,<br>శ్రీరామవర్ణనం సర్గం<br>పఠే త్సంపూజ్య రాఘవం.<br>పఠనాంతే రాఘవస్య<br>ముద్గాన్నం వినివేదయేత్. | 65. బుధుని మహదశ దోషభూయిష్ఠ మగుచో రాఘవుని పూజించుచు హనుమంతుడు సీత యెదుట రాముని వర్ణించిన (సుందర-35) సర్గను చదువవలెను. పూర్తియైన తరువాత పులగము (పొంగలి) నైవేద్యము చేయవలెను. |
| 66. బుధభుక్తిస్తు తత్రైవ<br>యది దోషప్రదా భవేత్,<br>వామనోత్పత్తిచరిత<br>సర్గం ప్రాతః పఠే చ్ఛుతుః. | 66. బుధమహదశయందు బుధునిభుక్తి ఆపదకలుగజేయునదిగ నున్నచో నాల్గుదినములు ఉదయమునవే వామనావతార (బాల-29) సర్గను చదువవలెను. |
| 67. బుధస్య తు దశాయాం చే<br>త్సూర్యభుక్తిస్తు దోషదా,<br>తదా మూలబలధ్వంస<br>సర్గం త్రిషవణం పఠేత్. | 67. బుధునిదశయందు సూర్యభుక్తి సరిగా లేనిచో రావణుని మూలబలమును జంపిన కథగల (యుద్ధ-94) సర్గను మూడుసంధ్యలయందును చదువవలెను. |
| 68. మహాదశాయాం సౌమ్యస్య<br>చంద్రస్యాంతర్దశాఽశుభా,<br>సంవాద మత్రే రామేణ<br>సర్గం తు ప్రయతః పఠేత్. | 68. బుధునిదశయందు చంద్రుని అంతర్దశ అశుభముగ నున్నచో రామునకును అత్రి మహర్షికిని జరిగిన సంవాదముగల (అయోధ్య - 117) సర్గను చదువవలెను. |
| 69. బుధస్య చే ద్దశాయాం తు<br>భౌమభుక్తిస్తు పీడయేత్,<br>సీతాశుభనిమిత్తాఖ్య<br>సర్గం షడ్వార మాపఠేత్. | 69. బుధునిదశయందు కుజుని అంతర్దశ బాధను కలిగించునట్లున్నచో సీతకు శుభశకునములు కలిగిన (సుందర-27) సర్గను ఆరు పర్యాయములు చదువవలెను. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము. |
|---|---|
| 70. అశుభా గురుభుక్తి శ్చే<br>ద్బుధస్యైవ దశాంతరే,<br>సర్గం పఠేత్తు సురభే<br>రాఖ్యానం భరతోదితం. | 70. బుధునిదశయందు గురుభుక్తి అశుభముగ నున్నచో భరతునిచే చెప్పబడిన సురభియొక్క కథను (అయో-74) పారాయణ చేయవలెను. |
| 71. బుధస్యైవ దశాయాం తు<br>శుక్రభుక్తి ర్యదాఽహితా,<br>సీతారాఘవసంవాదం<br>పఠే దారణ్యకాండగం. | 71. బుధదశలో శుక్రాంతర్దశ అమంగళకారిణి యగుచో అరణ్యకాండయందలి (9, 10 సర్గ) సీతారామసంవాదమును చదువవలెను. |
| 72. శనిభుక్తి ర్దోషదా చే<br>ద్బుధస్య తు దశాంతరే,<br>స్మర న్మనసి కోదండ<br>పాణిం రాఘవ మాదరాత్.<br>పఠే త్సర్గం భక్తియుతో<br>రావణస్య వధాత్మకం. | 72. బుధదశలో శనియంతర్దశ దోషముతో కూడి యున్నచో కోదండపాణియగు శ్రీరామచంద్రు నత్యాదరమున మనసున ధ్యానించుచు రావణ వధ (యుద్ధ-111) సర్గను భక్తితో పఠించ వలెను. |
| 73. మహాదశాయాం సౌమ్యస్య<br>రాహుభుక్తిస్తు దోషదా,<br>చారేణ తు దశాస్యాయ<br>రాఘవస్య ప్రదర్శనం.<br>సర్గ మేకం పఠే ద్యత్తో<br>గ్రంథే సంపూజ్య రాఘవం. | 73. బుధునిదశయందు రాహుభుక్తి అమంగళ కారిణియగుచో జితేంద్రియుడై శ్రీరామాయణ గ్రంథమున రాఘవుని పూజించుచు గూఢచారి వచ్చి రావణునకు రాము నెఱిగించు నొక (యుద్ధ-28)సర్గను పారాయణము చేయవలెను. |
| 74. కేతుభుక్తి ర్దోషదా చే<br>ద్బుధస్యాథ దశాంతరే,<br>హనూమతాఽశోకవనే<br>సీతాన్వేషణ మాపఠేత్. | 74. బుధదశలో కేతుభుక్తి దోషముల నిచ్చునదగుచో అశోకవనమున హనుమంతుడు సీతను వెదకు (సుందర-14) సర్గను చదువవలెను. |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| **కేతుదశాంతర్దశాదోషపరిహారః -** | **కేతుదశయందలి యంతర్దశా దోష పరిహార** |
| 75. కేతో ర్దశా దోషదా చే<br>త్సర్గం గుహసమాగమం,<br>రాఘవస్య పఠే ద్భక్త్యా<br>హృది కృత్వా రఘూత్తమం.<br>అంతే నివేదయే ద్రస్యా<br>న్మాషాపూపాన్ ఘృతాచితాన్. | 75. కేతుమహాదశ అనిష్టకారిణి యగుచో రామ చంద్రుని మనమున నిడికొని శ్రీరామచంద్రుడు గుహునితో మైత్రిచేసిన (అయోధ్య-50) సర్గను పారాయణముచేసి చివరను నేతితో వండిన మినుపగారెలను నైవేద్యము చేయవలెను. |
| 76. కేతో ర్దశాయాం కేతోశ్చే<br>ద్భుక్తి ర్దోషవిధాయినీ,<br>దైవప్రశంసాం రామస్య<br>ముఖాబ్జా న్నిస్సృతాం పఠేత్. | 76. కేతుదశలో కేతుభుక్తి దోషముల నిచ్చున దగుచో రామునిచే చేయబడిన దైవప్రశంసను (అయోధ్య-22) పారాయణ చేయవలెను. |
| 77. కేతోర్దశాయాం సూర్యస్య<br>భుక్తిశ్చే త్క్లేశకారిణీ,<br>పఠే దయోధ్యాకాండస్థం<br>సూర్యవంశానుకీర్తనం. | 77. కేతుదశయందు సూర్యభుక్తి కష్టదాయిని యగుచో అయోధ్యాకాండయందలి సూర్య వంశక్రమముతెల్పు (అయోధ్య-110) సర్గను చదువవలెను. |
| 78. కేతో ర్దశాయాం సోమస్య<br>దుష్టా త్వంతర్దశా యది,<br>బలాతిబలయో ర్దానం<br>రాఘవాయ పఠే ద్వ్రతః. | 78. కేతుదశయందు చంద్రుని అంతర్దశ చెడ్డది యగుచో శ్రీరామచంద్రునకు బలాతిబలావిద్యల నొసగిన (బాల-22) సర్గను నియమముతో చదువవలెను. |
| 79. కేతో ర్దశాయాం భౌమస్య<br>యది భుక్త్యాఽహితం భవేత్,<br>కచ్చిత్సర్గం పఠే త్సమ్యక్<br>హృది ధ్యాయన్ రఘూత్తమం. | 79. కేతుదశయందు కుజభుక్తివలన అశుభము కలుగుచో శ్రీరామచంద్రుని మనమున ధ్యానించుచు కచ్చిత్సర్గ (అయోధ్య-100)ను చదువవలెను. |
| 80. కేతో ర్దశాయాం భుక్తిస్తు<br>బుధస్య యది దోషదా, | 80. కేతుదశయందు బుధభుక్తి అపకారిణియగుచో |

| సంస్కృతమూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| పఠే ద్రామకథాం ప్రోక్తాం<br>భరతాయ హనూమతా. | హనుమంతుడు భరతునకు చెప్పిన రామకథ (యుద్ధ-129) సర్గను చదువవలెను. |
| 81. గురుభుక్తి ర్దోషదాత్రీ<br>కేతోశ్చే త్తు దశాంతరే,<br>హనూమదుక్తం సీతాయై<br>రామస్య విజయం పఠేత్. | 81. కేతుదశయందు గురుభుక్తి కష్టముల నిచ్చు నదిగనున్నచో హనుమంతుడు సీతతో చెప్పిన రాముని విజయముగల (యుద్ధ-116) సర్గను చదువవలెను. |
| 82. శుక్రభుక్త్యా తు దోషశ్చే<br>త్కేతో రేవ దశాంతరే,<br>హనూమదుక్తం రామాయ<br>సీతాదర్శన మాపఠేత్. | 82. కేతుదశయందు శుక్రభుక్తి దోషకారిణి యగుచో హనుమంతుడు రామునితో సీతను చూచివచ్చితి నని చెప్పిన (సుందర-65) సర్గను చదువవలెను |
| 83. మహాదశాయాం కేతోశ్చే<br>చ్ఛనిభుక్తి రనర్థదా,<br>పఠే త్త్రిసంధ్యం ప్రయతః<br>ప్రహస్తవధసర్గకం. | 83. కేతుమహాదశయందు శనిభుక్తి అనర్థదాయిని యగుచో ప్రహస్తవధ (యుద్ధ-58) సర్గను మూడువేళలయందు జితేంద్రియుడై చదువవలెను. |
| 84. కేతోర్మహాదశాయాం తు<br>రాహుభుక్తి రనర్థదా,<br>కుంభకర్ణస్య నిధనం<br>పఠే త్సర్గం దివానిశం. | 84. కేతుమహాదశయందు రాహుభుక్తి అనిష్టకారిణి యగుచో కుంభకర్ణవధను (యుద్ధ - 67) రాత్రింబవళ్లు చదువవలెను. |
| **శుక్రదశాంతర్దశాదోషపరిహారః —** | **శుక్రదశయందలి యంతర్దశల దోషపరిహారము** |
| 85. శుక్రస్యచే ద్దశా దుష్టా<br>సీతోద్వాహాఖ్యసర్గకం,<br>జానకీం మనసా ధ్యాయ న్<br>సర్వాభరణభూషితాం. | 85. శుక్రుని మహాదశ దుష్టముగనున్నచో సర్వాభరణభూషితురాలగు సీతను మనమున ధ్యానించుచు సీతావివాహ బాల - 73)సర్గను-పారాయణము చేయవలెను. |
| 86 పఠే త్కుంకుమగంధాద్యై<br>రభ్యర్చ్య గ్రంథసత్తమం. | 86. కుంకుమ గంధాదులతో శ్రీరామాయణ మహాగ్రంథమును పూజించి మంచి ముత్తైదువులకు |

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము. |
|---|---|
| సువాసినీభ్యః పారాంతే మల్లికాజాతిమాలతీః. | పారాయణాంతమున మల్లి, జాజి మొదలగు |
| 87. శ్వేతపుష్పాణి చాన్యాని చందనం కుంకుమం తథా, తాంబూలం చ యథాశక్తి దద్యా ద్రజతదక్షిణాం. | 87. తెల్లని పుష్పములను చందనకుంకుమములను తాంబూలమును వెండిరూప్యముల దక్షిణను యథాశక్తిగ నీయవలెను. |
| 88. తత్రైవ శుక్రభుక్తిశ్చే త్ప్రాణినాం దోషకారిణీ, అంగులీయప్రదానస్య సర్గం సుందరకాండగం. పఠే త్త్రిషవణం భక్త్యా పూజయిత్వా మహీసుతాం. | 88. శుక్రదశలో శుక్రభుక్తి ప్రాణులకు దోషదాయిని యగుచో సీతను భక్తితో పూజించి సుందరకాండ యందలి అంగుళీయ ప్రదాన సర్గను (సుంద-36) మూడుదినములు చదువవలెను |
| 89. సా చే ద్భుక్తి ర్దోషదా స్యాత్ స్త్రీణాం తత్రైవ కాండకే, సీతాయా ఆంజనేయేన సంవాదస్య తు సర్గకం, శృణుయా త్సా అర్థతశ్చ శబ్దతశ్చ ద్విజాననాత్. | 89. స్త్రీలకు శుక్రదశలో శుక్రభుక్తి హానికరముగ నున్నచో సుందరకాండయందలి సీతాంజనేయ సంవాదముగల (సుందర-33) సర్గను బ్రాహ్మణోత్తములచే పారాయణము చేయించియు అర్థము చెప్పించియు వినవలెను. |
| 90. భార్గవస్య దశాయాం తు సూర్యభుక్తి ర్యదాఽశుభా, పఠే చ్ఛివధనుర్భంగ సర్గ మత్యంత మాదృతః. | 90. శుక్రదశలో సూర్యభుక్తి అశుభముగ నున్నచో మిక్కిలి ఆదరముతో శివధనుర్భంగ (బాల-67, సర్గను చదువవలెను. |
| 91. మహాదశాయాం శుక్రస్య చంద్రభుక్తిస్తు దోషదా, పఠే చ్చంద్రోదయే శుక్ల పక్షే పశ్య న్సుధాకరం. | 91. శుక్రునిమహాదశలో చంద్రభుక్తి దోషములనిచ్చునదిగా నున్నచో శుక్లపక్షమున చంద్రోదయ సమయమున చంద్రునిచూచుచు ఇలోపాఖ్యాన |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| ద్రలోపాఖ్యానసర్గం తు<br>ధ్యాత్వాంబాం చంద్రమండలే. | (ఉత్తర-87, 88, 89, 90) సర్గలను చంద్ర మండలమందలి లక్ష్మిని ధ్యానించుచు చదువ వలెను. |
| 92. కవే ర్దశాయాం భౌమస్య<br>యది భుక్తిః ప్రపీడయేత్,<br>రాజ్యాభిషేకసర్గం తు<br>పఠే త్పాదుకయోః ప్రభోః. | 92. శుక్రదశయందు కుజభుక్తి బాధాకారిణియగుచో శ్రీరామపాదుకల రాజ్యాభిషేక (అయోధ్య-115) సర్గను చదువవలెను. |
| 93. బుధభుక్తి ర్దోషదా చే<br>చ్ఛుక్రస్యైవ దశాంతరే,<br>మాల్యవన్మాలివిజయం<br>పఠే త్సర్గత్రయం యతః. | 93. శుక్రదశయందు బుధభుక్తి దోషముల నిచ్చున దగుచో విష్ణువు మాల్యవంతుని మాలిని జయించిన కథగల (ఉత్తర 6, 7, 8) సర్గలను మూడిటిని చదువవలెను. |
| 94. గురుభుక్తిః పీడికా చే<br>చ్ఛుక్రస్య తు దశాంతరే,<br>పఠే ద్దశరథస్యాశ్వ<br>మేధసర్గం ప్రయత్నతః. | 94. శుక్రదశయందు గురుభుక్తి పీడను కలుగ జేయుచో దశరథుని అశ్వమేధమును తెల్పు (బాల-14) సర్గను అతిజాగరూకతతో చదువ వలెను. |
| 95. మహాదశాయాం శుక్రస్య<br>మందస్యాంతర్దశాఽశుభా<br>ఓషధిక్ష్మాభృదాయత్త<br>లక్ష్మణోజ్జీవనం పఠేత్. | 95. శుక్రదశయందు శనియంతర్దశ అశుభముగ నున్నచో హనుమంతుడు సంజీవిపర్వతమును దెచ్చి లక్ష్మణుని బ్రతికించిన (యుద్ధ-102) సర్గనుచదువవలెను. |
| 96. శుక్రస్యచే ద్దశాయాం తు<br>రాహుభుక్తిస్తు దోషదా,<br>శ్వభ్రక్షేపం విరాధస్య<br>సర్గ మాదరతః పఠేత్. | 96. శుక్రదశయందు రాహుభుక్తి దోషదాయిని యగుచో విరాధుని ఖననసంస్కార మొనర్చిన (అరణ్య 4) సర్గను ప్రేమతో చదువవలెను. |
| 97. శుక్రస్య తు దశాయాం తు<br>కేతుభుక్తి ర్యదాఽశుభా,<br>సింధుతీరే రాఘవస్య<br>శయనం దర్భసంస్తరే. | 97. శుక్రదశయందు కేతుభుక్తి అశుభ మగుచో శ్రీరామచంద్రుడు సముద్రతీరమున దర్భలపై శయనించినదాదిగా సేతుబంధనమువరకు |

| సంస్కృత మూలము. | ఆంధ్రానువాదము |
| --- | --- |
| పఠే దాసేతుబంధాంత<br>మంతే నీరాజయే త్ప్రభుం. | (యుద్ధ - 19, 20, 21, 22) సర్గలను పారాయణముచేసి శ్రీరామచంద్రునకు హారతి యీయవలెను. |
| 98. ఏవం నవగ్రహాణాం తు<br>దశా శ్చాంతర్దశాః ప్రియే,<br>ఉద్దిశ్య పరిహారోఽయం<br>కథిత స్తే సుమధ్యమే. | 98. ఓ పార్వతీ! ఇట్లు నవగ్రహములయొక్క మహాదశలును అంతర్దశలును దుష్టముగ నున్నచో వాని పరిహారోపాయములనుగూర్చి చెప్పితిని (అని శివుడు పార్వతినిగూర్చి పలికెను. |
| 99. ప్రియం రవే రిక్షుఖండం<br>చంద్రస్య తు పయః ప్రియం,<br>భౌమప్రియం పాయసం స్యా<br>ద్బుధో ద్రాక్షాఫలప్రియః. | 99. సూర్యునకు చెరకును, చంద్రునకు పాలును, కుజునకు పాయసమును, బుధునకు ద్రాక్షపండ్లును ఇష్టము |
| 100. గురోః ప్రియా తు కదలీ<br>రసఖండం కవేః ప్రియం,<br>జంబూఫలైః శనిప్రీతీ<br>రాహు ర్నిత్యం మధుప్రియః,<br>కేతోః ప్రియం నారికేల<br>మేతాని వినివేదయేత్. | 100. గురువునకు అరటిపండ్లును, శుక్రునకు పటిక బెల్లమును, శనికి నేరేడుపండ్లును, రాహువునకు తేనెయు, కేతువునకు కొబ్బరికాయయు నిష్టమగుటచే నాయాగ్రహములకు వాని వానిని నైవేద్యము చేయవలెను. |
| 101. దశానాం దోషశాంత్యర్థం<br>పాఠ్యే రామాయణాంశకే,<br>తత్తద్గ్రహప్రీతికరం<br>పదార్థం వినివేదయేత్. | 101. దశలయందలి దోషపరిహారమునకై రామాయణ భాగపారాయణ మాచరించి ఆ యా గ్రహముల కిష్టమగు వస్తువును నైవేద్యము చేయవలెను. |
| 102. రామాయణాంశే పఠితే<br>భుక్తిదోషప్రశాంతయే,<br>దశానాథప్రియం త్వాదౌ<br>భుక్తినాథస్య చాన్తతః. | 102. గ్రహదశాభుక్తి దోషపరిహారమునకై రామాయణ భాగమును చదువునపుడు దశలకు ప్రభువుల కిష్టమగు వస్తువులను ముందు నైవేద్యము చేసి కడపట భుక్తినాథునకిష్టమగు |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| నివేదయే త్ప్రియం వస్తు యత్నా త్సంపాద్య సాదరం. | వస్తువును నైవేద్యమొనర్పవలెను. అట్టి ప్రియమగు వస్తువును ప్రయత్నించియైన సంపాదించి- ఆదరముతో నారగింపు చేయవలెను. |
| 103. అలభ్యం యది కించి త్స్యా దన్య ద్యత్క్రించి దుత్తమం, నివేదయే ద్భక్తియుత స్తదభావే నవం ఫలం. | 103. ఒకానొక సమయమున నా వస్తువు దొరకనిచో మరియొక మంచి వస్తువునైనను సమకూర్చి భక్తితో నైవేద్యము చేయవలెను. అదియు వీలు గానిచో క్రొత్తపండ్లను వేటినైన నైవేద్యము చేయవలెను. |
| 104. నారికేలం తథా ద్రాక్షా కదల్యాశ్చ ఫలోత్తమం, సర్వగ్రహాణాం ప్రీత్యై స్యా దలాభే తన్ని వేదయేత్. | 104. కొబ్బరికాయలు, ద్రాక్ష, అరటిపండ్లు, గ్రహములన్నింటికిని ప్రియమగు వస్తువులు గాన నిర్ణీతవస్తువులు దొరకనిచో వీటిని నివేదన చేయవలెను. |
| 105. ఏవం దశాభుక్తిజన్య దోషాణాం పరిశాంతయే, రామాయణాంశకాః ప్రోక్తాః శ్రవణా ద్భుక్తిముక్తిదాః. | 105. ఇట్లు మహాదశలవలనను భుక్తులవలనను కలిగిన దోషముల ఉపశాంతికై వినిన మాత్రముననే భుక్తిముక్తుల నొసగు రామాయణాంశములు చెప్పబడినవి. |
| ఇత్యుమాసంహితాయాం నవగ్రహదశాభుక్తి దోషపరిహార పారాయణక్రమః. | ఉమాసంహితలో నవగ్రహదశాభుక్తుల దోషపరిహార పారాయణక్రమము సమాప్తము. |



## అథ రామాయణపారాయణావసరేషు నివేదనక్రమః

సంస్కృత మూలము.

**ఉమాసంహితాయాం-**

1. రామాయణస్య ప్రారంభే
నారికేళత్రయం శుభం
స్వయం తు పతితం వృక్షా
త్సమ మాస్ఫోట్య చార్పయేత్.

2. శ్రీరామజననే ప్రాప్తే
రసఖండాం శ్చ శర్కరాం,
శుంఠీచూర్ణసితాయుక్తం
పయశ్చ వినివేదయేత్.

3. సుబాహుమారీచవధే
ఘనీభూతం తు దుగ్ధకం,
వాసితం చాగ్నిశిఖతః
ప్రస్థమాత్రం నివేదయేత్.

4. పాయసస్య ప్రదానే తు
పాయసం వినివేదయేత్,
వంధ్యా పుత్రం ప్రసూయేత
ధ్రువం తత్పాయసాశనాత్.

5. సీతావివాహే సంప్రాప్తే
భక్ష్యభోజ్యాదిపేయకం,
సర్వం ఘృతేన చాభ్యజ్య
దివ్యాన్నాని నివేదయేత్.

## రామాయణపారాయణావసరమున నైవేద్యము చేయవలసిన క్రమము.

ఆంధ్రానువాదము.

**ఉమాసంహితయందు ఇట్లు చెప్పబడినది.**

1. రామాయణప్రారంభమున, స్వయముగ పండి చెట్టునుండిరాలిన కొబ్బరికాయలను మూడింటిని సమముగా బ్రద్దలుకొట్టి నైవేద్యము చేయవలెను.

2. శ్రీరామజననము (బాల-18 సర్గ) సందర్భమున పటికబెల్లపు గడ్డలను, పంచదారను, శొంఠిచూర్ణము పంచదార కలిపిన పాలను నైవేద్యము చేయవలెను.

3. సుబాహు మారీచవధలను (బాల - 30 సర్గ, అరణ్య - 44 సర్గ) చదువు సమయమున ఒక తూమెడు చిక్కని పాలను గడ్డగట్టునట్లు కాచి కుంకుమపూవుతో పరిమళించునటుల కలిపి నైవేద్యము చేయవలెను.

4. అగ్నిహోత్రుడు పాయసమును దశరథునకిచ్చు (బా-16) సర్గను చదువునపుడు పాయసమును నివేదనము చేయవలెను. ఆపాయసమును తిని నచో గొడ్రాలైనను పుత్రులను కనును.

5. సీతాకల్యాణసందర్భమున (బాల-73 సర్గ) నేతితో తయారుచేసిన భక్ష్య భోజ్య పేయములను (కఠిన మృదు ద్రవాహారములను) నేతితో వండిన దివ్యాన్నములను నివేదించవలెను.

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 6. చతుర్వింశతివిప్రాం శ్చ<br>యథాలాభం సువాసినీః,<br>సీతారాఘవబుద్ధ్యైవ<br>భోజయే ద్భక్తిపూర్వకం. | 6. ఇరువదినలుగురు బ్రాహ్మణులకును యథాశక్తిగ ముత్తైదువులకును వారు సీతారాములను బుద్ధితో తదీయారాధనము గావించవలెను. |
| 7. సుమిత్రానుగ్రహే ప్రాప్తే<br>నవనీతం నవోద్ధృతం,<br>పృథ క్సితాం శర్కరాం చ<br>మోదకాం శ్చ నివేదయేత్. | 7. సుమిత్రానుగ్రహ సర్గ (అయో-40 సర్గ) చదువునపుడు నూతనమగు వెన్నను, తెల్లని పంచదారను, లడ్డులను నైవేద్యము చేయవలెను. |
| 8. నానావిధఫలం యావ<br>ల్లబ్ధం గుహసమాగమే,<br>చిత్రకూటం గతే రామే<br>దద్యాచ్చ లికుచోదనం. | 8. గుహసమాగమ (అయో-50 సర్గ) సందర్భమున అనేకవిధములైన పండ్లను, శ్రీరామ చంద్రుడు చిత్రకూటమునకు వెళ్ళు సర్గను (అయో-56 సర్గ) చదువునపుడు నిమ్మపండ్ల రసముపూసిన అన్నమును (నిమ్మపులిహోరను) నివేదన చేయవలెను. |
| 9. రామేణ చిత్రకూటే తు<br>భరతస్య సమాగమే,<br>మోదకాన్ శతసంఖ్యాకాన్<br>అర్పయేత్ ఘృతపాచితాన్. | 9. చిత్రకూటమున రామునితో భరతుడు కలియు సందర్భమున (అయో-99 సర్గ) నేతితోవండిన వంద లడ్డులను నివేదనము చేయవలెను. |
| 10. పాదుకారాజ్యలాభే తు<br>దాడిమీపనసాదికం,<br>కదల్యంతం ఫలం దద్యా<br>ద్భోజయేచ్చ ద్విజా న్దశ. | 10. పాదుకాపట్టాభిషేకసమయమున (అయో-112 సర్గ) దానిమ్మ, పనస, అరటిపండ్లను నివేదనముచేసి పదిమంది బ్రాహ్మణోత్తములకు సంతర్పణ చేయవలెను. |
| 11. అనసూయాసహాస్యాయాం<br>కుసుమం రక్తచందనం,<br>అర్పయిత్వా పాయసం చ<br>ఘృతమిశ్రం నివేదయేత్. | 11. సీత అనసూయవద్దకు వెళ్ళినపుడు (అయోధ్య-117 సర్గ) పుష్పములను ఎఱ్ఱని చందనమును అలంకరించి, నేతితో కలిపిన పాయసమును, నైవేద్యమొనరించి, ముత్తైదువులకు వస్త్ర |

| సంస్కృతమూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| సువాసినీ స్తోషయే చ్ఛ<br>వస్త్రగంధాదిదానతః. | గంధాదుల నొసగి వారికి సంతోషమును కలుగ జేయవలెను. |
| 12. ఖరస్య నిధనే ప్రాప్తే<br>శర్కరాసహితం శుభం,<br>నారికేలాన్న మభ్యాజ్య<br>ఘృతేన వినివేదయేత్. | 12. ఖరునివధ (అరణ్య-30) సర్గ చదువునపుడు పంచదారతోను, నేతితోను గూడిన కొబ్బరి యన్నమును నివేదన చేయవలెను. |
| 13. జటాయో ర్మోక్షదానే తు<br>మధు ద్రాక్షాఫలం దిశేత్. | 13. జటాయుమోక్షదానమున (అరణ్య-36 సర్గ) తేనెను, ద్రాక్షపండ్లను నివేదింపవలెను. |
| 14. శబర్యాశ్రమసంప్రాప్తౌ<br>కందాంశ్చ ఫలాని చ,<br>నివేదయే ద్యథాలాభం<br>విశేషా న్మాతులుంగకం. | 14. శబర్యాశ్రమమునకు రామచంద్రుడు వచ్చినపుడు (అరణ్య-74 సర్గ) ఆ సమయమున దొరకిన తినుట కుపయోగించు దుంపలను ఫలములను నివేదన చేయవలెను. తియ్యని మాదీఫలములను తప్పక నివేదన చేయవలెను. |
| 15. పంపాతీరే హనుమతా<br>రాఘవస్య సమాగమే,<br>మాషాపూపాన్ ఘృతే<br>పక్వాన్ చతుష్షష్టిం నివేదయేత్. | 15. శ్రీరామచంద్రుడు హనుమంతుని పంపాతీరమున కలసినప్పుడు (కిష్కింధ-3 సర్గ) నేతితో వండిన అరువదినాలుగు గారెలను నైవేద్యము చేయవలెను. |
| 16. ప్రాప్తే వాలివధే పుణ్యే<br>వాసితం శర్కరోదకం,<br>భక్ష్యాన్ ముద్గకృతాన్వాపి<br>దేవాయ వినివేదయేత్. | 16. వాలివధసమయమున (కిష్కింధ-16-22 సర్గ) సుగంధద్రవ్యములు చేర్చిన పంచదారపానకమునుగాని, పెసరపప్పుతో చేసిన పిండివంటలనుగాని, (వడపప్పు, శుండలు, పెసరసున్ని ఉండలు మొ॥) నివేదన చేయవలెను. |

సంస్కృత మూలము

17. రాజ్యాభిషిక్తే సుగ్రీవే
చణకాం స్తైలపాచితాన్,
నివేదయే ద్విశేషేణ
రసాలఫల మర్పయేత్.

18. హనూమతః సముద్రస్య
తరణే సముపస్థితే,
దధ్యన్నం వ్యంజనయుతం
నవనీతం చ దాపయేత్.

19. హనూమత స్తు జానక్యా
దర్శనే సోపదంశకం,
అన్న మామ్లరసోపేతం
తాంబూలం చ నివేదయేత్.

20. రామాంగులీయదానే తు
గుడాన్నం ముద్గసంయుతం,
నివేదయేత్ ఘృతేనాక్తం
భక్ష్యాణి వివిధాని చ.

21. చూడామణిప్రదానే తు
రాఘవాయ హనూమతా,
గోక్షీరం ముద్గఖండాఢ్యం
పక్వం తు వినివేదయేత్.

22. విభీషణాయ రామేణా
ఽభయే దత్తేఽమ్బుధే స్తటే,
నారికేలస్య శుష్కస్య
క్షోదం శర్కరయాయుతం.
దద్యా ద్విభీషణస్యాభి -
షేకే తు ఘృతశష్కులీః.

ఆంధ్రానువాదము

17. సుగ్రీవుని రాజ్యాభిషేకసమయమున (కిష్కిం-26 సర్గ) నూనెతో వేయించిన సెనగగుండలను, ముఖ్యముగా మామిడిపండ్లను (రసాలు) నివేదన చేయవలెను.

18. హనుమంతుని సముద్రలంఘన సమయమున (సుందర-1 సర్గ) ఊరుగాయలతో కూడిన దధ్యోదనమును, వెన్నను నైవేద్యము చేయవలెను.

19. హనుమంతుడు జానకిని చూచినప్పుడు (సుం-15 సర్గ) ఊరుగాయతోకూడిన పులిహోరను, తాంబూలమును నివేదన చేయవలెను.

20. రాముని ఉంగరమును సీతకిచ్చు సందర్భమున (సుందర-36 సర్గ) పెసరపప్పుతో కలిసిన శర్కర పొంగలిని, నేతితో వండిన పలురకముల పిండివంటలను నివేదన చేయవలెను.

21. హనుమంతుడు రామునకు చూడామణి నొసంగు (సుం-66 సర్గ) సందర్భమున పెసగపప్పు పటికబెల్లం కలిసిన ఆవుపాలపాయసమును నివేదన చేయవలెను.

22. సముద్రతీరమున విభీషణునకు అభయమిచ్చు సందర్భమున (యుద్ధ - 16 సర్గ) ఎండు కొబ్బరికోరును పంచదారయు కలిపి నివేదింప వలెను. విభీషణ పట్టాభిషేకసమయమున (యుద్ధ 16 సర్గ) నేతితో వండిన జిలేబిని నివేదన చేయవలెను.

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| 23. నాగాస్త్ర మోక్షణే క్షీరం సద్యోదుగ్ధం నివేదయేత్. | 23. నాగాస్త్ర విమోచనఘట్టమున (యుద్ధ - 50 సర్గ) గుమ్మపాలను (అప్పుడు పిండిన ఆవు పాలను) నైవేద్యము చేయవలెను |
| 24. బ్రహ్మాస్త్రబంధనిర్మోక్షే దుగ్ధే పక్వాన్ సువాసితే, యవగోధూమసక్తూంశ్చ ఫలాని చ నివేదయేత్. | 24. బ్రహ్మాస్త్రమును విడిపించుకొను సందర్భమున (యుద్ధ-74 సర్గ) పరిమళద్రవ్యములు చేర్చిన పాలతో వండిన యవ-గోధుమ పేలపిండులను, పండ్లను నివేదన చేయవలెను. |
| 25. కుంభకర్ణస్య నిధనే నారికేళాంబు నిర్మలం, నివేదయే ద్రాఘవాయ లాభే జంబూఫలాని చ. | 25. కుంభకర్ణుని వధసందర్భమున(యుద్ధ-67సర్గ) నిర్మలమగు కొబ్బరినీళ్ళను, దొరకినచో నేరేడుపండ్లను శ్రీరామచంద్రునకు నైవేద్యము చేయవలెను. |
| 26. మేఘనాదస్య నిధనే స్నిగ్ధం చైవ తిలోదనం. సలక్ష్మణాయ రామాయ దద్యా ద్దధి చ మండయుక్. | 26. ఇంద్రజిద్వధయందు (యుద్ధ - 91 సర్గ) నూనెతోకలిపిన (తిలహోర) వేయించిన నువ్వు పప్పుగుండ కలిపిన అన్నమును (ఎళ్ళోర) మీగడతోగూడిన పెరుగును లక్ష్మణసమేతు డగు శ్రీరామునకు నైవేద్యము చేయవలెను. |
| 27. నాశే మూలబలస్యాప్తే చిత్రాన్నాని నివేదయేత్. | 27. రావణుని మూలబల మంతయు నశింపగా (యుద్ధ - 94 సర్గ) చిత్రవిచిత్రములుగ వండిన అన్నములను (పులిహోర మొదలగునవి) నైవేద్యము చేయవలెను. |
| 28. ఆదిత్యహృదయే పుణ్యే గుడాన్నం ఘృతసంయుతం, కోమలా న్నారికేళాం శ్చ సేతుదండా న్నివేదయేత్. | 28. ఆదిత్యహృదయము చదువునపుడు (యుద్ధ - 107 సర్గ) నేతితోగూడిన శర్కరపొంగలి, లేతకొబ్బరిబొండములను, చెరకుగడలను నైవేద్యము చేయవలెను. |
| 29. రావణస్య వధే సద్యః పక్వాన్ వాసితసర్పిషి, | 29. రావణవధయందు (యుద్ధ - 111 సర్గ) పరిమళించునేతిలో అప్పటికప్పుడువండబడినవై |

| సంస్కృత మూలము | ఆంధ్రానువాదము |
|---|---|
| పంచాశదవరాన్ దద్యా<br>ద్గుడాపూపాన్ సమోదకాన్. | ఏబదికి తక్కువగాని అప్పములను, లడ్డులను నైవేద్యము చేయవలెను. |
| 30. ప్రవిశ్యాగ్నిం యదా సీతా<br>సముత్థాయ గతా పతిం.<br>నివేదయేత్తు క్షీరాన్నం<br>సమం హైయంగవీనతః. | 30. సీత అగ్నిని ప్రవేశించి శ్రీరాముని పొందిన సర్గను (యుద్ధ - 121 సర్గ) చదువునపుడు అప్పటికప్పుడు వెన్న కాచితీసిన నేతితో క్షీరాన్నమును నైవేద్యము చేయవలెను. |
| 31. రాజ్యాభిషిక్తే శ్రీరామే<br>సర్వం పూర్వోదితం శుభం,<br>నివేదయేత్పూజయిత్వా<br>వస్త్రమాల్యాదిభిః పృథక్.<br>భోజయేచ్చ శతం విప్రా<br>న్నారీశ్చాపి సభర్తృకాః. | 31. శ్రీరాముని రాజ్యాభిషేక సమయమున పూర్వము చెప్పిన మంచి క్షీరాన్నములను, భక్ష్యాదులను, ఫలములను నైవేద్యము చేసి నూరుమంది ముత్తైదువులను వారి భర్తలతో గూడ వస్త్రమాల్యాదులచే వేరువేరుగ పూజించి భుజింపజేయవలెను. |
| 32. తత్తద్ఘట్టేషు చోక్తేషు<br>తత్తద్ద్రవ్యే తు దుర్లభే.<br>నివేదయేద్యథాలాభం<br>సర్వాలాభే దిశేత్ఫలం. | 32. ఆయాఘట్టములయందు చెప్పిన ఆయా వస్తువులు కొన్ని దొరకనిచో దొరకినంతవరకే నైవేద్యము చేయవలెను. |
| 33. ఏవం కృతే రఘుపతిః<br>సర్వథైవ ప్రసీదతి,<br>దదాతి కాంక్షితానర్థా<br>నన్తే చ పరమాం గతిం. | 33. ఇట్లు చేసినచో శ్రీరామచంద్రు డన్నివిధముల సంతసించి కోరిన కోరిక లన్నియు నిచ్చును. దేహావసానమున మోక్షసామ్రాజ్యమును పొందునట్లు చేయును. |
| ఇత్యుమాసంహితాయాం శ్రీరామాయణ<br>పారాయణావసరేషు నివేదనక్రమః. | ఇది ఉమాసంహితలోని శ్రీరామాయణ పారాయణావసరమున చేయవలసిన నివేదనక్రమము. |

## నవగ్రహ దంశాతర్దశా దోషపరిహారార్థమై పారాయణ మొనర్చవలసిన ఘట్టములు మున్నగునవి.

| నెం. | దశావిశేషములు | కాండ | సర్గ | సమయము నైవేద్యము మున్నగునవి |
|---|---|---|---|---|
| 1. | సూర్యమహాదశ | బాల | 43 | ఉదయమున ఒకపర్యాయము, చెరకు |
| | సూర్యాంతర్దశ | ,, | 45 | ,, ప్రారంభమునందును సమాప్తియందును చెరకు |
| | చంద్రాంతర్దశ | అరణ్య | 18 | దినమున మూడు వేళలందును; ప్రారంభమున చెరకు అంతమున పాలు. |
| | కుజాంతరం | అయోధ్య | 1,2 | ప్రారంభమున చెరకు సమాప్తిలో శర్కరపొంగలి |
| | రాహ్వంతరం | బాల | 36 | ,, ,, ,, తేనె |
| | గుర్వంతరం | అయోధ్య | 17 | ,, ,, ,, అరటిపండ్లు |
| | శన్యంతరం | యుద్ధ | 91 | ,, ,, ,, నేరేడుపండ్లు |
| | బుధాంతరం | బాల | 75 | ,, ,, ,, ద్రాక్షపండ్లు |
| | కేత్వంతరం | అరణ్య | 68 | ,, ,, ,, కొబ్బరికాయ |
| | శుక్రాంతరం | అయోధ్య | 118 | ,, ,, ,, పటికబెల్లం |
| 2. | చంద్రమహాదశ | సుందర | 5 | శుక్లపక్షమున సూర్యాస్తమయము 5 ఘడియల లోపుగ చంద్రుని పూజింపవలెను. పాలు |
| | చంద్రాంతరం | ఉత్తర | 53,54 | ప్రారంభమున పాలు; అంతమునను పాలు |
| | కుజాంతరం | బాల | 19-22 | ,, ,, ,, చక్కెరపొంగలి |
| | రాహు | ,, | 49 | ,, ,, ,, తేనె |
| | గురు | ,, | 1 | ,, ,, ,, అరటిపండ్లు |
| | శని | అరణ్య | 30 | ,, ,, ,, నేరేడుపండ్లు |
| | బుధ | అయోధ్య | 26-30 | ,, ,, ,, ద్రాక్షపండ్లు |
| | కేతు | అరణ్య | 6 | ,, ,, ,, కొబ్బరికాయ |
| | శుక్ర | యుద్ధ | 121 | ,, ,, ,, పటికబెల్లం |
| | సూర్య | కిష్కిం | 3 | ,, ,, ,, చెరకు |
| 3. | కుజమహాదశ | బాల | 36,37 | ప్రారంభమున చక్కెరపొంగలి(సుబ్రహ్మణ్యపూజ) అంతమున చక్కెరపొంగలి |
| | కుజాంతరం | ఉత్తర | 76 | ,, ,, ,, ,, |
| | రాహు | యుద్ధ | 59 | ,, ,, ,, తేనె |

| నెం. | దశావిశేషములు | కాండ | సర్గ | సమయము చేయవలసిన నైవేద్యములు మున్నగునవి |
|---|---|---|---|---|
| | గురు | సుందర | 51 | ,, ,, ,, అరటిపండ్లు |
| | శని | అరణ్య | 70 | ,, ,, ,, నేరేడుపండ్లు |
| | బుధ | బాల | 16 | ,, ,, ,, ద్రాక్షపండ్లు |
| | కేతు | యుద్ధ | 116 | ,, ,, ,, కొబ్బరికాయ |
| | శుక్ర | సుందర | 53 | ,, ,, ,, పటికబెల్లం |
| | సూర్య | బాల | 23 | ,, ,, ,, చెరకు |
| | చంద్ర | ,, | 17 | ,, ,, ,, పాలు |
| 4. | **రాహుమహాదశ** | యుద్ధ | 75 | ప్రారంభమున తేనె, అంతమున (సూర్యపూజ) అప్పము, తేనె |
| | రాహ్వాంతరం | ,, | 50 | ,, ,, ,, తేనె |
| | గురు | కిష్కింధ | 26 | ,, ,, ,, అరటిపండ్లు |
| | శని | సుందర | 47 | ,, ,, ,, నేరేడుపండ్లు |
| | బుధ | యుద్ధ | 120 | ,, ,, ,, ద్రాక్షపండ్లు |
| | కేతు | బాల | 76 | ,, ,, ,, కొబ్బరికాయ |
| | శుక్ర | సుందర | 65 | ,, ,, ,, పటికబెల్లం |
| | సూర్య | బాల | 70 | ,, ,, ,, చెరకు |
| | చంద్ర | ఉత్తర | 31 | ,, ,, ,, పాలు |
| | కుజ | ,, | 16 | ,, ,, ,, చక్కెరపొంగలి |
| 5. | **గురుమహాదశ** | సుందర | 1 | ప్రారంభమున అరటిపండ్లు, అంతమున హనుమంతునికి ప్రియమైన చక్కెర. |
| | గుర్వాంతరం | అరణ్య | 5 | ,, ,, ,, అరటిపండ్లు |
| | శని | అయోధ్య | 16 | ,, ,, ,, నేరేడుపండ్లు |
| | బుధ | బాల | 15, 16 | ,, ,, ,, ద్రాక్షపండ్లు |
| | కేతు | సుందర | 61, 62 | ,, ,, ,, కొబ్బరికాయ |
| | శుక్ర | బాల | 77 | ,, ,, ,, పటికబెల్లం |
| | సూర్య | కిష్కింధ | 40 | ,, ,, ,, చెరకు |
| | చంద్ర | ,, | 60-63 | ,, ,, ,, పాలు |
| | కుజ | బాల | 5 | ,, ,, ,, చక్కెరపొంగలి |
| | రాహు | అరణ్య | 74 | ,, ,, ,, తేనె |

| నెం. | దశావిశేషములు | కాండ | సర్గ | సమయము, చేయవలసిన నైవేద్యములు మున్నగునవి |
|---|---|---|---|---|
| 6. | **శనిమహాదశ** | బాల | 30 | ప్రారంభమున-అంతమున (మృత్యుంజయపూజ) తిలాన్నం |
| | శన్యంతరం | సుందర | 48 | ,, ,, ,, నేరేడుపండ్లు |
| | బుధ | ,, | 54 | ,, ,, ,, ద్రాక్షపండ్లు |
| | కేతు | కిష్కింధ | 6 | ,, ,, ,, కొబ్బరికాయ |
| | శుక్ర | సుందర | 38 | ,, ,, ,, పటికబెల్లం |
| | సూర్య | కిష్కింధ | 66 | ,, ,, ,, చెరకు |
| | చంద్ర | బాల | 26 | ,, ,, ,, పాలు |
| | కుజ | కిష్కింధ | 50-53 | ,, ,, ,, చక్కెరపొంగలి |
| | రాహు | అరణ్య | 44 | ,, ,, ,, తేనె |
| | గురు | యుద్ధ | 1 | ,, ,, ,, అరటిపండ్లు |
| 7. | **బుధమహాదశ** | సుందర | 35 | ప్రారంభమున ద్రాక్ష అంతమున ముద్గాన్నము (పొంగలి) |
| | బుధాంతరం | బాల | 29 | ,, ,, ,, ద్రాక్షపండ్లు ఉదయమున నాల్గుపర్యాయములు పారాయణము |
| | కేతు | సుందర | 14 | ప్రారంభమున ద్రాక్షపండ్లు అంతమున కొబ్బరికాయ |
| | శుక్ర | అరణ్య | 9, 10 | ,, ,, ,, పటికబెల్లం |
| | సూర్య | యుద్ధ | 94 | ,, ,, ,, చెరకు |
| | చంద్ర | అయోధ్య | 117 | ,, ,, ,, పాలు |
| | కుజ | సుందర | 29 | ,, ,, ,, చక్కెరపొంగ |
| | రాహు | యుద్ధ | 28 | ,, ,, ,, తేనె |
| | గురు | అయోధ్య | 74 | ,, ,, ,, అరటిపండ్లు |
| | శని | యుద్ధ | 111 | ,, ,, ,, నేరేడుపండ్లు |
| 8. | **కేతుమహాదశ** | అయోధ్య | 50 | ప్రారంభమున కొబ్బరికాయ అంతమున నేతితోచేసిన మినుప గారెలు |
| | కేత్వంతరం | ,, | 22 | ,, ,, ,, కొబ్బరికాయ |
| | శుక్ర | సుందర | 65 | ,, ,, ,, పటికబెల్లం |
| | సూర్య | అయోధ్య | 110 | ,, ,, ,, చెరకు |
| | చంద్ర | బాల | 22 | ,, ,, ,, పాలు |
| | కుజ | అయోధ్య | 100 | ,, ,, ,, చక్కెరపొంగలి |

| నెం. | దశావిశేషములు | కాండ | సర్గ | సమయము, నైవేద్యము మున్నగునవి |
|---|---|---|---|---|
| | రాహు | యుద్ధ | 67 | ,, ,, ,, తేనె |
| | గురు | ,, | 116 | ,, ,, ,, అరటిపండ్లు |
| | శని | ,, | 58 | ,, ,, ,, నేరేడుపండ్లు |
| | | | | ప్రతిదినము మూడు వేళలయందును పారాయణము |
| | బుధ | ,, | 129 | ప్రారంభమున కొబ్బరికాయ అంతమున ద్రాక్షపండ్లు |
| 9. | **శుక్రమహాదశ** | బాల | 73 | ప్రారంభమున పటికబెల్లము అంతమున పటికబెల్లము సుమంగళులకు తాంబూలము, దక్షిణ |
| | | | | ప్రతిదినము మూడు వేళలయందును పారాయణము. |
| | శుక్రాంతరం | సుందర | 36 | ప్రారంభమున పటికబెల్లం, అంతమున పటికబెల్లము. |
| ★ | స్త్రీలకుశుక్రాంతరం | ,, | 33 | ,, ,, ,, ,, |
| | సూర్య | బాల | 67 | ,, ,, ,, చెరకు |
| | చంద్ర | ఉత్తర | 87-90 | ,, ,, ,, పాలు,చంద్రోదయకాలమున చంద్రమండలమునుధ్యానించుచు చదువవలెను |
| | కుజ | అయోధ్య | 115 | ప్రారంభమునపటికబెల్లము అంతమునచక్కెరపొంగలి |
| | రాహు | అరణ్య | 4 | ,, ,, ,, తేనె |
| | గురు | బాల | 14 | ,, ,, ,, అరటిపండ్లు |
| | శని | యుద్ధ | 102 | ,, ,, ,, నేరేడుపండ్లు |
| | బుధ | ఉత్తర | 6-8 | ,, ,, ,, ద్రాక్షపండ్లు |
| | కేతు | యుద్ధ | 19-22 | ,, ,, ,, కొబ్బరికాయ |



## పూర్వము కుశలవులు శ్రీరామసన్నిధియందు అశ్వమేధశాలలో 32 రోజులు చేసిన శ్రీరామాయణగానమున, వారు ఒక్కొక్కరోజున గానముచేసిన కాండ-సర్గ-శ్లోక వివరము

| రోజులు | కాండలు | సర్గలు | శ్లోకములు | మొత్తము శ్లోక సంఖ్య |
|---|---|---|---|---|
| 1 | బాలకాండ | 1-21 | 1— 755 | 755 |
| 2 | ,, | 22-44 | 756— 1416 | 661 |
| 3 | ,, | 45-65 | 1417— 1997 | 581 |
| 4 | బాలకాండ<br>అయోధ్యాకాండ | 66-77<br>1- 9 | 1998— 2751 | 754 |
| 5 | ,, | 10-30 | 2752— 3666 | 915 |
| 6 | ,, | 31-51 | 3667— 4381 | 715 |
| 7 | ,, | 52-71 | 4382— 5169 | 788 |
| 8 | ,, | 72-97 | 5170— 5983 | 814 |
| 9 | ,, | 98-119 | 5984— 6712 | 729 |
| 10 | అరణ్యకాండ | 1-21 | 6713— 7433 | 721 |
| 11 | ,, | 22-42 | 7434— 8104 | 671 |
| 12 | ,, | 43-63 | 8105— 8816 | 712 |
| 13 | అరణ్యకాండ<br>కిష్కింధాకాండ | 64-75<br>1- 8 | 8817— 9637 | 821 |
| 14 | ,, | 9-29 | 9638—10513 | 876 |
| 15 | ,, | 30-50 | 10514—11330 | 817 |
| 16 | కిష్కింధాకాండ<br>సుందరకాండ | 51-67<br>1- 3 | 11331—12128 | 798 |
| 17 | ,, | 4-23 | 12129—12901 | 773 |
| 18 | ,, | 24-47 | 12902—13833 | 932 |
| 19 | ,, | 48-68 | 13834—14675 | 843 |
| 20 | యుద్ధకాండ | 1-24 | 14676—15564 | 889 |
| 21 | ,, | 25-50 | 15565—16665 | 1101 |
| 22 | ,, | 51-70 | 16666—17916 | 1251 |
| 23 | ,, | 71-90 | 17917—18894 | 978 |
| 24 | ,, | 91-111 | 18895—19819 | 925 |
| 25 | ,, | 112-131 | 19820—20724 | 905 |
| 26 | ఉత్తరకాండ | 1-20 | 20725—21491 | 767 |
| 27 | ,, | 21-40 | 21492—22395 | 904 |
| 28 | ,, | 41-60 | 22396—22854 | 459 |
| 29 | ,, | 61-80 | 22855—23334 | 480 |
| 30 | ,, | 81-98 | 23335—23739 | 445 |
| 31 | ,, | 99-105 | 23740—23872 | 133 |
| 32 | ,, | 106-116 | 23873—24000 | 128 |
|  | 7 | 647 |  | 24000 |

# శ్రీరామాయణ ఘట్టములు - నైవేద్యములు



| | |
|---|---|
| 1. శ్రీరామాయణ ప్రారంభము | పండి రాలిన ముదురు కొబ్బరికాయలు 3 |
| 2. శ్రీరామ జననము | పటికబెల్లము, పంచదార, శొంఠిచూర్ణము చక్కెరకలిపిన పాలు |
| 3. సుబాహు మారీచ వధలు | తూమెడుపాలు కుంకుమపూవుచేర్చి చిక్కగా కాచినవి, పాయసము |
| 4. పాయసప్రదాన సందర్భము | పాయసము |
| 5. సీతాకల్యాణము | నేతితో వండిన వివిధ భక్ష్యభోజ్యపేయములు, దివ్యాన్నము 24 బ్రాహ్మణులకు తదీయారాధన. |
| 6. సుమిత్రానుగ్రహము | అప్పుడు తీసిన వెన్న, పంచదార, లడ్డు |
| 7. గుహ సమాగమము | వివిధ ఫలములు |
| 8. చిత్రకూట ప్రాప్తి | నిమ్మపులుసు సాదము (నిమ్మకాయ చిత్రాన్నము) |
| 9. భరత సమాగమము | నేతితో చేసిన లడ్డు నూరు |
| 10. పాదుకా పట్టాభిషేకము | దానిమ్మ, పనస, అరటి మొదలగు పండ్లు తదీయారాధన 10 బ్రాహ్మణులకు తదీయారాధన |
| 11. అనసూయతో సీత కలియునప్పుడు | ఎఱ్ఱచందనముతో నర్చించి, నేయి కలిపిన పాయసము. సువాసినులకు వస్త్రగంధాదు లీయవలెను |
| 12 ఖర వధ | కొబ్బరిముక్కలు వేసిన చక్కెరపొంగలి నేయికలిపి అరగింపు. |
| 13. జటాయు మోక్షము | తేనె, ద్రాక్షపండ్లు |
| 14. శబరీ సమాగమము | గడ్డలు, పండ్లు. ముఖ్యముగా తియ్యమామిడిఫలము. |
| 15. పంపాతీరమున హనుమద్రామ సమాగమము | నేతితోవండిన మినుపగారెలు 64 |
| 16. వాలి వధ. | సుగంధ ద్రవ్యములు చేర్చిన పంచదారపానకము, పెసరపప్పుతో చేసిన పిండివంటలు |
| 17. సుగ్రీవ పట్టాభిషేకము | నూనెతో తాలించిన శెనగగుండలు, ముఖ్యముగా మామిడిపండ్లు (రసాలు) |
| 18. హనుమంతుని సముద్రలంఘనము | ఊరుగాయతో పెరుగన్నము, వెన్న |
| 19 హనుమ సీతను దర్శించుట | ఊరుగాయతో పులిహోర, తాంబూలము |
| 20. అంగుళీయ ప్రదానము | నేయిచేర్చిన చక్కెరపొంగలి, పలు పిండివంటలు |
| 21 చూడామణిని శ్రీరామున కిచ్చుట | పెసరపప్పు పటికబెల్లముతో పిండివంటలు, ఆవుపాల పాయసము |
| 22. విభీషణాభయప్రదానము | ఎండుకొబ్బరి తురిమి పంచదార కల్పిన కజ్జాయము |
| 23. విభీషణ పట్టాభిషేకము | నేతి జిలేబీ (లేక చక్కిలములు) |
| 24. నాగాస్త్ర బంధమోక్షణము | గుమ్మపాలు (అప్పుడు పిండిన పచ్చిపాలు) |
| 25. బ్రహ్మాస్త్ర బంధమోక్షణము | సుగంధయుతమగు పాలతో యవ-గోధుమల పేలపిండి, పండ్లు |
| 26. కుంభకర్ణవధ | లేతకొబ్బరికాయనీరు. (ఎళనీరు) నేరేడుపండ్లు) |
| 27. ఇంద్రజిద్వధ | తిలహోర (ఎళ్ళోర) మీగడపెరుగు |
| 28. మూల బలధ్వంసము | చిత్రాన్నములు |
| 29. ఆదిత్య హృదయోపదేశము | చక్కెరపొంగలి. లేతకొబ్బరికాయలు, చెరకుముక్కలు |
| 30. రావణవధ | నేతి అప్పములు 50కి తగ్గక |
| 31. అగ్నినుండి సీత వెలువడుట | నేయిచేర్చిన పాయసము |
| 32. శ్రీరామ పట్టాభిషేకము | పూర్వము చెప్పినవన్నియు, వస్త్రమాల్యాదులు బ్రాహ్మణులు 100 సువాసినులు 100 కు తదీయారాధన. |

గమనిక :— ఆయా సమయమున చెప్పిన వస్తువులు దొరకనిచో దొరికినవియు, ఏవియు దొరకనిచో పండ్లను నివేదింపవలెను.



## పునర్వసు పారాయణ పద్ధతి

పునర్వసు పారాయణమును 27 రోజులలో చేయవలెను.

1. ఒక్కొక్క దినమునకు 20 సర్గలు చొప్పున 26 దినములు పారాయణమొనర్చి 27 వ దినమున మిగిలియున్న 17 సర్గలును పారాయణ మొనర్పవలయును.
(అనగా పునర్వసు దినమున ప్రారంభించి పునర్వసు దినమున ముగించవలెను.)

2. పునర్వసు దినమున ప్రారంభించి పునర్వసు దినమున ముగించవలెను. గాన ఇందు మధ్యయందు వచ్చు రెండు ప్రథమతిథుల (శుక్ల బహుళ పాడ్యముల) యందు పారాయణ మొనర్పకుండగ పూజను మాత్రము చేయవలెను ఈవిధముగ పారాయణమొనర్చు విధానము ౨౯వ పుటలో చూడనగును. కామ్యపారాయణపద్ధతిలో ఉత్తరకాండమును పారాయణమొనర్చు సాంప్రదాయము లేదు.

శ్లో॥ శ్రీరా దార స్స్రాత్రా కైకా ధీపా ధేయ: పత్రా లేఖ: ।
న్పొరా ఖారా మోరా తిశాౢ ధార్యో నామ్రో హారా లాప:. ౧.
పుతా హేయా క్షేప: శ్రీక శ్చాయా సుఖ్య: పాయా త్ప్రియ:,
స్థోయా హార్య చ్ఛాయో హ్యేవం నక్షత్రాది ష్వేక: కార్య:. ౨.
బాలారణ్యానీ కిష్కింధా కాండా స్త్రిభి స్త్రిభి రహోభి:,
షడ్భిరయోధ్యాకాండ శ్చతురష్టాభి: సుందర: సమర:. ౩.

ఇందు మొదటి రెండు శ్లోకములయందలి 54 అక్షరములయందు రెండేసి యక్షరములచేత చెప్పబడిన సర్గలను క్రమముగా ఒక్కొక్క రోజున పారాయణ మొనర్పవలెను. అందు బాలకాండము మొదలు ఒక్కొక్క కాండమునకు క్రమముగా 3, 6, 3, 3, 4, 8. (27) దినములు పట్టును.

ఈ విధానమెటులనిన :-

| | కాండము | మొత్తము రోజులు | ఒక్కొక్క రోజున పారాయణ మొనర్పవలసిన సర్గలు |
|---|---|---|---|
| 1. | బాలకాండ | 3 | 22+28+27 = 77 |
| 2. | అయోధ్యాకాండ | 6 | 15+19+19+21+23+22 = 119 |
| 3. | అరణ్యకాండ | 3 | 24+25+26 = 75 |
| 4. | కిష్కింధాకాండ | 3 | 19+20+28 = 67 |
| 5. | సుందరకాండ | 4 | 13+21+18+16 = 68 |
| 6. | యుద్ధకాండ | 8 | 12+17+27+11+12+17+18+17 = 131 |
| | | 27 | 537 |

# శ్రీమద్వాల్మీకి రామాయణస్య అంగన్యాసాది మన్త్రాః

అస్య శ్రీమద్వాల్మీకి రామాయణ మహామంత్రస్య నారదో భగవా నృషి:, అనుష్టుప్ ఛంద:, శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రో దేవతా, ఓం బీజం, ధర్మాత్మా సత్య సంధశ్చ రామో దాశరథి ర్యది ఇతి శక్తి:, పౌరుషే చాప్రతిద్వంద్వ: శరైనం జహి రావణిమ్ ఇతి కీలకం, శ్రీసీతారామచంద్రప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగ:.

ధర్మాత్మా - అంగుష్ఠాభ్యాం నమ:,
సత్యసంధశ్చ - తర్జనీభ్యాం నమ:,
రామ: - మధ్యమాభ్యాం నమ:,
దాశరథి ర్యది - అనామికాభ్యాం నమ:,
పౌరుషే చాప్రతిద్వంద్వ: - కనిష్ఠికాభ్యాం నమ:,
శరైనం జహి రావణిం - కరతలకరపృష్ఠాభ్యాం నమ:,
ధర్మాత్మా - హృదయాయ నమ:,
సత్యసంధశ్చ - శిరసే స్వాహా,
రామ: - శిఖాయై వషట్,
దాశరథి ర్యది - కవచాయ హుం,
పౌరుషే చాప్రతిద్వంద్వ: - నేత్రాయ వౌషట్,
శరైనం జహి రావణిమ్ - అస్త్రాయ ఫట్,
భూర్భువ స్సువరోమితి - దిగ్బంధ:.

ధ్యానం : సహస్రాదిత్యసంకాశం సర్వశత్రునిబర్హణమ్,
రామశక్తిమయం ధ్యాయే దమోఘం రామసాయకమ్.

అథ పంచోపచారా: లం పృథివ్యాత్మనే గన్ధాన్ కల్పయామి,
హం ఆకాశాత్మనే పుష్పాణి సమర్పయామి,
యం వాయ్వాత్మనే ధూప మాఘ్రాపయామి,
రం వహ్న్యాత్మనే దీపం దర్శయామి,
వం అమృతాత్మనే అమృతోపహారం నివేదయామి,
సం సర్వాత్మనే సర్వోపచారాన్ సమర్పయామి.

అథ మూలమంత్ర: : ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషే చాఽప్రతిద్వంద్వ: శరైనం జహి రావణిమ్. (ఇతి యథాశక్తి జప:)

అనంతరమ్ : సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ.
ఇత్యేతం మంత్రం యథాశక్తి జపేత్. ఏవ ముత్తరన్యాస:.

— శ్రీ: —

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

సంస్కృత మూలమ్

శ్రీమత్పారాశర్యోపపురాణోక్త

శ్రీమద్రామాయణ మాహాత్మ్యమ్

# ప్రథమోఽధ్యాయః

ఆంధ్రానువాదము.

శ్రీమత్పారాశర్యోపపురాణోక్తమగు

శ్రీమద్రామాయణ మాహాత్మ్యము

# మొదటి అధ్యాయము

## శ్రీరామాయణస్య సర్వోత్తమత్వం.

**ఋషయః ఊచుః -**

## శ్రీరామాయణమునకు సర్వోత్తమత్వము.

**ఋషులు పలికిరి -**

1. శ్రుతా స్త్వత్తోఽఖిలా ధర్మా
శ్శ్రుతిస్మృతి విబోధితాః,
అత్ర న స్సంశయః కశ్చిత్
త త్త్వం వక్తు మిహార్హసి.

1. ఓ పరాశరమహర్షీ! శ్రుతిస్మృతులయందు చక్కగా ప్రతిపాదింపబడిన సమస్త ధర్మములను నీవలన వింటిమి అందు మాకొక సందియం బుదయించినది. దాని నిర్ణయమును మా కుపదేశింపుము.

2. తాపత్రయాతురై ర్వర్ణైః
సర్వై స్సంసారసాగరాత్,
తరీతుకామై రవనౌ
కిం కార్యం త ద్బ్రవీహి నః.

2. భూలోకమున తాపత్రయములచే బాధను చెందుచున్న అన్ని వర్ణములవారును సంసార సాగరమునుండి తరింపవలెనన్నచో వారేమి చేయవలెనో మాకుపదేశింపుము.

3. యస్మి న్కృతే కృతం సర్వం
అకృతే చాఽకృతం భవేత్,
కృతేన యేన భగవాన్
ప్రీణాతి పురుషోత్తమః.

3. ఏపనిని చేసిన నన్నిపనులు చేసినట్లే యగునో దేనిని చేయకున్న నన్నిపనులు చేసినను చేయనియట్లే నిష్ప్రయోజనము లగునో, యే పనిని చేయుటవలన పురుషోత్తముడగు శ్రీమన్నారాయణుడు సంతసించునో

4. యేనైవ ప్రాప్యతే మర్త్యైః
పురుషార్థచతుష్టయమ్,
కృతార్థా స్స్యామ యేనైవ
కృపయా త ద్వద ప్రభో.

4. మనుష్యులు దేనివలన చతుర్విధ పురుషార్థముల బడయుదురో, దేనివలన కృతార్థుల మగుదుమో దానిని దయతో మాకెఱింగింపుము.

# శ్రీరామాయణ మాహాత్మ్యమ్

## సంస్కృత మూలమ్

### శ్రీ పరాశర ఉవాచ -

5. హన్త! వోఽహం ప్రవక్ష్యామి
యత్పృష్టోఽహం మహాత్మభిః,
శ్రూయతా మవధానేన
రహస్య మిద ముత్తమమ్.

6. ఆధ్యాత్మికాదితాపై ర్యే
సంతప్తా భువి మానవాః,
తేషా ముజ్జీవనార్థాయ
కించి దస్త్యౌషధం మహత్.

7. య ద్వాల్మీకి ముఖామ్భోజ
మకరన్దఝరాయతే,
సర్వే యదుపజీవన్తి
సుధియః కావ్యకల్పకాః.

8. నిష్పద్యన్తే శ్రుతే యస్మిన్
పురుషార్థచతుష్టయమ్,
యత్రాఽనుర్ణ్యతేఽభీక్ష్ణం
రామో నారాయణ స్స్వయమ్.

9. శ్రవణా దేవ సర్వేషాం
య న్మనః ప్రసభం హరేత్,
బుభుక్షూణాం ముముక్షూణాం
అప్యా స్వాద్య రసం హ యత్.

10. పవిత్రాణాం పవిత్రం యత్
మఙ్గళానాం చ మఙ్గళం,
శాస్త్రాణా ముత్తమం శాస్త్రం
ద్వయమంత్రార్థ పేశలమ్.

## ఆంధ్రానువాదము.

### శ్రీ పరాశరుడు పలికెను -

5. నన్ను మహాత్ములు పూర్వము అడిగియుండిన రహస్యమగు నీ విషయమును మీకు చెప్పగలను. సావధానముగా నీ ఉత్తమరహస్యము నాలకింతురు గాక!

6. భూలోకమున నాధ్యాత్మికాది తాపములచే తపించు మానవు లుజ్జీవించుట కొక గొప్ప మందు కలదు.

7. ఏది వాల్మీకి ముఖకమలమునుండి వెలువడిన మకరంద ప్రవాహరూపమైనదో, కావ్యస్రష్టలగు పండితు లెద్దానివలన జీవించుచున్నారో,

8. ఎద్దానిని వినుటవలన చతుర్విధ పురుషార్థములును సిద్ధించుచున్నవో, నారాయణ స్వరూపుడగు శ్రీరామచంద్రు డేగ్రంథమున నత్యంతము వర్ణింపబడుచున్నాడో,

9. వినినమాత్రముననే అందరి మనస్సులను బలాత్కారముగ నేది హరించుచున్నదో, ఇహ పరసౌఖ్యముల నొందగోరువారి కెయ్యది ఆస్వాదింపతగిన రసమగుచున్నదో,

10. పవిత్రమగువానిలో పవిత్రమైనదియు, మఙ్గళప్రదములలో మఙ్గళకరమైనదియు, శాస్త్రములకెల్ల నుత్తమశాస్త్రమును, ద్వయమంత్రార్థము నతిసులభముగ తెలియపరచునదియు,

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 11. సర్వాలఙ్కారగమ్భీరం<br>రసైస్సర్వై: పరిష్కృతమ్,<br>దోషదూరం గుణై స్సర్వై<br>ర్మాధుర్యాద్యై ర్మనోహరమ్. | 11. అన్ని అలంకారములతో గంభీరమైనదియు, నవరసభరితమును, దోషములు లేనట్టిదియు, మాధుర్యాది గుణములచే మనోహరమైనదియు, |
| 12 యస్య రామాయణాభిఖ్యా<br>శ్రూయతే భువనత్రయే,<br>శరణాగతిశాస్త్రాఖ్యాం<br>యస్యాహు: సాత్వతోత్తమా:. | 12. ముల్లోకములయందును రామాయణమను పేరుచే ఖ్యాతి గాంచినదియు, సజ్జనులచే శరణాగతి శాస్త్రమని పిలువబడినదియు నగు గ్రంథము |
| 13. సర్వాం స్తారయితుం వర్ణాన్<br>సాక్షా ద్రామాయణాత్మనా,<br>అనాదినిధనా వాణీ<br>జాతా వల్మీకజన్మన:. | 13. అన్ని వర్ణములవారిని తరింపజేయుటకు సాక్షా ద్రామాయణరూపమున ఆద్యంతములు లేని వాణి (వేదము) వాల్మీకి మహర్షినుండి జనించెను. |
| 14 నైతస్మా దధికం కించిత్<br>విద్యతే భువనత్రయే,<br>సర్వవేదాన్తసారార్థో<br>య దనేన ప్రకాశ్యతే | 14. ఈ రామాయణమును మించిన గ్రంథ మీ భువనత్రయమునను లేదు. దీనిచే సమస్త వేదాంతములసారమయిన అర్థము ప్రకాశింపజేయబడుచున్నది. |
| 15. శ్రీమద్భాగవతం శాస్త్రం<br>మూలమన్త్రోపబృంహణమ్,<br>చరమశ్లోకతాత్పర్య<br>గ్రాహకం భారతం మహత్. | 15 భాగవతము మూలమన్త్రమగు అష్టాక్షరీమంత్రమును ప్రకాశింపచేయును, గొప్పదియగు భారతము చరమశ్లోక తాత్పర్య ప్రతిపాదకము. |
| 16. ఇదం రామాయణం శాస్త్రం<br>ద్వయమన్త్రోపబృంహణమ్,<br>పవిత్ర మేత త్త్రితయం<br>నాऽతోऽ న్య ద్విద్మహే పరమ్. | 16 శ్రీరామాయణము ద్వయమంత్రమును ప్రకాశింపచేయునది. ఇట్లే యీ మూడును పవిత్రమైనవి. వీటిని మించిన యుద్గ్రంథము నెఱుంగము. |

సంస్కృత మూలమ్.

17. సాత్త్వికాని పురాణాని
యా న్యేషా మనుకూలతామ్,
రహస్యత్రయనిష్ణాతై:
తత్త్వత్రయవిచక్షణై:.

18. శాస్త్రత్రయ మిదం స్వాద్యం
సాత్త్వతై ర్వైష్ణవోత్తమై:,
త్రిష్వే తేష్వపి విప్రేన్ద్రా:!
ఇదం రామాయణం పరమ్

19. యత్ర ప్రవృత్తిశాస్త్రార్థ:
సమ్య గేవ ప్రకాశిత:,
సామాన్యా శ్చ విశేషా శ్చ
యత్ర ధర్మా నిరూపితా:

20. రామాయణం పరం శాస్త్రం
మన్త్రో రామాయణం మహాన్,
రామాయణం పరం ప్రాప్యం
ధనం రామాయణం పరమ్.

21. అస్మిన్ శ్రుతే శ్రుతం సర్వం
అశ్రుతే చాఽశ్రుతం భవేత్,
నాఽఽస్వాదయతి కో వైత న్మర్త్యో
రామాయణామృతమ్.

22. శ్రుతా గీతాపి వా యేన
రామాయణకథాసుధా,
పునాతి తస్య మర్త్యస్య
కుల మేకోత్తరం శతమ్.

ఆంధ్రానువాదము.

17. సాత్త్వికపురాణములన్నియు నీ మూడు గ్రంథములనే యనుసరించియుండును. రహస్యత్రయమును బాగుగా నెఱింగినవారును, తత్త్వత్రయమునం దారితేరినవారును,

18. పాంచరాత్రాగమ నిష్ణాతులునగు విష్ణుభక్తాగ్రేసరులచే రసభరితములగు నీ మూడు శాస్త్రములును (భారత, భాగవత, రామాయణములు) ఆదరముతో అధ్యయనము చేయ తగినవి. ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! ఈ మూటి యందును రామాయణము చాలగొప్పది.

19 ఈ రామాయణమున సంసారవర్ధక సమీచీన వైదికోపాయములను బోధించు శాస్త్రార్థము చక్కగా ప్రకాశింపజేయబడినది. సామాన్యధర్మములును విశేషధర్మములును ఇందు ప్రతిపాదింబబడినవి.

20. రామాయణమే గొప్ప శాస్త్రము. రామాయణమే మహామంత్రము. రామాయణమే పరమ ప్రాప్యము. రామాయణమే మహాధనము.

21. ఈ రామాయణమును వినిన మాత్రమున నన్ని శాస్త్రములు వినినట్లే యగుచున్నది. రామాయణమును విననిచో నెన్ని శాస్త్రములు విన్నను నిష్ప్రయోజనమే యగుచున్నది. కాన ఈ రామాయణామృతము నాస్వాదింపని మర్త్యుడుండునా?

22. రామాయణకథామృతమును వినినను పాడినను (పఠించినను) ఆ మనుష్యుని నూటొక్క తరములు పవిత్రము లగుచున్నవి.

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 23. అధీతాం సర్వవేదా న్వా<br>యజతాం వా ఒఖిలై ర్మఖైః,<br>దత్తాం వా సర్వదానాని<br>తపత్వపి సమా శ్శతమ్. | 23. సమస్తవేదములను పఠించుగాక! అనేక యాగములతో పరమాత్మ నర్చించుగాక! దాన ధర్మములు పెక్కులు చేయునుగాక! వందలకొలది సంవత్సరములు తప మాచరించుగాక! |
| 24. కుర్యా చ్చాన్ద్రాయణాదీ న్వా<br>తీర్థేష్వపి నిమజ్జతు,<br>శతం పూర్తాని కురుతాం<br>జానాత్వ ప్యఖిలాః కలాః. | 24. కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతము లాచరించుగాక! సర్వతీర్థములయందు స్నానముచేయుగాక! అనేక కూపతటాకనిర్మాణాది పుణ్యకర్మ లాచరించుగాక! సమస్త కళల నెఱింగిన నెఱుంగుగాక! |
| 25. యస్య రామాయణశ్లోక<br>ఏకో ఒపి న గత శ్శ్రుతిమ్,<br>వ్యర్థా స్తస్య క్రియా స్సర్వా<br>అపివా సాధ్వనుష్ఠితాః. | 25. రామాయణశ్లోకము నొకదానినైన నెఱుంగక యున్నచో చక్కగా నాచరింపబడినను అతని క్రియలన్నియు వ్యర్థములే యగుచున్నవి. |
| 26. యస్తు రామాయణం సర్వం<br>శృణ్వ న్నాచార్య వక్త్రతః,<br>తదర్థ మనుసంధధ్యా<br>త్స భక్తో వినయాన్వితః. | 26. ఆచార్యుల ముఖకమలమువలన రామాయణము నంతయు వినుచు దాని యర్థమును వినయముతో ననుసంధానము చేయువాడే భక్తుడు. |
| 27. స స్నాత స్సర్వతీర్థేషు<br>సర్వయజ్ఞేషు దీక్షితః<br>కుర్యా దన్య న్నవా కుర్యా<br>త్కృతకృత్యో న సంశయః. | 27. ఆ భక్తు డన్ని తీర్థములయందును చక్కగా స్నానము చేసినవాడే యగుచున్నాడు. అన్ని యజ్ఞములయందు దీక్షను గొనినవాడే యగును. ఇతరకృత్యము లాచరించినను, ఆచరింపకున్నను ఆతడు కృతకృత్యుడే యగును. సంశయము లేదు. |
| 28. కిం తస్య బహుభిః తీర్థైః<br>కిం తస్య బహుభి ర్మఖైః,<br>కిం తస్య బహుభి శ్శాస్త్రైః<br>యేన రామాయణం శ్రుతమ్. | 28. ఆత డనేకతీర్థములయందు గ్రుంక నవసరము లేదు. ఆత డనేకయజ్ఞముల నాచరింపవలసిన పనిలేదు. శాస్త్రములన్నియు చక్కగా నెఱుంగవలసిన యవసరమును లేదు. రామాయణమును విన్నమాత్రముననే నవి యన్నియు సిద్ధించును. |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 29. యస్య రామాయణం వక్త్రే<br>యస్య రామాయణం శ్రుతౌ,<br>నైతాభ్యా మపరో ధన్యో<br>విద్యతే భువనత్రయే. | 29. రామాయణమును పఠించినవానికన్నను, రామాయణమును వినిన వానికన్నను ముల్లోకముల ధన్యుడు మరియొకడు లేడు. |
| 30. ప్రాచేతసమహాశైలా<br>దవతీర్ణాఽతినిర్మలా,<br>రజాంసి శమయ త్యేషా<br>శ్రీరామాయణజాహ్నవీ | 30. వాల్మీకిమహర్షి యను శైలమునుండి రామాయణమను నీ గంగాప్రవాహము భూమిపై నవతరించి అతినిర్మలముగ నున్నదై దుమ్మును (రజోగుణమును) అణచివేయును. |
| 31. వాల్మీకిమేరుశిఖరా<br>దుదితం శ్రియ మిచ్ఛతా,<br>రామాయణ మహారత్నం<br>నరేణ హృది ధార్యతామ్. | 31. ఐశ్వర్యము నందగోరు మనుష్యుడు వాల్మీకి యను మేరుపర్వతశిఖరమున జనించిన రామాయణ మహారత్నమును హృదయమున ధరింపవలెను. |
| 32. వల్మీకజన్మపూర్వాద్రే<br>రుద్యతా హరతా తమః,<br>ప్రబోధ్యతే జగత్పద్మం<br>శ్రీరామాయణ భానునా. | 32. రామాయణమను నీ భాస్కరుడు వాల్మీకి మహర్షియను తూర్పుకొండపై నుదయించి అజ్ఞానమను చీకటిని హరించుచు జగత్తను పద్మమును వికసింపజేయును. |
| 33. ఉద్యత్సహస్రశాఖస్య<br>రామాయణమహాతరోః,<br>తాపత్రయాతురై ర్మర్త్యైః<br>ఛాయా సంశ్రీయతాం మనాక్. | 33. ప్రకాశించుచున్న సహస్రశాఖలుగల రామాయణ మహావృక్షముయొక్క నీడ నొకింతయేనియు తాపత్రయాతురులగు మనుష్యులాశ్రయింతురు గాక! |
| 34. త్రయీలతాగ్రనిష్పన్నం<br>రామాయణ మహాఫలమ్,<br>అనశ్వరరసం స్వాద్యం<br>నిత్యం తృప్తి మభీప్సతా. | 34. వేదమను లతయొక్క యగ్రమున నుదయించిన యీ రామాయణ మహాఫలము నశించని రసము కలది. తృప్తినికోరు మనుజులు దీని నెల్లప్పుడును అనుభవించుచుండవలెను. |

సంస్కృతమూలమ్

35 వేదసింహాసనారూఢం
సార్వభౌమం నిసర్గతః,
రామాయణమహారాజం
న దరిద్రాతి సంశ్రితః.

36 ధీమన్థమథితా జ్జాతో
వాల్మీకి క్షీరసాగరాత్,
రామాయణేన్దు స్సంసేవ్యో
విబుధై రమృతార్థిభిః.

37. కాణ్డశాఖ స్సర్గగుచ్ఛో
న్యాసవిద్యాతిసౌరభః,
శ్రీరామాయణమన్దార
స్సేవ్య స్సర్వఫలేప్సుభిః.

38. వాల్మీకిగిరిసమ్భూతా
రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా
రామాయణమహానదీ.

39. ప్రాచేతసహ్రదోత్ఫుల్ల
శ్రీవిహారనికేతనమ్,
రామాయణమహాపద్మం
సేవనీయం సదాళిభిః.

40. కృతం వాల్మీకిభిషజా
రామాయణరసాయనమ్,
పేయం సంసారరోగార్తైః
నరైః పుష్టి మభీప్సుభిః.

ఆంధ్రానువాదము

35. వేదమను సింహాసనము నధిష్ఠించినట్టియు, సహజముగనే సార్వభౌము డనదగు రామాయణ మను చక్రవర్తి నాశ్రయించిన వారు దరిద్రులు కాజాలరు. (రామాయణమును నిత్యము శ్రద్ధాభక్తులతో నధ్యయనము చేయువారికి సకలైశ్వర్యములును సిద్ధించును.)

36 అమృతమునుకోరు విజ్ఞానులు, బుద్ధియనెడు కవ్వముచే మథింపబడిన వాల్మీకి యనెడు క్షీర సాగరమునుండి యుదయించిన రామాయణ చంద్రుని సేవింపవలెను.

37. కాండలను కొమ్మలు కలదియు, సర్గలను పూల గుత్తులు కల్గినట్టియు, ప్రపత్తి యనెడు విద్యచే పరిమళించునదియు నగు శ్రీరామాయణకల్ప తరువు అన్ని కోరికలను గోరువారిచే సేవింప తగినది.

38. రామాయణమను నీ మహానది వాల్మీకియను పర్వతమున పుట్టి శ్రీరామచంద్రుడను సాగర మున ప్రవేశించుచు తాను పవిత్రమైనదై భూలోకమును పవిత్రము చేయుచున్నది.

39. వాల్మీకి యనెడు మడుగున వికసించినదియు, శ్రీమహాలక్ష్మికి విహారస్థానమైనదియు నగు నీ రామాయణ మహాపద్మ మెల్లవేళలయందును పండితులనెడు తుమ్మెదలచే సేవింపదగినది.

40. వాల్మీకి యనెడు వైద్యునిచే చేయబడిన యీ రామాయణ మనెడు రసాయనము సంసార మనెడు రోగమును బాపుకొని బలము నార్జింప జూచు నరులచే త్రాగదగినది.

సంస్కృతమూలమ్

41. శ్రీరామగుణరత్నాఢ్యం
నానోపాఖ్యానకాఞ్చనమ్,
శ్రీమద్భిః శ్రవణే ధార్యం
రామాయణ విభూషణమ్.

42. బహునా కి మిహోక్తేన
యది వోఽస్త్యు జ్జిజీవిషా,
ఆదికావ్య మిదం దివ్యం
రామవృత్తం నిశమ్యతామ్.

43. తదుపగతసమాససన్ధియోగం
సమమధురోపనతార్థవాక్యబద్ధమ్,
రఘువరచరితం మునిప్రణీతం
దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్.

44. యః కర్ణాఞ్జలిసంపుటై రహ రహ
స్సమ్యక్ పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిన్దగళితం
రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై
రత్యన్తసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమా
న్విష్ణోః పదం శాశ్వతమ్.

ఇతి
శ్రీమత్పారాశర్యే ఉపపురాణే
శ్రీరామాయణమాహాత్మ్యే
ప్రథమోఽధ్యాయః

---

ఆంధ్రానువాదము

41. రామాయణమను నీ కర్ణాభరణము శ్రీరామచంద్రుని గుణములనెడు రత్నములచే కూర్పబడి అనేకములగు ఉపాఖ్యానము లను బంగారముచే చేయబడినది. దీనిని శ్రీమంతులు కర్ణములయందు ధరింతురుగాక!

42. తరింపగోరు జనులారా! పెక్కుమాటలచే నేమి ప్రయోజనము? మీరు సంసారసాగరమును తరింపగోరితిరేని దివ్యమును ఆదికావ్యమును నగు నీ రామకథను చక్కగా నాకర్ణింపుడు.

43. సమాసములతోను సంధులతోను కూడినదియు, మధురార్థములుకల వాక్యములచే కూర్పబడినదియు, వాల్మీకిమహర్షిచే రచింపబడిన, దశగ్రీవుని వధను తెలుపునట్టి యీ శ్రీరామ చరిత్రను చక్కగా నాలకింపుడు.

44. వాల్మీకి వదనారవిందమునుండి స్రవించినట్టి రామాయణమను మకరందమును ఏ మనుష్యుడు శ్రవణపుటములతో ననుదినమును చక్కగా నాకర్ణించునో ఆతడు జన్మ, వ్యాధి, ముసలితనము, ఆపత్తి, మరణములచే నత్యంతోపద్రవమయమగు సంసారమును వీడి శాశ్వతమగు వైకుంఠమనెడు మోక్షసామ్రాజ్యము నధిరోహించును.

ఇది
పరాశరముని ప్రణీతమగు నుపపురాణమునందు
గల శ్రీరామాయణమాహాత్మ్యమను
ప్రథమాధ్యాయము.

---

# ద్వితీయోఽధ్యాయః

సంస్కృత మూలమ్

## శ్రీరామాయణపారాయణ శ్రవణ నియమాః

ఋషయ ఊచుః -

1. శ్రేయస్తమ మిదం బ్రహ్మన్ !
కథితం ముక్తిసాధనమ్,
కదా కస్మా త్కథం వైతత్
శ్రావ్యం బ్రూహి మహామునే !.

శ్రీపరాశర ఉవాచ –

2. ఇమ మర్థం పురా పృష్టో
నారదేన మహాత్మనా,
సనత్కుమారో ఽకథయ
చ్ఛ్రూయతాం త ద్బ్రవీమి వః.

నారద ఉవాచ -

3. య దేత ద్భువి విఖ్యాతం
రామాయణ మితి ప్రభో,
శ్రవణాదౌ విధిం తస్య
కృపయా త ద్బ్రవీహి మే.

4. యథా త్వదుపదిష్టేన
తరన్తు భువి మానవాః,
నాఽజ్ఞాతం తే జగత్యస్మిన్
సర్వజ్ఞో ఽసి మతో మమ.

# రెండవ అధ్యాయము

ఆంధ్రానువాదము

## శ్రీరామాయణమును చదువుటకు వినుటకు సంబంధించిన నియమములు.

ఋషులు పలికిరి –

1. పూజ్యుడవగు నో పరాశరమహర్షీ! శ్రవణానంద కరమును, మోక్షసాధనమునునగు నీ రామాయణ మాహాత్మ్యము నెప్పుడు ఎవరు ఎందులకు ఎట్లు చెప్పిరో మాకు చెప్పుము అని ఋషులు పరాశరు నడిగిరి.

పరాశరమహర్షి పలికెను -

2. ఇట్లు పూర్వము మహాత్ముడగు నారదునిచే నడుగబడి సనత్కుమారు డాతనకి చెప్పెను. దానినే నేను మీకు చెప్పెదను, వినుడు.

నారదుడు అడిగెను –

3. మహర్షీ! భూలోకమున ప్రసిద్ధికెక్కిన రామాయణమును వినుటకుముందు ఏమి చేయవలెనో దానిని నాకు దయతో నుపదేశింపుము.

4. నీ వుపదేశించిన మార్గముననే భూలోకము నందలి మనుష్యులందరును తరింతురుగాక! నీ కీ ప్రపంచమున తెలియనిది లేదు. నీవు సర్వజ్ఞుడవని నా అభిప్రాయము. అని నారదుడు సనత్కుమారుని నడిగెను.

సంస్కృత మూలమ్

**పరాశర ఉవాచ –**

5. ఇతి పృష్టో నారదేన
ప్రణతేన మహామనాః,
సనత్కుమారో భగవాన్
అవోచత్ ప్రీతమానసః.

**సనత్కుమార ఉవాచ –**

6. మనసా సావధానేన
శ్రూయతాం య ద్బ్రవీమి తే,
శ్రుత్వా విమృశ్యతాం సమ్యక్
విమృశ్య క్రియతా మపి

## శ్రీరామాయణపారాయణాదిషు శుభకాలః

7. రామాయణస్య శ్రవణం
పఠనం వా మహామునే!
ఆరభేత శుభే మాసి
దినే వారే చ తారకే.

8. ముక్త్వా త్రైషశుచీ మాసౌ
సర్వే మాసా శ్శుభావహాః,
దళం పూర్వం చ భాద్రస్య
శుభ మన్య త్తు నిన్దితమ్.

9. సౌమ్యాయనం పూర్వపక్షః
పూర్వాహ్ణ శ్చాతిశోభనమ్,
రిక్తాం వినా ఽన్యతిథయః
శుభేమాక్తా శ్శుభావహాః.

10. శుభవారా శ్శుభాః ప్రోక్తాః
క్రూరా వారా స్త్వశోభనాః,
భానువార శ్శుభో యస్మాత్
రామోఽజాయత తత్కులే.

ఆంధ్రానువాదము

**పరాశరుడు పలికెను –**

5. ఇట్లు నమస్కరించి నారదు డడుగగా మహా జ్ఞానియు పూజ్యుడును నగు సనత్కుమారుడు సంతుష్టాంతరంగుడై ఇట్లు చెప్పెను.

**సనత్కుమారుడు పలికెను –**

6. నారద! నేను చెప్పిన దానిని సావధానముగ నాలకింపుము. విని చక్కగా దానిని విమర్శింపుము. అనంతర మాచరింపుము.

## శ్రీరామాయణపారాయణాదులకు శుభకాలము

7. మహామునీ! రామాయణమును వినుట చదువుట శుభకరమగు మాసమున శుభదినమున శుభవారమున శుభనక్షత్రమున నారంభింపవలెను

8 పుష్యాషాఢ మాసములు తప్ప తక్కిన మాసములన్నియు శుభప్రద మైనవి. భాద్రపదమాసమున మాత్రము పున్నమ వరకు పదునైదురోజులు మాత్రమే ఆరంభమునకు తగినవి. తక్కిన దినములలో నారంభింపరాదు.

9. ఉత్తరాయణము, శుక్లపక్షము, పూర్వాహ్ణము రామాయణారంభమునకు మిక్కిలి శుభావహములు. చవితి, నవమి, చతుర్దశులుతప్ప మిగిలినవై శుభకార్యముల కుపయోగించు తిథులన్నియు శుభావహములు.

10. మంగళకరమగు వారములు శుభావహములు. క్రూరములగు మంగళ శని వారము లమంగళకరములు. రవివంశమున శ్రీరామచంద్రు డుద్భవించుటచే రవివారము (ఆదివారము) శుభప్రద మైనది.

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 11. శనివార స్తథా విష్ణు ర్యస్మా త్తస్యాఽధిదైవతమ్, ఇత్యూచు రపరే ప్రాజ్ఞా స్తౌ చ గ్రాహ్యౌ తతో బుధైః. | 11. శనివారమునకు విష్ణు వధిదైవతముగాన శని వారము సయితము శుభావహమే యని మరి కొందరు ప్రాజ్ఞులుచెప్పుటచే శని, ఆదివారములు రెండును విబుధులచే గ్రహింపదగినవి. |
| 12. సర్వా శ్శుభఫలాః ప్రోక్తా విద్యారమ్భే నక్షత్రతారకాః, ఋక్షం త్వదితిదైవత్య మత్యుత్తమ ముదాహృతమ్. | 12. విద్యారంభమునకై చెప్పబడిన నక్షత్రము లన్నియు శుభమును చేకూర్చును. అదితి దేవతగాగల పునర్వసు నక్షత్రము మాత్రము అత్యుత్తమమని చెప్పబడినది. |
| 13. కేచి ద్వైష్ణవ మృక్షం చ ప్రశంసన్తి పరం బుధాః, అస్తవిష్టివ్యతీపాత వైధృత్యాదీ న్వివర్జయేత్. | 13. కొందరు పండితులు శ్రవణనక్షత్రము మంచి దందురు. మౌఢ్యసమయము, విష్టికరణము, వ్యతీపాత వైధృత్యాది యోగకాలములు విడువవలెను. |

| పారాయణోచితస్థలవివరణం - | పారాయణోచితస్థలవివరణము - |
|---|---|
| 14. ఏవం విమృశ్య దేవర్షే! శుచి ర్నియతమానసః, పుణ్యక్షేత్రే పుణ్యతీర్థే దేవతాయతనేషు వా. | 14. నారదమునీంద్రా! ఇట్లు విమర్శించి శుచియై మనోనిగ్రహము కలిగియుండి పుణ్యక్షేత్రమున గాని పుణ్యతీర్థమునగాని దేవాలయముల యందుగాని, |
| 15. సమాజే బ్రాహ్మణానాం వా వైష్ణవానాం విశేషతః, తులసీకాననే వాఽపి గోష్ఠే పద్మవనేఽపి వా. | 15. బ్రాహ్మణులుగాని అందును విశేషించి వైష్ణవులుగాని ఉండుస్థలములయందుగాని, తులసి తోటయందుకాని, గోవులుండు స్థలములయందు గాని, పద్మవనమునగాని, |
| 16. నదీనాం వాఽపి తీరేషు మహాపద్మాకరేషు వా, సమే శుచౌ శర్కరాగ్ని ధూమశైత్యాదివర్జితే. | 16. పుణ్యనదీతీరములయందుగాని, గొప్పచెరువుల ఒడ్డులందుగాని, మిట్టపల్లములు, గులకరాళ్ళు, నిప్పు, పొగ, నీరు చెమర్చుట మొదలగునవి లేక పవిత్రమైన సమతలమగు ప్రదేశమునందు గాని, |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము. |
| --- | --- |
| 17. మనోనుకూలే నిర్వాతే<br>చక్షుఃపీడాద్యనుల్బణే,<br>చణ్డాల మ్లేచ్ఛ పాషణ్డ<br>పతితాద్యై రదూషితే | 17. మనస్సున కనుకూలమైనట్టియు, ప్రతికూలమగు గాలి లేనట్టియు, ప్రత్యక్షమగు నేత్రబాధకము కానట్టియు, చండాలులు మ్లేచ్ఛులు పాషండులు (నాస్తికులు) పతితులచే (వర్ణభ్రష్టులచే) నపవిత్రముగానట్టియు, |
| 18 ఖరోష్ట్రకాకశునక<br>గ్రామసూకరవర్జితే,<br>ఏవంవిధే శుభే దేశే<br>ప్రారభేత విచక్షణః. | 18. గాడిద, ఒంటె, కాకి, కుక్క, ఊరబంది మొదలగు క్షుద్రప్రాణులచే స్పృశింపబడనట్టి పవిత్రప్రదేశమున రామాయణమును వినుటకు గాని చదువుటకుగాని ప్రారంభింపవలెను. |
| 19. విశేషత స్త్వయోధ్యాయాం<br>పఠనా చ్ఛ్రవణా దపి,<br>ప్రీయతే భగవా న్రామ<br>స్సహి విష్ణు స్సనాతనః | 19 ముఖ్యముగా నయోధ్యయందు చదువుటవలనను వినుటవలనను విష్ణ్వవతారభూతుడగు శ్రీరామ చంద్రుడు మిక్కిలి సంతసించును |
| 20. యత్రాఽభివ్యక్తి మాపన్నో<br>భగవాన్ భూతభావనః,<br>తేషు క్షేత్రేషు పఠనాత్<br>అనన్తగుణితం ఫలమ్ | 20. సంకల్ప మాత్రముననే సకల భూతములను సృష్టించు భగవంతు డెచ్చట స్వయంవ్యక్త మగునో ఆ యా క్షేత్రములయందు పఠించుట వలన పలురెట్లుగా ఫలము కలుగును |
| 21. యత్ర విష్ణుకథాస్వాద<br>లోలుపా వైష్ణవోత్తమాః,<br>పఠనే శ్రవణే వాఽపి<br>స దేశోఽత్యుత్తమ స్స్మృతః. | 21. ఏ దేశమున భగవద్భక్తాగ్రగణ్యులు విష్ణు కథలను చదువుటయందుగాని వినుటయందు గాని మిక్కిలి యాసక్తి కలిగియుందురో యాదేశ మత్యుత్తమమైనదని తలంచబడు చున్నది. |
| **ఆచార్యలక్షణమ్ -** | **ఆచార్యలక్షణము -** |
| 22. ఆచార్యో వేదవేదాఙ్గ<br>తత్త్వవేదీ విచక్షణః,<br>అర్థపంచకతత్త్వజ్ఞః<br>పంచకృత్యపరాయణః. | 22. వేదవేదాఙ్గములను చక్కగా నెఱింగినట్టియు చక్కని శాస్త్రపాండిత్యము కలిగినట్టియు అర్థపంచకమును (జీవ-పరమాత్మ-ఉపాయ-ఫల - విరోధి స్వరూపములను) బాగుగా తెలిసికొన్నట్టియు, పంచమహాయజ్ఞముల నాచరించునట్టియు, |

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 23. రహస్యత్రయనిష్ణాత<br>స్తత్త్వత్రయవిమర్శనాత్,<br>సత్సంప్రదాయనిరత:<br>స్థిరధీ ర్నియతేంద్రియ:. | 23. అష్టాక్షరీ-ద్వయ-చరమరహస్యములను సార్థముగ చక్కగనెఱింగి, చిదచిదీశ్వరులనెడు మూడుతత్త్వముల వాస్తవస్వరూపముల నెఱింగి, మంచి యాచారమునం దాసక్తికలిగి యుండి, స్థిరచిత్తముకలిగి ఇంద్రియనిగ్రహము కలిగినట్టియు, |
| 24. కృపావాన్ సత్యవాదీ చ<br>సాత్త్విక స్సాధుసమ్మత:,<br>శాసితా దీర్ఘసౌహార్ద:<br>శిష్యోజ్జీవనతత్పర: | 24. దయకలవాడై, సత్యమునే పలుకుచు సత్త్వగుణముకలిగి, సజ్జనులచే నభినందింపబడుచు ధర్మముల నాదేశించువాడై, సుదృఢ స్నేహ భావముకలిగి శిష్యజనుల నుజ్జీవనముచేయుట యందే యాసక్తి కలిగినట్టియు, |
| 25. చిహ్నితో భగవచ్చిహ్నై:,<br>అనసూయు రదామ్భిక:,<br>ఆచార్య భక్తిసంపన్నో<br>భగవచ్ఛాస్త్రతత్పర:. | 25. భగవంతుని చిహ్నములగు శంఖచక్రముల బాహుమూలముల ధరించినట్టియు, అసూయ లేనట్టియు, దంభము లేనట్టియు, తన ఆచార్యునియందు భక్తికలిగినట్టియు, భగవంతుని బోధించు శాస్త్రవిషయమునం దాసక్తి కలిగి యున్నట్టియు, |
| 26. ఇతిహాసపురాణానాం<br>వ్యాఖ్యాతా స్మృతిపారగ:,<br>కావ్యాలంకారసారజ్ఞో<br>గమ్భీరమధురస్వర:. | 26. ఇతిహాసపురాణముల యర్థమును చక్కగా చెప్పజాలినట్టియు, స్మృతులను అంతము చక్కగా నధ్యయనము చేసినట్టియు, కావ్యాలంకారముల సారము నెఱింగినట్టియు, గంభీరమును మధురమైన కంఠస్వరము కలిగినట్టియు |
| 27. సర్వవేదాన్త తత్త్వజ్ఞ:<br>సర్వసచ్ఛాస్త్ర భక్తిమాన్,<br>కాణాదాదిమదుస్తర్క<br>దనీయా నాస్తికోత్తమ:. | 27. సర్వవేదాన్తముల సారమును వాస్తవముగ నెఱింగినట్టియు, సమస్త సాత్త్వికశాస్త్రముల యందు భక్తికలిగినట్టియు, వైశేషికాదిదార్శనికుల కుతర్కములకు లోబడనట్టియు, అవిచాల్యుడగు ఆస్తికుడైనట్టియు, |

సంస్కృత మూలమ్ — ఆంధ్రానువాదము

28. ప్రియవాదీ సత్యవాదీ
తేజస్వీ దానశీలవాన్,
అనేకాన్తిభి రక్షోభ్య:
న్యాసవిద్యార్థగౌరవ:

28 ప్రియముగను సత్యముగను వచించునట్టియు, తేజశ్శాలియు, దానశీలుడు నైనట్టియు చల చిత్తులచే వంచింపబడనట్టియు, ప్రపత్తిశాస్త్ర మున నాదరము కలిగినట్టియు,

29. ఫలాభిసన్ధివిధురై:
కర్మభి ర్హరితోషక:,
ఏవంవిధో ఽస్య శ్రవణే
శ్రయణీయో గురూత్తమ:

29. ఫలమును కోరక శాస్త్రోక్తకర్మల నాచరించి భగవంతుని సంతోషపెట్టునట్టియు గురువును, రామాయణము వినుట కాశ్రయించవలెను.

## శిష్య లక్షణమ్ -

## శిష్యలక్షణము –

30. ఆదా వీదృశ మాచార్యం
శుశ్రూషు ర్భక్తినమ్రధీ:,
శాస్త్రార్థతత్త్వబోధేప్సు:
సదాచారవిలక్షణ:.

30. ప్రథమమున నిట్టి యాచార్యులకు చక్కగా భక్తితోను, వినయముతోను సేవల నాచరించుచు శాస్త్రార్థములను చక్కగా నెఱుంగ గోరుచు సదాచారములననుష్ఠించుచు పరమవిలక్షణుడై

31. ప్రణామతత్పరో నిత్యం
ప్రశ్నకాల ప్రతీక్షక:,
శాన్తో దాన్తో జితక్రోధ:
శరణాగతితత్పర:.

31. గురువునకు ప్రతినిత్యము నమస్కరించుచు, సమయము నెఱింగి ప్రశ్నించుచు, అంతరింద్రియ బహిరింద్రియముల నిగ్రహించి క్రోధమును జయించి యాచార్యులను ప్రపత్తిచేయుటలో నాసక్తుడై,

32. ఊహావిశ్వాసవాన్ శాస్త్రే
ప్రవక్తరి హరా వపి,
అనసూయ: కృతజ్ఞ శ్చ
వైష్ణవో వీతమత్సర:.

32. శాస్త్రమునందును తనకు హితమునుగూర్చు నాచార్యులయందును విష్ణువనెడు బుద్ధి విశ్వాసములు కలిగి, అసూయలేక కృతజ్ఞుడైయుండి విష్ణుభక్తికలిగి మత్సరములేక

33. ద్వయసౌరభసంపూర్ణో
భగవల్లాంఛనాంకిత:,
ఆలస్యాద్యై స్స్వప్తభి శ్చ
దోషై రభివివర్జిత:.

33. ద్వయ మంత్రానుసంధానము నొనర్చుచు భగవంతుని చిహ్నముల ధరించి (తప్తచక్రాంకితుడును ఊర్ధ్వపుండ్రధారియునై) సోమరితనము నిద్ర ప్రమాదము మొదలగు నేడు దోషములులేని

సంస్కృత మూలమ్

**ఆచార్యవరణప్రకారః -**

34. శిష్య ఏవంవిధః ప్రాప్య
ప్రణిపత్యాభి పూజ్యచ,
శిర స్యంజలి మాధాయ
ప్రార్థయేత వినీతిమాన్.

35. ఆచార్య! శ్రోతుకామోఽస్మి
రామాయణ మహామనుమ్,
ప్రణతస్య కృపాపూర్ణః
పూరయాస్య మనోరథమ్.

36. ఇతి సంప్రార్థ్య సంపూజ్య
ప్రసన్నేన మహాత్మనా,
తేనోపదిష్టం శృణుయాత్
రామాయణకథామృతమ్.

37. అథ సర్వోన్నతే పీఠే
చేలాజినకుశోత్తరే,
నిషణ్ణం శిష్య ఆచార్యం
భావయే ద్రఘునందనమ్.

38. యస్మా న్నారాయణో దేవః
కృత్వా మర్త్యమయీం తనుమ్,
మగ్నా నుద్ధరతే లోకాన్
కారుణ్యా చ్ఛాస్త్రపాణినా.

39. తస్మా ద్భక్తిర్గురౌ కార్యా
సంసారభయ భీరుణా,
న జ్ఞానదాతు ర్భగవా
నన్యో నామేహ విద్యతే.

ఆంధ్రానువాదము

**ఆచార్యవరణప్రకారము –**

34. ఇట్టి శిష్యుడు పై నుదహరించిన యాచార్యులను పొంది నమస్కరించి వారిని పూజించి శిరమున దోసిలి ఘటించి నమస్కరించుచు వినయముతో నాచార్యులనుగూర్చి,

35. ఆచార్యా! రామాయణ మహామంత్రమును వినగోరుచున్నాను. మీకు శిష్యుడనగు నాయం దనుగ్రహముంచి నాకోర్కెను నెరవేర్పుడని ప్రార్థింపవలెను.

36. అని ప్రార్థించి వారిని చక్కగా పూజించి వారనుగ్రహించి యుపదేశించిన రామాయణ కథామృతమును వినవలెను.

37. అనంతర మందరికంటె నున్నతాసనమున వస్త్రమును దానిపై కృష్ణాజినమును మరల దానిపై దర్భాసనమును పరచి దానిపై కూర్చునియున్న యాచార్యుని శిష్యుడు శ్రీరామచంద్రునివలె భావించవలెను

38. శ్రీమన్నారాయణుడు మనుజ శరీరమును ధరించి దయతో శాస్త్రమనెడు చేతితో సంసార సాగరమున మునిగిపోవుచున్న లోకుల నుద్ధరించును.

39. కాన సంసారమువలన భయపడు మనుష్యుడు గురువునందు భక్తికలిగి యుండవలెను. జ్ఞానప్రదాతయగు గురువు దక్క వేరొక భగవంతుడు లేడు.

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 40. యస్య దేవే పరా భక్తి: యథా దేవే తథా గురౌ, తస్యైఽమీ కథితా హ్యర్థా: ప్రకాశన్తే మహాత్మన:. | 40 దేవునియందువలెనే ఆచార్యునియందును ఉత్కృష్టమగు భక్తి కలిగియుండిన బుద్ధిశాలికి పై నుదహరించబడిన ప్రయోజనములన్నియు సిద్ధించును. |
| 41. మన్త్రే తద్దేవతాయాం చ తథా మన్త్రప్రదే గురౌ, త్రిషు భక్తి స్సమా కార్యా సా హి ప్రథమసాధనమ్. | 41. మంత్రమునందును దాని దేవతయందును అట్లే మంత్రోపదేష్టయగు గురువునందును వీరు ముగ్గురియందును సమానమగు భక్తి కలిగియుండవలెను. అదియే మొదటి సాధనము. |
| 42. మన్త్రనాథం గురుం మన్త్రం సమత్వేన విభావయేత్, యో నైవం భావయే న్మూర్ఖో రౌరవే స నిమజ్జతి | 42. మంత్రాధిదేవతను, గురువును, మంత్రమును సమానముగా గౌరవింపవలెను. ఇట్లు తలంచని మూర్ఖుడు రౌరవ నరకమున మునిగిపోవును. |
| 43. శాస్త్రేణ గమ్యో భగవాన్ ఆచార్యో రఘునన్దన:, రామాయణప్రవక్తా తు సాక్షా ద్రామో మహాగురు:. | 43 భగవంతుడగు శ్రీరామచంద్రుడు శాస్త్రముచే నెఱుంగదగిన గురువు, కాని రామాయణము నుపదేశించు నాచార్యుడన్ననో ప్రత్యక్షమగు శ్రీరామచంద్రుడేకదా! |
| 44. చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు య: స్మరేత్, కరస్థ ముదకం త్యక్త్వా ఘనస్థం సోఽభివాఞ్ఛతి. | 44. కంటికి గోచరించుచున్న గురువును వీడి శాస్త్రములచే పొందదగిన గురువును పొందదలంచువాడు చేతిలోనున్న జలమును వీడి మేఘమునందున్న నీటి నాశించు చెనటియేగదా! |
| 45. సులభం హి గురుం త్యక్త్వా దుర్లభం య ఉపాశ్రయేత్, లబ్ధం త్యక్త్వా నిధిం మూఢో గుప్త మన్వేషతి క్షితౌ. | 45. సులభుడగు గురువును వీడి దుర్లభుడగు భగవంతు నాశ్రయించువాడు చేతికిదొరకిన నిధిని వీడి భూమియందు పాతియుంచిన నిధి నన్వేషించు యజ్ఞానివంటివాడే యగునుకదా! |

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 46. వినా ఽఽచార్యకృపాం లోకే<br>పుమాన్ జన్మశతై రపి,<br>నాప్నోతి రామపాదాబ్జం<br>సత్య మేత ద్బ్రవీమి తే. | 46. ఆచార్యుల యనుగ్రహములేక మనుష్యుడు నూరుజన్మలకైనను శ్రీ రామ పాదపద్మములను పొందజాలడు. ఇది సత్యమని నేను ముమ్మాటికి నీకు తెలుపుచున్నాను. |
| 47. స్వర్గాపవర్గయో ర్వాపి<br>నరకే వా మహామునే!<br>గురు ర్నిధాతుం శక్నోతి<br>శిష్యం నా స్త్యత్ర సంశయః. | 47. ఓ మునీశ్వరా! గురువు శిష్యుని స్వర్గమునందుగాని మోక్షమునందుగాని నరకమునందుగాని పడవేయగలుగు ననుటలో సందియము లేదు. |
| 48 యస్యాఽఽచార్య స్తు దయతే<br>దయతే తస్య రాఘవః,<br>తత్రైవ జలదో వర్షేత్<br>మరుతా యత్ర నీయతే. | 48. ఆచార్యుని యనుగ్రహము కలవానిని శ్రీరామచంద్రుడుగూడ ననుగ్రహించును మేఘమును గాలి యెచ్చటకు త్రోసిన నచ్చటనే యది వర్షించునుకదా! |
| 49. ఆచార్యనిగృహీతే తు<br>నైవ రామః ప్రసీదతి,<br>వసన్తోఽపి న పుష్ణాతి<br>మఞ్జరీం తరువిచ్యుతామ్. | 49 చెట్టునుండి రాలిపోయిన పూవులగుత్తిని వసంతుడైనను వికసింపచేయజాలనట్లు ఆచార్యులు కోపించిన వానిని శ్రీరాము డనుగ్రహింపడు. |
| 50. ఆచార్యభక్తిహీనే తు<br>దత్తం రామాయణామృతమ్,<br>అశ్మనీవ మహద్వర్షం<br>నిష్ఫలం స్యా దసంశయమ్. | 50 ఆచార్యునియందు భక్తిలేనివానికి రామాయణము నుపదేశించుట రాతిపై కురిసిన పెద్ద వర్షమువలె నిష్ఫలమగు ననుటలో సందియము లేదు. |

**శ్రీరామాయణ పఠనాధికారిణః -**

**శ్రీరామాయణ పఠనాధికారులు –**

| | |
| --- | --- |
| 51. రామాయణస్య పఠనే<br>ద్విజా స్స్యు రధికారిణః,<br>న శూద్రస్యాఽధికార స్స్యాత్<br>ఋతే సంక్షేపతః ప్రభో. | 51. రామాయణమును చదువుటలో బ్రాహ్మణులకే యధికారము కలదు. సంక్షేప రామాయణము చదువుటయందుమాత్రమే శూద్రుల కధికారము కలదు. |

**సంస్కృత మూలమ్** / **ఆంధ్రానువాదము**

52. చతుర్ణా మపి వర్ణానాం
శ్రవణే ఽ స్త్యధికారితా,
స్త్రీశూద్రయో ర్విశేషేణ
శ్రవణా త్కృతకృత్యతా.

52. నాల్గువర్ణముల వారికిని రామాయణము వినుటలో నధికారము కలదు. అందును స్త్రీశూద్రులు ముఖ్యముగా రామాయణము వినుటవలననే కృతకృత్యు లగుదురు.

53. సంక్షేపపఠనే చా పి
స్త్రీ సచ్ఛూద్రా విహార్హతః,
రామాయణఫలం తేన
ప్రాప్నుతాం నియమాన్వితౌ.

53. సంక్షేపరామాయణమును చదువుటలో స్త్రీలును మంచి శూద్రులును తగియుందురు. దానిని నియమములతోగూడి పఠించుటచే వారా రామాయణము చదువుటవలన కలుగు ఫలితము నందుదురు.

54. లాఞ్ఛితా భగవచ్చిహ్నైః
కృషిగోధన జీవినః,
విప్రాంఘ్రిసేవాతపస
స్స్నాన దానాదితత్పరాః.

54. భగవంతుని చిహ్నములగు శంఖచక్ర–ఊర్ధ్వ పుండ్రాదులను ధరించి, వ్యవసాయము, గోధనములచే జీవించువారై, బ్రాహ్మణ పాదసేవ, భోగసంకోచము స్నానదానాదులయం దాసక్తి కలిగియుండి

55. పౌరాణికై శ్చ సంస్కారైః
యథాకాలం సుసంస్కృతాః,
అసంకీర్ణా శ్చ యే శూద్రా
స్తే సచ్ఛూద్రా ఇతి స్మృతాః.

55 పురాణోక్త సంస్కారములచే సకాలమున సంస్కరింపబడినవారై వర్ణసాంకర్యములేని శూద్రులు సచ్ఛూద్రులని చెప్పబడుచున్నారు.

56. యా కన్యా బ్రాహ్మణేనోఢా
శూద్రా శాస్త్రపురస్సరమ్,
తస్యాం జాత స్సంస్కృత శ్చ
సచ్ఛూద్ర స్సో ఽపి గీయతే.

56. శాస్త్రోక్తరీతిగా బ్రాహ్మణుడు పెండ్లియాడిన శూద్రకన్యయందు పుట్టి సంస్కరింపబడిన పిల్లవాడు సచ్ఛూద్రుడని చెప్పబడును.

57. సంక్షేపపఠనే చా పి
రామాయణకథాశ్రుతౌ,
అయ మేవాఽధికారీ స్యాత్
న తు సంకీర్ణజాతిజః.

57. సంక్షేప రామాయణమును చదువుటలోను అట్లే రామాయణమును వినుటలోను ఈతనికి యధికారమున్నది. కాని సంకీర్ణజాతివాకి కధికారములేదు.

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 58. న మ్లేచ్ఛా నాపి చణ్డాలా<br>స్తథా న రజకాదయః,<br>నాఽఽచార్యభక్తిహీనాశ్చ<br>న రామే భక్తివరితాః. | 58 మ్లేచ్ఛులు, చండాలురు, చాకలివారు మొదలగువారికిని, గురువునందు భక్తిలేనివారికిని, రామచంద్రునియందు భక్తిలేనివారికిని, |
| 59. న ఘాతుకాశ్చ న శఠా<br>న కృతఘ్నా న నాస్తికాః,<br>న తస్కరా న పిశునా<br>నా భిశస్తాతతాయినః. | 59. ఘాతుకులకును, కూడని పనులయందు మొండి పట్టుదల గలవారికిని, కృతఘ్నులకును, నాస్తికులకును, చోరులకును, లుబ్ధులకును, శాపగ్రస్తులకును, ఆతతాయులకును - (ఇంటికి నిప్పుపెట్టువాడు, విషమునిచ్చువాడు, ఆయుధపాణియై చంపనేతెంచినవాడు, పరులసొత్తును, భార్యను, భూమిని, అన్యాయముగ నపహరించినవాడును ఆతతాయి యనబడును). |
| 60. న దేవతాన్తరే భక్తా<br>న శ్రుతిస్మృతినిన్దకాః,<br>నాఽవైష్ణవవ్రతపరా<br>న చాఽవైష్ణవ సంశ్రయాః. | 60. దేవతాంతరములయందు భక్తి కలవారికిని, శ్రుతి స్మృతులను నిందించువారికిని, విష్ణువ్రతమున నాసక్తి లేనివారికిని, వైష్ణవుల నాశ్రయింపనివారికిని, |
| 61. నా వైష్ణవగ్రన్థరతా<br>న చ వైష్ణవవిద్విషః,<br>న చ విష్ణుకథాద్వేష<br>దూషితా న చ చంచలాః. | 61. విష్ణుగ్రంథములయం దాసక్తి లేనివారికిని, విష్ణు కథలయందు ద్వేషము కలిగి వాటిని దూషించువారికిని, చంచలమనస్కులకును, |
| 62. న వృథాస్థికపాలాశ్మ<br>జటాశ్మశ్రుధరా నరాః,<br>న పరస్త్రీద్రవ్యదగ్ధహృదో<br>న దురన్నాశుచీకృతాః. | 62. వ్యర్థముగ నెముకలను, పుఱ్ఱెలను, రాళ్ళను, జడలను, గడ్డము మీసములను ధరించువారికిని పరస్త్రీద్రవ్యామోహము కలవారికిని, చేయరాని భోజనమును చేసి యపవిత్రులైన వారికిని, |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 63. అవ్యస్థితమర్యాదా<br>యే చ పాషండిన: పరే,<br>ఏతే సర్వేఽపి నార్హన్తి<br>సాక్షాద్రామాయణశ్రుతిమ్ | 63. కులపు కట్టుబాటులయందు నిలకడలేనివారికిని, పాషండులకును, రామాయణమును సాక్షాత్తుగా వినుటలో నధికారము లేదు. |
| 64. కిమత్ర బహునోక్తేన<br>పుమాంసో వా స్త్రియోఽపి వా,<br>విశుద్ధా శ్శృణుయు స్సర్వే<br>రామాయణ కథామృతమ్. | 64. వేయేల? పురుషులైనను, స్త్రీలైనను పరిశుద్ధులై యుండియే రామాయణ కథామృతమును వినవలయును. |
| 65. సర్వ స్తరతు దుర్గాణి<br>సర్వో భద్రాణ్యుపైత్వితి,<br>శ్రావయే చ్చతురో వర్ణాన్<br>కృత్వా బ్రాహ్మణ మగ్రత:. | 65. ప్రతివారును ఆపదల నతిక్రమింతురుగాక! ప్రతివారును మంగళముల నందుదురుగాక! యని బ్రాహ్మణులను ముందుగా నిడికొని నాల్గు వర్ణములవారికిని రామాయణమును వినిపింపవలెను. |
| 66. భవగహనగతాగతార్తిభాజాం<br>గతి మితరా మనపశ్యతాం నరాణామ్,<br>రఘువరచరితా దృతేఽస్తి కా వా<br>గతి రిహ సత్య మిదం బ్రవీమి విద్వన్! | 66. సంసారమనెడు ఘోరారణ్యమున పుట్టుట, గిట్టుట యనెడు పీడల ననుభవించుచున్నట్టియు. నితర గతిని గానలేనట్టియు మనుజులకు రఘునాథుని చరితముకన్న నితరమగు గతియే లేదని నేను సత్యము పలుకుచున్నాను. |
| ఇతి<br>శ్రీమత్పారాశర్యే ఉపపురాణే<br>శ్రీరామాయణ మాహాత్మ్యే<br>ద్వితీయోఽధ్యాయ:. | ఇది<br>శ్రీ పరాశర విరచితమగు నుపపురాణము నందలి<br>శ్రీరామాయణ మాహాత్మ్యమున<br>రెండవ యధ్యాయము. |

సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము

# తృతీయోఽధ్యాయః



# మూడవ అధ్యాయము



## శ్రీరామాయణ శ్రవణ విధానం -

## శ్రీరామాయణ శ్రవణ విధానము -

### శ్రీ సనత్కుమార ఉవాచ -

1. అథ తే సంప్రవక్ష్యామి
శ్రవణస్య విధిం మునే!
య దుమాయై మహేశేన
కథితం మునిపుంగవ!

2. కదాచన మహీయస్త్వం
రామాయణమనోః పురా,
శ్రుత్వా గిరిశా త్వప్రచ్ఛ
ప్రణతా తం గిరే స్సుతా.

### శ్రీ సనత్కుమారుడు పలికెను -

1. ఓ మునిశ్రేష్ఠా! పార్వతికి ఈశ్వరునిచే నుపదేశింపబడిన రామాయణ శ్రవణవిధిని నీకు తెలిపెదను.

2. పూర్వము ఒకానొకప్పుడు రామాయణ మహా మంత్రముయొక్క గొప్పతనమును పార్వతి ఈశ్వరునివలన విని ఆయనకు నమస్కరించి అడిగెను.

### పార్వత్యువాచ -

3. భగవన్ సర్వశాస్త్రాణాం
ఉత్తమం పరమేశ్వర!
రామాయణ మహాకావ్యం
ఇతి సంకథితం త్వయా.

4. ప్రబ్రూహి శ్రవణే తస్య
విధాన మవధానతః,
యేనా హ మమృతైవ స్యాం
యస్మిన్ లగ్నం మనో మమ.

### పార్వతీదేవి యడిగెను -

3. పూజ్యుడవగు నో పరమేశ్వరా! నీవు రామాయణ మహాకావ్య మన్ని శాస్త్రములలో నుత్తమ మైనదని చెప్పియున్నావు.

4. దానిని వినుటలోగల విధానమును సావధానముగా తెలుపుము. దానిని వినుటవలన నేను జన్మరాహిత్యమును చెందుదును. దానిని వినుటలో నా మనము లగ్నమైయున్నది.

# శ్రీరామాయణ మాహాత్మ్యమ్

## సంస్కృత మూలమ్

### శ్రీసనత్కుమార ఉవాచ -

5. ఇతి పృష్టస్తు శివయా
భగవాన్ పరమేశ్వర:,
శ్రూయతా మితి చామన్త్ర్య
ప్రహృష్టో వాక్య మబ్రవీత్.

### మహేశ్వర ఉవాచ –

6. శ్రుణు దేవి! ప్రవక్ష్యామి
హృష్టోఽస్మి తవ పృచ్ఛయా,
కృతార్థాఽసి య దుత్పన్నా
తవ రామాయణే మతి:.

7. జన్మాన్తర సహస్రేషు
కృతపుణ్యో మహామనా:,
రామాయణకథాం శ్రోతుం
కశ్చిదేవాఽభివాంఛతి.

8. శుశ్రూషూణాం శతేష్వేక:
శ్రోతు మారభతే పుమాన్,
శ్రోతు మారభమాణేషు
కశ్చిదేవాన్త మృచ్ఛతి.

9. శ్రుతవత్సు యథాశాస్త్రం
కశ్చిదేవ శ్రుణో త్యహో,
తేష్వ ప్యాచార్య మారాధ్య
కృతార్థో భువి దుర్లభ:.

## ఆంధ్రానువాదము

### శ్రీసనత్కుమారుడు పలికెను –

5. అని పూజ్యుడగు ఈశ్వరుడు పార్వతీదేవిచే నడుగబడి సంతసించి వినుమని పలికి యిట్లు తెలిపెను.

### ఈశ్వరుడు పలికెను –

6. దేవీ! నీవిట్లడుగుటవలన సంతసించితిని. తెలిపెదను వినుము. నీకు రామాయణము వినుటకు బుద్ధి కలుగుటచే కృతార్థురాల వైతివి.

7. వేయి జన్మాంతరములయందు పుణ్యము నొనరించిన బుద్ధిశాలియగు నొకానొకడు మాత్రమే రామాయణమును వినగోరుచున్నాడు.

8 అట్లు వినగోరు వందమంది మనుజులలో నొక పురుషుడు మాత్రమే వినుటకు ప్రారంభించును. వినుట కారంభించిన వారిలో నొకడు మాత్రమే దానిని సాంతముగ వినగలుగుచున్నాడు.

9. అట్లు వినినవారిలోగూడ నొకానొకడు మాత్రమే దానిని శాస్త్రనియమానుసారముగ వినుచున్నాడు. వారిలోను రామాయణము నుపదేశించిన యాచార్యుల నారాధించి కృతార్థులైన వారు భూలోకమున దుర్లభముగా నుందురు.

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 10. శృణ్వన్ రామాయణం భక్త్యా<br>యథాశాస్త్రం గురో ర్ముఖాత్,<br>యో గురో రర్పయే దిష్టం<br>తస్య తుల్య స్స ఏవ హి. | 10. ఆచార్యుని ద్వారా యథాశాస్త్రముగ భక్తితో రామాయణమును వినుచు గురువున కభీప్సిత ముల నొసంగు వానికి సాటి యాతడే కాని మరియొకడు కాడు. |
| 11. ఉపావృత్య పరాం విద్యాం<br>ఆచార్యేభ్యో నరర్షభాః,<br>ప్రయచ్ఛన్తీహ యే కామాన్<br>దేవత్వ ముపయాన్తి తే. | 11. ఏ మనుష్యశ్రేష్ఠు లాచార్యునివలన నుత్తమ విద్యను పొంది యా గురువునకు కోరిన వస్తు వుల నిచ్చెదరో వారు దేవత్వము నందుదురు |
| 12. ఆచార్య ముపసంగమ్య<br>సంప్రార్థ్య చ మహామనాః,<br>ప్రసాదయే దభీష్టార్థై<br>శ్శిష్యస్తు శ్రవణోత్సుకః. | 12. రామాయణమును విన నుత్సాహముగల శిష్యుడు మంచిమనస్సుకలవాడై యాచార్యు లను సమీపించి వారి కిష్టవస్తువుల నొసంగి యనుగ్రహింప జేసికొనవలెను. |
| 13. అథాఽఽచార్య శ్శుచి ర్భూత్వా<br>స్నానోపస్పర్శనాదిభిః,<br>ఆదౌ విఘ్నవిఘాతాయ<br>సేనాన్య మభిపూజయేత్. | 13. అంతట నాచార్యులును స్నానాచమనాద్యను ష్ఠానములచే శుచిగా నుండి ప్రారంభమున విఘ్నములను పోగొట్టుకొనుటకై విష్వక్సేనుని పూజింపవలెను. |
| 14. అవిఘ్నం ప్రార్థ్య సేనేశం<br>తతో రామాయణం ముదా,<br>అర్చయే ద్రఘునాథస్య<br>దివ్యాం కీర్తిమయీం తనుమ్. | 14. ఆ విష్వక్సేనుని విఘ్నములు కలుగకుండు టకై ప్రార్థించి యనంతరము శ్రీరామచంద్రుని దివ్యమగు కీర్తిరూపమగు శరీరమనబడు రామాయణమును సంతసమున నర్చించవలెను. |
| 15. యత్ర యత్ర రఘునాథకీర్తనం<br>తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,<br>బాష్పవారి పరిపూర్ణలోచనం<br>మారుతిం చ పురత స్సమర్చయేత్. | 15. ఎచ్చటెచ్చట శ్రీరామచంద్రుడు కీర్తింపబడునో అచ్చటచ్చట ఫాలతలమున చేతులు జోడించి యున్నట్టియు ఆనందాశ్రువులతో నిండిన నేత్ర ములు కల హనుమంతుని ఎదురుగా నర్చిం చవలెను. |

| సంస్కృత మూలమ్. | ఆంధ్రానువాదము. |
|---|---|
| 16. యోఽనభ్యర్చ్య మరుత్పూనుం<br>రామాయణకథాం నరః,<br>పఠేద్వా శ్రుణుయాద్వాపి<br>తస్య రామో న తుష్యతి. | 16. ఏ మనుజుడు హనుమంతుని పూజింపక రామాయణ కథను చదువునో లేక ఆలకించునో యాతని విషయమున రాముడు సంతసింపడు. |
| 17. తస్మా దవశ్యం పురతః<br>పీఠే గన్ధవహాత్మజమ్,<br>పూజయిత్వైవ రామస్య<br>కథాం సంశ్రావయే త్సుధీః. | 17. కావున బుద్ధిమంతుడు ప్రథమమున పీఠమున మారుతాత్మజుడగు హనుమంతుని నిలిపి యర్చించియే శ్రీరామచంద్రుని కథను చక్కగా వినిపించవలెను |
| 18. యదా యదా స్వశిష్యేభ్యో<br>రామవృత్తం వివక్షతి,<br>తదా తదాఽనుసన్దధ్యాత్<br>సమ్యక్ గురు పరంపరామ్. | 18. తన శిష్యులకు శ్రీరామచరితమును చెప్పదలచునపుడెల్ల చక్కగా గురుపరంపరను అనుసంధించవలెను. |
| 19. గురుపఙ్క్తిం ప్రణమ్యైవ<br>మాచార్యాణా మసా వసౌ,<br>విత్యాభగవతో భక్త్యా<br>ప్రారభేతాఽథ తత్కథామ్. | 19. ''ఆచార్యాణా మసావసౌ విత్యా భగవతః'' అను శ్రుతివాక్యము ననుసరించి తన గురువు మొదలు భగవంతుని వరకు నమస్కరించిన పిమ్మటనే రామకథ నారంభించవలెను. |
| 20. పీఠే నిషణ్ణ ఆచార్యః<br>ప్రాఙ్ముఖో వా ప్యుదఙ్ముఖః,<br>ఉదఙ్ముఖాయ శిష్యాయ<br>శ్రావయే త్ప్రాఙ్ముఖాయ వా. | 20. ఆచార్యుడు తూర్పుముఖముగను, శిష్యుడుత్తరముఖముగనుగాని, ఆచార్యుడుత్తరముఖముగను శిష్యుడు తూర్పుముఖముగను గాని, కూర్చుని రామాయణ శ్రవణ మొనరించవలెను. |
| 21. యద్వాఽభిముఖ మాసీనః<br>శిష్యస్తు శ్రుణుయా త్కథామ్,<br>తథాఽఽసీత యథా కర్ణం<br>దక్షిణం ప్రవిశే త్కథా. | 21. లేక శిష్యుడు తనకు గురువుగా రుపదేశించు రామకథ కుడిచెవిలో ప్రవేశించునట్లు ఎదురుగా కూర్చునియైనను వినవలెను. |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 22. పవిత్రం దక్షిణం శ్రోత్రం<br>అహు ర్హరికథాశ్రుతౌ,<br>గంగాద్యఖిలతీర్థాని<br>వసంతి య దిహాఽనిశమ్. | 22 గంగాద్యఖిలతీర్థములును కుడిచెవిలో నెల్లప్పుడు నుండునను ప్రతీతిచే హరికథలను వినుటకు కుడిచెవియే పవిత్రమని చెప్పుదురు |
| 23. శరీరం చైవ వాచం చ<br>బుద్ధీంద్రియమనాంసి చ,<br>నియమ్య ప్రాంజలి స్తిష్ఠే<br>ద్వీక్షమాణో గురో ర్ముఖమ్. | 23. శరీరమును, వాక్కును, బుద్ధిని, ఇంద్రియములను, మనస్సును నియమించి యాచార్యుల ముఖమునే జూచుచు, నమస్కరించుచు కూర్చుండవలెను. |
| 24. నిత్య ముద్ధృతపాణి స్స్యాత్<br>సాధ్వాచార స్సుసంయతః,<br>ఆస్యతా మితి చోక్తస్సన్<br>ఆసీతాఽభిముఖం గురోః. | 24. సేవకుడై సన్నద్ధుడై మంచి యాచారము కలిగి యుండి ఇంద్రియనిగ్రహము కలవాడై యాచార్యులు కూర్చుండుమని చెప్పిన తరువాత వారి కెదురుగా కూర్చుండవలెను. |
| 25. హీనాన్న వస్త్ర వేష స్స్యాత్<br>సర్వథా గురుసన్నిధౌ,<br>ఉత్తిష్ఠే త్ప్రథమం చాస్య<br>చరమం చైవ సంవిశేత్. | 25. గురు సన్నిధానమున నెల్లపుడును అన్న వస్త్ర వేషములలో నిరాడంబరముగ నుండవలెను. ఆచార్యులను మించిన అన్నవస్త్రవేషములు గలిగియుండరాదు. ఆచార్యులకన్న ముందుగా మేల్కొనవలెను. వారు నిద్రించిన పిమ్మట తాను నిద్రించవలెను. |
| 26. ప్రతిశ్రవణసంభాషే<br>శయానో న సమాచరేత్,<br>నాసీనో న చ భుంజానో<br>న తిష్ఠ న్న పరాఙ్ముఖః. | 26. తాను పరుండిగాని, కూర్చుండిగాని, భుజించుచునుగాని, నడచుచునుగాని, వెనుదిరిగియుగాని, గురువుచెప్పినది వినుట, వారితో భాషించుట చేయరాదు. |
| 27. నీచం శయ్యాసనం చాస్య<br>సర్వథా గురుసన్నిధౌ,<br>గురోస్తు చక్షుర్విషయే<br>న యథేష్టాసనో భవేత్. | 27. గురు సన్నిధానమున వారికన్న క్రిందుగా తన యాసనమును, శయ్యను ఉంచుకొనవలెను. ఆచార్యునియెదుట తన కిచ్చవచ్చినటుల కూర్చుండరాదు. |

సంస్కృతమూలమ్ — ఆంధ్రానువాదము

28. నోదాహరే దస్య నామ
పరోక్షమపి కేవలమ్,
న చైవాస్యాఽనుకుర్వీత
గతి భాషితచేష్టితమ్.

28. పరోక్షమునందైనను ఆచార్యుని నామము నుదహరింపరాదు. ఆచార్యుల నడకను, మాటను, చేష్టలను పరిహాసముగ ననుకరింప రాదు.

29. గురో ర్యత్ర పరీవాదో
నిందావాపి ప్రవర్తతే,
కర్ణౌ తత్ర పిధాతవ్యౌ
గంతవ్యం వా తతోఽన్యతః.

29. గురువుయొక్క పరిహాసముకాని, నిందగాని గలుగుచోట తాను చెవులను మూసికొనవలెను. లేనిచో నటనుండి మరియొక స్థలమునకు వెళ్ళి పోవలెను.

30. పరీవాదేన చ ఖరః
శ్వా వై భవతి నిందకః,
పరిభోక్తా స్యాత్తు క్రిమిః
కీటో భవతి మత్సరీ.

30. గురువును పరిహసించినవాడు గాడిదగా పుట్టును. గురువును నిందించినవాడు కుక్కగను, గురువు ధనముతో నక్రమముగా జీవించువాడు చిన్నపురుగుగను, గురువుతో మాత్సర్యముంచుకొనిన పెద్దపురుగులుగను పుట్టును.

31. దూరస్థో నార్చయే దేనం
న క్రుద్ధో నాంతికే స్త్రియాః,
యానాసనస్థ శ్చైవైన
మవరుహ్యాఽభివాదయేత్.

31. దూరముననుండియు, కోపముగానుండియు, స్త్రీసమీపమునను, గురువును నమస్కరించ రాదు. వాహనమునగాని, ఆసనమునగాని తానున్నచో వాటినుండి దిగి గురువును నమస్కరించవలెను.

32. ఏకాక్షరప్రదాతారం
ఆచార్యం యోఽవమన్యతే,
శ్వానయోనిశతం ప్రాప్య
చండాలే ష్వభిజాయతే.

32. ఒక అక్షరముచెప్పిన గురువునైనను నిందించిన నాత డనేకజన్మలు కుక్కగాపుట్టి చండాల జన్మలయందు పుట్టును.

33. యో విష్ణుప్రతిమాకారే
లోహభావం కరోతి చ,
యో గురౌ మానుషం భావం
ఉభౌ నరకపాతినౌ.

33. విష్ణుస్వరూపమగు విగ్రహమును లోహమను తలంపును, గురువునందు సామాన్యమనుష్యభావము కలవా రిరువురును నరకమున బడుదురు.

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 34. ఇన్దీవరదళశ్యామం<br>పద్మపత్రాయతేక్షణమ్,<br>సానుజం సహసీతం చ<br>ధ్యాయన్ రామం దయానిధిమ్. | 34. నల్లకలువరేకులవంటి శరీరకాంతికలిగితామర రేకులవలె విశాలములగు నేత్రములు కలిగి సోదరునితోను, సీతతోను కూడియుండు దయానిధియగు శ్రీరామచంద్రుని ధ్యానించుచు, |
| 35. రామాయణే శ్రూయమాణే<br>చిత్తం నాన్యత్ర యోజయేత్,<br>న చ రాష్ట్రప్రసఙ్గాదీన్<br>ప్రస్తువీత కథాన్తరే. | 35. మనస్సు నితర విషయములయం దుంచక రామాయణమును వినవలెను. రామాయణమును వినునపుడు రాష్ట్రప్రసంగములను చెప్పకొన రాదు. |
| 36. రామాయణస్య మధ్యే తు<br>కథా మన్యాం ప్రసంగతః,<br>కుర్యాద్యది మదా న్మర్త్యో<br>నరకే స వసే ద్ధ్రువమ్. | 36. రామాయణమును వినునపుడు మధ్యలో గర్వముతో ప్రసంగవశమున మరియొక విషయమును ప్రసంగించిన మనుష్యుడు తప్పక నరకమును పొందును. |
| 37. రాఘవస్య కథాం శ్రోతుం<br>భావన్తం నిరుణద్ధి యః,<br>స బ్రహ్మహత్యాసదృశం<br>ఫల మేత్యల్పకర్మణా. | 37. రాఘవుని కథను వినుట కేగువాని నరికట్టు వాడు బ్రహ్మహత్యాసదృశమగు ఫలమును పొందును. |
| 38. న సర్గ మసమాప్యైవ<br>కథాం పరిసమాపయేత్,<br>యద్య స్త్యావశ్యకం కార్యం<br>సర్గాన్తే త త్సమాచరేత్. | 38. సర్గను పూర్తిచేయక కథను ముగించరాదు. అవశ్యమగు పనియేదియేని ఉన్నచో సర్గను పూర్తిచేసియే దానిని నెరవేర్చవలెను. |
| 39. య ఆచరే త్కథావిఘ్నం<br>మార్జారః స భవే ద్ధ్రువమ్,<br>కథాద్వేషీ కల్పశతం<br>విష్ఠాయాం జాయతే క్రిమిః. | 39. కథకు విఘ్నము నాచరించువాడు తప్పక పిల్లిగా పుట్టును. రామకథను ద్వేషించువాడు మలమునందలి క్రిమిగా పుట్టును. |

| సంస్కృత మూలమ్. | ఆంధ్రానువాదము. |
|---|---|
| 40. శృణోతి రామవృత్తం యః<br>శ్రావయేద్వా మహామనాః,<br>యః ప్రేరయతి తౌ నిత్యం<br>యో హ్యేతా వభినన్దతి. | 40. రామాయణమును వినువాడును, వినిపించు బుద్ధిమంతుడును, వారిరువురను కథకై ప్రేరేపించువాడును, వారి నిరువుర నభినందించు వాడును. |
| 41. తాభ్యాం సహ వసేద్యశ్చ<br>తౌ దృష్ట్వా యశ్చ హృష్యతి,<br>సర్వే తే భగవల్లోక -<br>సోపానారోహణోత్సుకాః. | 41. కథను వినువారితోను, చెప్పువారలతోను సహవాసము చేసినవారును, వారిరువురను చూచి సంతసించువారు నందరును మోక్షసామ్రాజ్య సోపానముల నెక్కుట కుత్సాహపూరితులై యుందురు |
| 42. తదుత్సుకై ర్భక్తిరతై రుదారై<br>ర్వినీతినమ్రై ర్విజితేన్ద్రియైశ్చ,<br>శ్రోతవ్య మేత న్నియమేన సద్భి<br>రాఖ్యాన మోజస్క ర మృద్ధికామైః. | 42. కాన రామాయణ కథాశ్రవణమున నాసక్తికలిగి మిక్కిలి భక్తికలవారై, ఉదారులై, వినయము కలవారై, ఇంద్రియనిగ్రహముకలిగిన వారై, తమ యభివృద్ధిని కోరువారు మిక్కిలి మహిమోపేతమగు నీ రామాయణ కథను నియమముతో వినవలెను. |

| | |
|---|---|
| ఇతి<br>శ్రీమత్పారాశర్యే ఉపపురాణే<br>శ్రీరామాయణ మాహాత్మ్యే<br>తృతీయోఽధ్యాయః | ఇది<br>శ్రీ మత్పారాశర్య-ఉపపురాణమున<br>శ్రీ రామాయణ మాహాత్మ్యమున<br>మూడవ అధ్యాయము. |



సంస్కృతమూలమ్

# చతుర్థోఽధ్యాయః



శ్రీరామాయణ పఠనవిధానం -

శ్రీ మహేశ్వర ఉవాచ -

1. అథాచార్యః ప్రసన్నాత్మా
గమ్భీరమధురస్వరః,
తత్తద్వృత్తోచితై ర్భావైః
శ్రోతృ చిత్తం ప్రహర్షయన్.

2. సర్వశాస్త్రార్థమధురాం
రామాయణకథాసుధామ్,
తప ఇత్యాదిమ శ్లోక
మారభ్య శ్రావయే త్ప్రియే.

3. హరిరో మిత్యుపక్రమ్య
తథైవ చ సమాపయేత్,
య దేవం క్రియతే కర్మ
తద్ధి వీర్యోత్తరం భవేత్.

4. సర్గాన్తం ప్రాప్య విరమేత్
న తు మధ్యే కదాచన,
కృతే విరామే మధ్యే తు
తత్సర్గాది పునః పఠేత్.

ఆంధ్రానువాదము

# నాల్గవ అధ్యాయము



శ్రీ రామాయణ పఠన విధానము –

ఈశ్వరుడు పలికెను –

1. అంతట ఆచార్యులు నిర్మలమనస్కుడై గమ్భీరమును మధురము నగు స్వరముతో నాయా వృత్తములకు తగిన భావములతో వినువారి చిత్తమును సంతసపరచుచు,

2. సర్వశాస్త్రార్థములచే మధురమగు రామాయణ కథామృతమును ''తపస్స్వాధ్యాయనిరతం'' అను శ్లోకముతో నారంభించి వినిపింపవలెను.

3. ప్రారంభమునను, అంతమునను "హరిః ఓమ్'' అని పలుకవలెను. అట్లు ప్రారంభించి ముగించినకర్మయే శ్రేయోదాయక మగును.

4 సర్గ చివరవరకు చదువక మధ్యలో నెప్పుడును విరమింపరాదు. అట్లు విరామము కలిగినచో నా సర్గను మొదటినుండియు మరల చదువవలెను.

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 5. శ్రవణాద్యన్తయో శ్శిష్యః<br>సాష్టాంగం ప్రణమే ద్గురుమ్,<br>అప్రణమ్య శ్రుతం సర్వం<br>స్రవత్యేవ న సంశయః. | 5. వినుటకు ప్రారంభించునపుడును, విరమించునపుడును శిష్యుడాచార్యునకు సాష్టాంగముగ నమస్కరింపవలెను. అట్లు నమస్కరింపక వినినదంతయు నశించిపోవుననుటలో సందియము లేదు. |
| 6. ఏకం వా శ్రుణుయా త్సర్గం<br>సర్గా న్ద్విత్రా నథాపి వా,<br>యథాసంభవ మాచార్యాత్<br>శృణుయా దాదరా న్నరః. | 6. మనుజు డాచార్యునివలన నాదరముగా నొక సర్గనుగాని రెండుమూడుసర్గలనుగాని వీలును బట్టి వినవలయును. |
| 7. రామావతారసర్గే తు<br>రామజన్మోత్సవం చరేత్,<br>ఆరాధయే ద్విశేషేణ<br>రామం భాగవతా నపి. | 7. రామావతార ఘట్టమును చదువునపుడు, రామజన్మోత్సవము నాచరించి, రామచంద్రుని భాగవతోత్తములను పూజింపవలెను. |
| 8. క్షీరం చ నవనీతం చ<br>రామాదిభ్యో నివేదయేత్,<br>శుణ్ఠీగుడకషాయం చ<br>తన్మాతృభ్యో విశేషతః. | 8. రామావతారఘట్టమును చదువునపుడు, రామాదులకు పాలు, వెన్న నివేదన చేయవలెను. శొంఠి, బెల్లము మొదలగువాటిచే చేయబడిన కషాయమును కౌసల్యాదులకు విశేషముగా నివేదన చేయవలెను. |
| 9. సీతా వివాహ సర్గే తు<br>సంప్రాప్తేఽతి ప్రయత్నతః,<br>గృహాద్యలంకృతిం కుర్యాత్<br>సుధాగైరిక లేపనైః. | 9. సీతాకల్యాణఘట్టము ననుసంధించునపుడు సున్నము పూతతోను, ఎఱ్ఱమట్టి గీరలతోను ఇండ్ల నలంకరించవలెను. |
| 10. ఉన్నమ్ర ప్రసవోత్తుఙ్గ<br>కదళీస్తమ్భతోరణే,<br>తథా మఙ్గళతూర్యాది<br>నాదితే దివ్యమణ్డపే. | 10. వేలాడు గెలలుగల్గి మిక్కిలి ఎత్తగు అరటిస్తంభములతో నలంకరింపబడినట్టియు, మంగళవాద్యములతో ధ్వనిచేయబడుచున్నట్టియు, |

# శ్రీరామాయణ మాహాత్మ్యమ్

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 11. దివ్యై ర్ధూపైస్సురభితే<br>దివ్యదీపై రలంకృతే,<br>వికీర్ణనానాకుసుమె<br>శుభసమ్భారసంవృతే | 11. చక్కని పరిమళధూపములచే పరిమళించు చున్నట్టియు, దివ్యదీపములచే నలకరింపబడి నట్టియు, అంతటను పుష్పములు చల్లబడి నట్టియు, మంగళవస్తువులచే నిండియున్నట్టి దివ్యమంటపమున, |
| 12. జాంబూనదమయీం రామ<br>ప్రతిమాం సీతయా సహ,<br>కారయిత్వా యథాశక్తి<br>మన్త్రై రావాహ్య రాఘవమ్. | 12. సీతతోకూడిన శ్రీరామచంద్రుని విగ్రహమును యథాశక్తిగా బంగారముచే చేయించి. శ్రీరామచంద్రుని మంత్రములతోనా ప్రతిమ యందావాహనజేసి, |
| 13. నిధాయ పూర్ణకలశే<br>క్షౌమవస్త్రేణ వేష్టితే,<br>మాంగల్యసూత్రప్రముఖై<br>ర్భూషణై రభిభూష్య చ. | 13. పట్టువస్త్రములతో చుట్టబడిన పూర్ణకలశమున దానినుంచి మంగళసూత్రాది భూషణములచే నలంకరించి, |
| 14. తథా పుస్తక మారాధ్య<br>శృణుయా త్తాం కథాం ముదా,<br>ఇయం సీతేతి పద్యస్య<br>ప్రా క్సంపూజ్య యథావిధి. | 14. రామాయణగ్రంథము నారాధించి, యుత్సా హముతో నా కథను వినవలెను ప్రారంభమున "ఇయం సీతా" అను శ్లోకమును యథా విధిగా పూజింపవలెను. |
| 15. వివాహాన్తే పున స్సమ్యక్<br>ఆరాధ్య వినయాన్వితః,<br>లాజైః పుష్పై రక్షతైశ్చ<br>రామం తత్రాఽభిషేచయేత్. | 15. కల్యాణాంతమున మరల చక్కగా సవినయ ముగా 'ఇయం సీతా' అను శ్లోకమును మరల పూజించి పేలాలు, పుష్పములు, అక్షతలచే రామున కభిషేకము చేయవలెను. |
| 16. పతిపత్న్యశ్చ లలనాః<br>దివ్యాలంకారభూషితాః,<br>నీరాజయేయు ర్దానేన<br>మంగళారాత్రికై ర్ముదా. | 16. ముత్తైదువులు మంగళాభరణములచే నలంక రించుకొని, ఆనందముతో మంగళహారతుల నీయవలెను |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 17. సహభార్య మథాఽఽచార్యం<br>నిషాద్య పరమాసనే,<br>వివిధై రుపచారైశ్చ<br>పూజయే చ్ఛిష్య ఆదరాత్. | 17. రామాయణమును వినిన శిష్యుడు ఆచార్య దంపతులను దివ్యాసనమున కూర్చుండబెట్టి వివిధోపచారములచే పూజింపవలెను. |
| 18. తయో రాచార్యదంపత్యో<br>ర్వస్త్రాభరణమాలికాః,<br>ప్రత్యర్ప్య గన్ధాంశ్చ శుభాన్<br>ధూపదీపాదికా నపి. | 18. ఆ ఆచార్యదంపతులను వస్త్రములు, ఆభరణములు, మాలికలు శుభములగు గన్ధ ధూప దీపాదులచే నారాధించి, |
| 19. ప్రతిమాం తాం సకలశాం<br>వస్త్రాభరణభూషితామ్,<br>సదక్షిణాం గురో ర్దద్యాత్<br>శ్రీరామః ప్రీయతా మితి. | 19. వస్త్రములచేతను, ఆభరణములచేతను అలంకరింపబడిన యా ప్రతిమను కలశముతోగూడ 'శ్రీరామచంద్రుడు సంతసించుగాక' యని దక్షిణతోగూడ నాచార్యున కీయవలెను |
| 20. ఆశిషో వాచయిత్వాఽథ<br>బ్రాహ్మణా నభిపూజ్య చ,<br>భోజయే చ్ఛర్కరాపూప<br>పాయసాద్యం రసోత్తరమ్. | 20. ఆశీర్వాదములనంది, బ్రాహ్మణులను పూజించి, మంచిరసవంతమగు పంచదారతోచేసిన అప్పములు పాయసాదులతో భుజింపజేయవలెను. |
| 21. బాలకాండ సమాప్తౌ తు<br>రామం సంపూజ్య భక్తితః,<br>భోజయే ద్వైష్ణవా న్విప్రాన్<br>ఆరాధ్య గురు మాదరాత్. | 21. బాలకాండ సమాప్తియందు భక్తితో శ్రీరామచంద్రుని పూజించి, ఆచార్యుల నాదరముతో నారాధించి, వైష్ణవులను, బ్రాహ్మణులను భుజింపచేయవలెను. |
| 22. అయమేవ విధిః ప్రోక్తో<br>దేవి! కాణ్డాన్తరేష్వపి,<br>శ్రుత్వైవం విదధీత్తై వ<br>విత్తశాఠ్యవివర్జితః. | 22. ఓ పార్వతీ! ఇతర కాండలు చదువునపుడును ఈ పద్ధతియే విధింపబడినది. ధనలోభములేకయిట్లే రామాయాణమును వినవలెను. |

సంస్కృత మూలమ్

ఆంధ్రానువాదము

23. రామలక్ష్మణయో ర్యత్ర
సీతాయా భరతస్య వా,
వర్ణ్యతే శ్రమమూర్ఛాది
తత్ర తత్ర ప్రయత్నతః.

23. శ్రీసీతారామ, లక్ష్మణ, భరతులయొక్క శ్రమగాని, మూర్ఛగాని, ఇతర కష్టములుగాని వర్ణింపబడిన స్థలములలో నతిప్రయత్నముగానైనను,

24. సితాపానీయ మృద్వీకా
నారికేళరసాదికమ్,
యత్తు స్యా చ్ఛీతలం వస్తు
తేభ్య స్తత్తు నివేద్యతామ్.

24. పంచదారపానకము, ద్రాక్షరసము, కొబ్బరినీరు మొదలగు చల్లని వస్తువులను నివేదన చేయవలెను.

25. లంకాదాహాదికం వస్తు
శ్రుత్వా రౌద్రపరం తథా,
ఇదమేవ విధిం కుర్యాత్
రామస్య ప్రీతి మావహన్.

25. మిక్కిలి రౌద్రములగు లంకాదహనము మొదలగునవి వినునపుడు రామునకు ప్రీతిని కలిగించుటకై ఈ విధముగానే చేయవలెను

26. యత్రేంద్రజి త్కుంభకర్ణ
రావణాదివధో భవేత్,
తత్రాఽఽరాధ్యో విశేషేణ
రాఘవ స్సహ లక్ష్మణః.

26. ఇంద్రజిత్, కుంభకర్ణ, రావణాది వధలను చదువునపుడు లక్ష్మణునితోగూడ రాముని మిక్కిలి విశేషముగా నారాధించవలెను.

## శ్రీరామపట్టాభిషేక సందర్భే కర్తవ్యమ్

## శ్రీరామ పట్టాభిషేక సందర్భమున కర్తవ్యము

27. ఏవం సనియమం శ్రుత్వా
సార్థం రామాయణం మనుమ్,
అభిషేకే తు య త్కుర్యాత్
తద్వక్ష్యామి శ్రుణు ప్రియే.

27. ఓ ప్రియమైన పార్వతీ! ఈ విధముగ నియమానుసారముగ రామాయణమహామంత్రమును విని పట్టాభిషేకసమయమున నేమి చేయవలెనో చెప్పెదను వినుము

28. రామాభిషేకసర్గే తు
సంప్రాప్తే సంభ్రమాన్వితః,
సుధాచర్చన సుస్మేరం
నానాగైరిక చిత్రితమ్.

28 శ్రీరామచంద్రుని పట్టాభిషేకసర్గ ననుసంధించునపుడతిశ్రద్ధతో త్వరపడుచు (తన గృహమును) వెల్లవేయుట, ఎఱ్ఱమట్టివేయుట మొదలగు వాటిచేత నలంకరించి,

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 29. గోమయేనోపలిప్యాऽథ<br>భవనం పంచవర్ణకైః,<br>రంగవల్లీ విరచనై<br>రలంకృత్య స్వశక్తితః. | 29. ఆవుపేడచే నలికి పంచరంగులతో తమ శక్త్యను<br>సారముగ ముగ్గులుపెట్టి యలంకరించి. |
| 30. కాలాగురు మహాధూప<br>ధూపితే దర్పణోజ్వలే,<br>ఫలప్రసవగుచ్ఛాఢ్య<br>పూగపోతమనోహరే. | 30. అగరువత్తులు సాంబ్రాణి మున్నగు పరిమళ<br>ద్రవ్యములచే సుగంధితమును, అద్దములవలె<br>ప్రకాశించుచున్నట్టియు, పండ్లు పుష్పముల<br>గుత్తులచేతను పోకమ్రాకులచే మనోహర<br>మైనట్టియు, |
| 31. వ్యాలంబ ఫలపుష్పాఢ్య<br>కదళీస్తమ్భ గుమ్భితే,<br>గారుత్మత మణిచ్ఛాయ<br>చూతపల్లవ తోరణే. | 31. పండ్లతోను, పుష్పములతో నిండిన కదళీస్తంభ<br>ములచే నలంకరింపబడినట్టియు, గరుడపచ్చల<br>కాంతివంటి కాంతిగల మామిడి చిగుళ్ళతో<br>తోరణములు కట్టబడినట్టియు, |
| 32. మృదంగ పణవోన్మిశ్ర<br>వీణావేణు నినాదితే,<br>ఏవంవిధే గృహే శ్రీమాన్<br>ఆరభేత మహోత్సవమ్. | 32. మృదంగము తప్పెటలనాదముతో కలిపిన వీణ,<br>పిల్లనగ్రోవిధ్వనులచే ప్రతిధ్వని చేయబడుచున్న<br>గృహమున ధనాఢ్యుడు మహోత్సవము నారం<br>భింపవలెను. |
| 33. స చతుర్వింశతిపల<br>సువర్ణేన మహామనాః,<br>సీతాలక్ష్మణశత్రుఘ్న<br>భరతాదిభి రన్వితామ్. | 33. బుద్ధిమంతుడగు మనుజుడు ఇరువదినాలుగు<br>పలముల బంగారముతో సీతాలక్ష్మణభరత<br>శత్రుఘ్న హనుమంతులతోగూడిన, |
| 34. శ్రీరామప్రతిమాం దివ్యాం<br>కారయేత్ హనుమద్యుతామ్,<br>తదర్ధేనాऽథ వా కుర్యాత్<br>తత్పాదేనాపి వా ప్రియే. | 34. శ్రీరామవిగ్రహమును చక్కగా చేయించ<br>వలెను. అందుకు శక్తిలేనిచో పండ్రెండు పల<br>ముల బంగారముచేగాని లేక ఆరు పలములచే<br>గాని చేయించవచ్చును. |

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 35. చతుర్వింశత్సువర్ణై ర్వా<br>చతుర్వింశతినిష్కకైః,<br>ప్రమితేన సువర్ణేన<br>దేవి! శుద్ధేన కారయేత్. | 35. దేవీ! ఇరువదినాలుగు కాసులచే కాని, లేక ఇరువదినాలుగు నిష్కముల మంచి బంగారముతో గాని చేయించవలెను. |
| 36. ఉత్తమః ప్రథమః కల్పో<br>మధ్యమ స్స్యాత్తు మధ్యమః,<br>దరిద్రస్యాఽధమః పక్షో<br>నేతో న్యూనం విధీయతే. | 36. ఇరువది నాలుగు పలముల బంగారముచే చేయించుట ఉత్తమము. పండ్రెండు పలములు మధ్యమము. దరిద్రునకే కనిసపక్షము చెప్పబడినది. ఇంతకు తక్కువగా చేయింపరాదు. |
| 37. తా మేతాం సర్వసంభారైః<br>ప్రతిమాం భక్తినమ్రధీః,<br>ఆచార్యాయ నివేద్యాఽథ<br>ప్రార్థయే త్తైవ మాదరాత్. | 37. అట్టి ప్రతిమను సర్వ సంభారములతో సపనయముగ నాచార్యుల కర్పించి యీ క్రిందివిధముగ ఆదరముతో ప్రార్థింపవలెను. |
| 38. శ్రావితో ఽస్మి త్వయా స్వామిన్!<br>రామాయణమహామనుమ్,<br>రామాభిషేకసమయో<br>ప్యాసన్నః కృపయా తవ. | 38. స్వామీ! మీ అనుగ్రహముచే మహామంత్రమగు రామాయణమును వింటిని మీ అనుగ్రహముచే నిపుడు రామాభిషేక సమయ మాసన్న మైనది. |
| 39. కల్పితా స్సర్వసంభారా<br>మయాచ భవదాజ్ఞయా,<br>రామాభిషేక మఖిలం<br>నిర్వర్తయ యథావిధి. | 39. తమ యాజ్ఞచే నాచే సామగ్రులన్నియు నాయత్తపరుపబడినవి. యథావిధిగ రామాభిషేకము నంతయు నిర్వర్తింప జేయుదురు గాక! అని ప్రార్థింపవలెను. |
| 40. అథాఽఽచార్యః శుభదినే<br>ప్రాత ర్నియతమానసః,<br>కృత్వా చ మంగళస్నానం<br>శిష్యై స్సహ శుచివ్రతైః. | 40. అంతట నాచార్యులు మంచిదినమున తెల్లవారుజామున మనోనిగ్రహము కలిగి సదాచారపరాయణులగు శిష్యులతోగూడ మంగళస్నానము నాచరించి |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 41. ధృతోర్ధ్వపుణ్డ్రో విధివత్<br>శుచి ర్విరచితాహ్నికః,<br>ప్రవిశ్య దివ్యభవనం<br>రామార్థే సమలంకృతమ్. | 41. ఊర్ధ్వపుండ్రములు ధరించి యథాశాస్త్రముగ నాచారానుసారముగ దైనందినకృత్యముల నిర్వర్తించి శ్రీరామచంద్రునికై యలంకరించిన దివ్యభవనమున ప్రవేశించి |
| 42. తత్రాఽఽసనే ఽథో పవిశ్య<br>వృణుయా దృత్విజ శ్శుచీన్,<br>నదీనదేభ్య స్సిన్ధుభ్య<br>స్సమాహృత్యాఽమలం జలమ్. | 42. ఆసనముపై కూర్చుండి పరిశుద్ధులగు ఋత్విజులను వరించవలెను. తూర్పుగా ప్రవహించునట్టియు, పడమరగా ప్రవహించునట్టియు నదుల నుండియు సముద్రములనుండియు పవిత్ర జలములను తెప్పించి |
| 43. పవిత్రై రభిమన్త్ర్యాఽథ<br>కుంభే ష్వభ్యర్చయే ద్వి,<br>సౌవర్ణ్యాం ప్రతిమాయాం తు<br>రామ మావాహ్య భక్తితః. | 43 పవిత్రమంత్రములచే నభిమంత్రించి కుంభముల యందు పూజింపవలెను. భక్తితో బంగారు ప్రతిమయందు రాముని ఆవాహన చేసి |
| 44. సింహాసనే మణిమయే<br>స్థాపయే త్తాం యథావిధి,<br>గన్ధై ర్మాల్యైశ్చ ధూపైశ్చ<br>రత్నై శ్చ వివిధై శ్శుభైః. | 44. ఆ ప్రతిమను యథావిధిగ మణిమయ సింహాసనమున ప్రతిష్ఠింపవలెను గంధములచేతను మాలికలచేతను ధూపములచేతను వివిధము లగు మంచి రత్నములచేతను |

**పట్టాభిషేక హోమక్రమః –** | **పట్టాభిషేక హోమవిధానము –**

| | |
| --- | --- |
| 45. ఆరాధయే ద్దాశరథిం<br>ప్రతిమాయాం స వాచకః,<br>అగ్నిం సమిధ్య విధివత్<br>కృత్వా ఽగ్నిముఖ మాదితః. | 45. ఆ ప్రతిమయందు శ్రీరామచంద్రుని ఆచార్యుడు పూజింపవలెను. అగ్నిహోత్రమును యథావిధిగ ప్రజ్వరిల్లజేసి అగ్నిముఖమును మొదటి నుండియు జరిపి |
| 46. సహస్రవారం జుహుయాత్<br>గాయత్ర్యా ఽఽజ్యేన మన్త్రవిత్,<br>తత శ్శ్రీరామగాయత్ర్యా<br>జుహుయా చ్చ సహస్రకమ్. | 46. మన్త్రముల నెఱింగిన యాచార్యుడు నేతితో గాయత్రీమంత్రము నుచ్చరించుచు వేయి మారులును శ్రీరామగాయత్రితో వేయి మారులును హోమము చేయవలెను. |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 47. సంక్షేపసర్గశ్లోకైశ్చ<br>ప్రత్యేకం హోమ మాచరేత్,<br>జయైరపి తథా కర్మ<br>సమృద్ధ్యర్థం విశేషతః. | 47. సంక్షేపసర్గ శ్లోకములతో ప్రత్యేకముగా హోమము నాచరింపవలెను. కర్మసమృద్ధికొరకు జయాదులతోను హోమము నాచరించవలెను. |
| 48. తతః పూర్ణాహుతిం చాపి<br>జుహుయాచ్ఛ్రద్ధయాఽన్వితః,<br>హోమాశక్తా వమీషాం తు<br>జపః కార్యః శుచివ్రతైః. | 48. అంతట శ్రద్ధతో పూర్ణాహుతినిగూడ చేయవలెను. హోమమును చేయజాలనిచో యీ మంత్రములను పరిశుద్ధులై జపించవలెను. |
| 49. హోమద్రవ్యం వైష్ణవాయ<br>దద్యా ద్వా లోభవర్జితః,<br>కర్మచ్ఛిద్రపిధానాయ<br>నామత్రయ మహామనుమ్. | 49. లోభము లేక హోమద్రవ్యమును వైష్ణవున కర్పింపవలయును. కర్మలయందలి దోషములు పోవుటకై మూడుపదములు కలిగినట్టియు మహామంత్రమైనట్టియు, |
| 50. జపేయు ర్ఋత్విజో నామ్నాం<br>సహస్రం రామతారకమ్,<br>రామాభిషేకసర్గం చ<br>శ్రావయే త్తత ఆదరాత్. | 50. శ్రీరామమంత్రమును ఋత్విజులు వేయిమారులు జపించవలెను. అనంతరము రామాభిషేకసర్గ నాదరముతో చదివి వినిపించవలెను. |

| అభిషేకక్రమః — | అభిషేకవిధానము — |
| --- | --- |
| 51. ఆరాధయే ద్రఘుపతిం<br>స్థితం రామాయణాత్మనా,<br>పుష్పై ర్ధూపైశ్చ దీపైశ్చా<br>ఽప్యుపచారై ర్యథాక్రమమ్. | 51. రామాయణ స్వరూపముతోనున్న శ్రీరామచంద్రుని పుష్పములతోను, ధూపదీపములతోను, అర్ఘ్యపాద్యా ద్యుపచారములతోను యథాక్రమముగ ఆరాధించవలెను. |
| 52. అభిషిఞ్చే దథ ర్త్విగ్భి<br>ర్వసవస్త్వేతి రాఘవమ్,<br>సామ్రాజ్యాయేతి మన్త్రేణ<br>తీర్థైః పూర్వాభిమన్త్రితైః. | 52. అంతట ఋత్విజులు 'సామ్రాజ్యాయ' అను మంత్రము నుచ్చరించుచు పూర్వమే అభిమంత్రింపబడిన జలముతో 'వసవస్త్వా' అను మంత్రముచే శ్రీరామచంద్రున కభిషేకమును చేయవలెను. |

| సంస్కృత మూలమ్. | ఆంధ్రానువాదము. |
|---|---|
| 53 ఋత్విగ్భి ర్బ్రాహ్మణై: పూర్వం<br>కన్యాభి ర్మన్త్రిభి స్తథా,<br>యోధై స్సనైగమైశ్చాపి<br>కార్యం రామాభిషేచనమ్. | 53. ఋత్విజుల చేతను బ్రాహ్మణుల చేతను కన్యల చేతను, మంత్రులచేతను, యోధులచేతను, వేదాంతజ్ఞులచేతను రామాభిషేక మాచరింప దగియున్నది. |
| 54 దద్యా దేవ ప్రయత్నేన<br>శ్రోతాఽఽచార్యాయ సాదరమ్,<br>రామనామాంగుళీయాది<br>దానా త్ప్రీణాతి రాఘవ:. | 54. వినువా డత్యాదరముతో నాచార్యున కతి ప్రయత్నముతో సంపాదించియైనను రామనామము గల యంగుళీయాదులను సమర్పింపవలెను. అట్టి దానమువలన శ్రీరామచంద్రుడు సంతసించును. |
| 55. భూదానా ద్భూమితనుజా<br>ధనుర్దానేన లక్ష్మణ:,<br>సౌవర్ణ పాదుకాదానాత్<br>కైకేయ్యానందవర్ధన:. | 55. భూదానమువలన సీతయు, ధనుర్దానమువలన లక్ష్మణుడును, సువర్ణపాదుకల నొసంగుటచే భరతుడును, |
| 56. ఛత్రచామరదానేన<br>శత్రుఘ్న: ప్రీయతే ప్రియే !<br>సౌవర్ణయజ్ఞసూత్రస్య<br>దానా న్మారుతనన్దన:. | 56. ఛత్రచామరముల నిచ్చుటచే శత్రుఘ్నుడును సంతసించెదురు. అట్లే సువర్ణయజ్ఞోపవీత దానముచే హనుమంతుడు సంతసించును. |
| 57. అత్ర భూదానత స్సాక్షాత్<br>చక్రవర్తీ భవే న్నర:,<br>హైమోపవీతదానేన<br>బ్రహ్మలోక ముపాశ్నుతే. | 57. భూదానముచేసిన మనుష్యుడు సాక్షాత్ చక్రవర్తి యగును బంగారు యజ్ఞోపవీతము నొసంగుటచే బ్రహ్మలోకమును పొందును. |
| 58. సర్వేణాఽనేన దానేన<br>తోషయ న్గురు మాదరాత్,<br>కృపయా రామభద్రస్య<br>శాశ్వతీం శ్రియ మృచ్ఛతి. | 58 ఈపైన చెప్పి దానములన్నిటిచేతను గురువును సంతసింపజేయుచు శ్రీ రామచంద్రుని కృపచే శాశ్వతమగు లక్ష్మి నందును. (ఐశ్వర్యవంతుడగును.) |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 59 యథా ప్రీణాతి భగవాన్<br>శిలాదిప్రతిమార్చనాత్,<br>తతోఽపి కోటిగుణితం<br>తుష్యే దాచార్యపూజనాత్. | 59. శిలాదిప్రతిమల నర్చించిన నందుండి భగవంతుడు సంతసించినట్లే ఆచార్యులను పూజించుటవలన అంతకంటె కోటిరెట్లుగా సంతసించును. |
| 60. ఆచార్య స్స హరి స్సాక్షాత్<br>చరరూపో న సంశయః,<br>త మనభ్యర్చ్య కో నామ<br>భగవత్ప్రీతి మావహేత్ | 60. ఆచార్యుడనిన భూలోకమున నవతరించిన సాక్షాత్ శ్రీమన్నారాయణు డనుటలో సందియము లేదు. వారి నర్చింపక భగవత్ప్రీతి కలుగ నేరదు. |
| 61. ఆచార్యం భోజయిత్వా ఽగ్రే<br>దివ్యై రన్నై రభీప్సితైః,<br>బ్రాహ్మణాన్ భోజయే త్పశ్చాత్<br>లడ్డుకాపాయసాదిభిః. | 61. అభీప్సితములగు దివ్యాన్నములచే మునుముంచుగ నాచార్యులను భుజింపజేసి యనంతరము లడ్డులు పాయసము మొదలగువానిచే బ్రాహ్మణులను భుజింపజేయవలెను. |
| 62. వేద్మి నేతః పరం కించిత్<br>భవవారణభేషజమ్,<br>జన్మలాభః పరః పుంసాం<br>రామాయణకథాశ్రుతిః. | 62. రామాయణకథాశ్రవణమువలన మనుజు లుత్తమ జన్మము నందుదురు. ఇట్టి రామాయణ కథా శ్రవణముకంటె సంసారబంధములను పోగొట్టు మరియొక దివ్యౌషధము నెఱుంగనని శివుడు పార్వతితో బల్కెను. |
| ఇతి<br>శ్రీమత్పారాశర్యే ఉపపురాణే<br>శ్రీ రామాయణ మాహాత్మ్యే<br>చతుర్థో ఽధ్యాయః. | ఇది<br>శ్రీమత్పారాశర్య-ఉపపురాణమున<br>శ్రీరామాయణ మాహాత్మ్యమున<br>నాల్గవ యధ్యాయము. |

# శ్రీరామాయణ మాహాత్మ్యమ్

సంస్కృత మూలమ్

## పంచమోఽధ్యాయః

శ్రీమహేశ్వరః –

1. రామాయణస్య మాహాత్మ్యం
శృణు వక్ష్యామి వల్లభే !
వస్తుతః తస్య మాహాత్మ్యం
వక్తుం కో నామ శక్నుయాత్ ?

2. రామాయణైకవర్ణస్య
శ్రవణా త్తత్ఫలం లభేత్,
యత్ఫలం లభతే మర్త్యః
కోటిశో భూప్రదక్షిణాత్.

3. రామాయణమహాపుణ్య
కథా యత్ర ప్రవర్తతే,
తతోఽపి యోజనశతం
పవిత్ర మితి గద్యతే.

4. చరితం రఘునాథస్య
శతకోటి ప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం
మహాపాతకనాశనమ్.

ఆంధ్రానువాదము

## అయిదవ అధ్యాయము

శ్రీమహేశ్వరుడు చెప్పుచున్నాడు –

1. ప్రియమైన పార్వతీ ! రామాయణ మాహాత్మ్యమును చెప్పెదను వినుము. కాని రామాయణ మాహాత్మ్యము నున్నదాని నున్నట్లుగ జెప్పుట కెవరు సమర్థులగుదురు ?

2. రామాయణమునందలి యొక యక్షరమును వినినను మనుజుడు కోట్లకొలది పర్యాయములు భూప్రదక్షిణము నొనర్చిన ఫలము నందగలుగును.

3. రామాయణముయొక్క పుణ్యకథ జరుగు స్థలమునుండి శతయోజనములవరకు నా ప్రదేశమంతయు పవిత్ర మనియే చెప్పబడుచున్నది.

4. శ్రీరామచంద్రుని చరిత మనేకకోట్ల విస్తారమైనది. రామాయణమునందలి యక్షరము నొకదాని నుచ్చరించిన నది మహాపాతకములను పారద్రోలును.

## శ్రీరామాయణ మాహాత్మ్యమ్

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 5. న వేదై ర్న తపోభి స్సా<br>న తీర్థాచరణైరపి,<br>న యజ్ఞై రశ్వమేధాద్యై<br>ర్న కృచ్ఛ్రాదివ్రతై రపి | 5 వేదములచేగాని, తపస్సులచేగాని, తీర్థయాత్రలచేగాని, అశ్వమేధాది యజ్ఞములచేగాని, కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతములచేగాని, |
| 6. రామాయణైకశ్లోకస్య<br>శ్రవణా ద్యా గతి స్మృతా,<br>శపే శ్రీరామపాదాభ్యాం<br>సత్యం జానీహి మే వచః. | 6. రామాయణమునందలి యొక శ్లోకమునువినుటవలన పొందు నుత్తమగతిని పొందజాలరని తెలుపబడుచున్నది. నేను శ్రీరామచంద్రచరణకమలములపై నొట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. నామాటలను నిజమని నమ్ముము. |
| 7. రామాయణే వక్ష్యమాణే<br>య స్త్వాగచ్ఛతి భక్తితః,<br>స నరో లభతే కోటి<br>గంగాస్నానఫలం ధ్రువమ్. | 7. రామాయణ కాలక్షేపము జరుగుచుండగా భక్తితో నచ్చటికి వచ్చిన మనుష్యుడు కోటి గంగాస్నానములు చేసిన ఫలమును తప్పక పొందును. |
| 8. బ్రహ్మహత్యా సహస్రాణి<br>వీరహత్యాశతాని చ,<br>స్వర్ణస్తేయ సురాపాన<br>గురుతల్పాయుతాని చ. | 8. వేలకొలది బ్రహ్మహత్యలవలన కలుగు పాపములును, బంగారమును దొంగలించుటవలన కలుగు పాపములును, కల్లు త్రాగుటచే సంభవించు పాపములును, గురువుగారి పాన్పుపై పవళించిన పాపములును |
| 9. కోటికోటిసహస్రాణి<br>ఉపపాతకజా న్యపి,<br>సర్వాణ్యపి ప్రణశ్యన్తి<br>రామచంద్రస్య కీర్తనాత్. | 9. వేలకొలది కోట్లకొలది యుపపాతకము లాచరించుటవలన కలుగు పాపముల నన్నియును శ్రీరామచంద్రుని స్తుతించుటచే పూర్తిగా నశించిపోవుచున్నవి. |
| 10. ఇత్థం రామోపనిషది<br>శ్రూయతే కంఠతః ప్రియే,<br>నేతః పరతరం కించిత్<br>పశ్యామి విమృశ న్నపి. | 10. ప్రియురాలా! ఇట్లు రామోపనిషత్తునందు స్పష్టముగా వినిపించుచున్నది. పాపములు నశించుట కింతకన్న వేరుపాయ మెంత విమర్శించి చూచినను కానరాకున్నది. |

**సంస్కృత మూలమ్** | **ఆంధ్రానువాదము**

11. సకామో భోజనా త్పూర్వం
నరో రామాయణం పఠేత్,
పూర్వం పరం వా నిష్కామో
యథేష్టనియమా త్పఠేత్.

11. కోరికలనుకోరి రామాయణమును పఠించునరుడు భోజనము చేయకముందే రామాయణమును పారాయణ చేయవలెను. కోరికలు కోరనిచో భోజనమునకు ముందైనను భోజనానంతరమున నైనను తనకిచ్చవచ్చిన నియమానుసారముగ పారాయణము చేయవచ్చును.

12. రామాయణస్య శ్లోకం వా
పాదం వా పద మేవ వా,
భుక్త్యన్తేషు ప్రయుంజానో
బ్రహ్మభూయాయ కల్పతే.

12. శ్రీమద్రామాయణశ్లోకమునుగాని యాశ్లోకము నందని పాదమునుగాని లేక యొకపదమును గాని భోజనాంతమున చదివినచో నా మనుజుడు మోక్షమునందుటకుతగుచున్నాడు.

13. శృణ్వన్ రామాయణం భక్త్యా
యః పాదం పదమేవ వా,
స యాతి బ్రహ్మణః స్థానం
బ్రహ్మణా పూజ్యతే సదా.

13. రామాయణమును భక్తితో వినినను (అందకు తగిన సామర్థ్యములేనిచో) శ్లోక పాదమునుగాని లేక పాదమునందలి యొకపదమునుగాని వినినను మనుష్యుడు బ్రహ్మపదవినొంది బ్రహ్మచే నెల్లపుడు పూజింపబడును.

14. భక్త్యా రామస్య యే చే మాం
సంహితాం ఋషిణా కృతామ్,
లేఖయన్తీహ చ నరాః
తేషాం వాసః త్రివిష్టపే.

14. వాల్మీకిమహర్షి కృతమగు నీ రామాయణకథను భక్తితో వ్రాయించు మనుష్యులు స్వర్గలోకము నందుదురు.

15. దదతే సంహితాకోశం
యే రామప్రీత్యభీప్సవః,
తేషాం కరతలే ష్వస్తి
తద్విష్ణోః పరమం పదమ్

15. శ్రీరామచంద్రుని యనుగ్రహమును కోరుచు రామాయణగ్రంథము నెవరు దానముచేయు దురో వారికి మోక్షసామ్రాజ్యము కరతలా మలకమై యుండును.

16. ఇదం మహచ్ఛాస్త్ర మితో ఽన్యదార్థం
ఉక్తా స్సమస్తా ఇహ పూరుషార్థాః,
రామాయణాఖ్యం నను కావ్యరత్నం
పఠే దజస్రం శృణుయా చ్చ విద్వాన్.

16. ఈ రామాయణము గొప్ప శాస్త్రము. తక్కిన శాస్త్రములన్నియు నర్థప్రధాన శాస్త్రములు మాత్రమే. ఈ రామాయణమున సమస్త పురుషార్థములును జెప్పబడినవి. బుద్ధిమంతు డెల్లపుడును రామాయణమనునీకావ్యరత్నమును చదువుచుండవలెను లేదా వినుచుండవలెను.

ఇతి శ్రీమత్పారాశర్యే ఉపపురాణే
శ్రీరామాయణమాహాత్మ్యే పఞ్చమోఽధ్యాయః

ఇది శ్రీమత్పారాశర్యోప పురాణమున
శ్రీ రామాయణ మాహాత్మ్యమున నైదవ అధ్యాయము.

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| **షష్ఠోఽధ్యాయః** | **ఆరవ అధ్యాయము** |




**శ్రీరామకోటి లేఖన విధానమ్ -**

**శ్రీరామకోటి వ్రాయు పద్ధతి -**

**పార్వ త్యువాచ -**

1. భగవన్ య త్త్వయా ప్రోక్తం
రామనామవిలేఖనమ్,
ఇచ్ఛా మ్యస్య విధిం శ్రోతుం
కృపయా మమ త ద్వద.

**పార్వతి యడిగెను –**

1. పూజ్యుడగు శంకరునిజూచి "ఓ పూజ్యుడా! రామనామమును వ్రాయుటనుగూర్చి చెప్పితివి. దానిని వ్రాయునపుడు పాటింపవలసిన విధిని వినగోరుచున్నాను. దయతో నాకు దానిని తెలుపుమని పార్వతి యడిగెను.

**శ్రీ మహేశ్వర ఉవాచ -**

2. విధిం తే సంప్రవక్ష్యామి
రామనామవిలేఖనే,
సర్వపాపప్రశమనం
సర్వశ్రేయః సమృద్ధిదమ్.

**ఈశ్వరుడు తెలిపెను –**

2. పాపములన్నిటిని పారద్రోలునట్టియు, సర్వ శ్రేయములను సమృద్ధిగ నిచ్చునట్టియు రామ నామమును వ్రాయుటయందలి విధిని తెలిపెదను.

3. నామలేఖన మాహాత్మ్యం
శ్రుత్వా ఽఽచార్యాత్ శుచివ్రతాత్,
శుభే ఽహ్న్యదితినక్షత్రే
లేఖనోపక్రమం చరేత్.

3. మునుముందుగ పరిశుద్ధమగు నాచార వ్యవహారములుగల యాచార్యునివలన రామనామ లేఖన మాహాత్మ్యమును విని పునర్వసు నక్షత్ర యుక్తమగు శుభదినమున వ్రాయుట కారంభింపవలెను.

4. నిర్వ ర్త్య నిత్యకర్మాణి
పూర్వాహ్ణే ప్రాఙ్ముఖ శ్శుచిః,
ప్రణమ్య రామం సంకల్ప్య
లిఖే న్నియత మానసః.

4. నిత్యకృత్యముల నన్నిటిని చక్కగా నిర్వర్తించి పూర్వాహ్ణ సమయమున తాను శుచియై తూర్పుముఖముగ కూర్చుండి రామచంద్రుని స్మరించి నమస్కరించి మనోనిగ్రహము కలిగి యుండి వ్రాయవలెను.

సంస్కృత మూలమ్

5. రామాయ నమ ఇత్యేతత్
ఆదౌ శ్రీశబ్దపూర్వకమ్,
ధ్యాయ న్నామం లిఖే న్మంత్రం
శ్రీమ ద్రామషడక్షరమ్.

6. ఏవం శతం సహస్రం వా
లిఖే న్నియమపూర్వకమ్,
శతస్యాన్తే శతస్యాన్తే
శ్రీరామ శ్శరణం మమ.

7. ఇమ మష్టాక్షరం మన్త్రం
లిఖిత్వైవ సమాపయేత్,
శతం వా ఽపి సహస్రం వా
నియమా త్ప్రతివాసరమ్.

8. పూర్వాహ్ణ ఏవ విలిఖేత్
ధ్యాయన్ రామపదాంబుజమ్,
తాని నామా న్యథాభ్యర్చ్య
భుంజీ తైత న్నివేదితమ్.

9. ఆకోట్యాలక్ష మపి వా
లిఖే దుద్యాపయే త్తతః,
ఆపదా మపహర్తారం
దాతారం సర్వసంపదామ్.

10. లోకాభిరామం శ్రీరామం
భూయో భూయో నమామ్య హమ్,
ఇత్యా పదుద్ధర్తృమనుం
సర్వ సంపత్సమృద్ధిదమ్.

ఆంధ్రానువాదము

5. ప్రథమమున శ్రీరాముని ధ్యానించుచు ''శ్రీరామాయ నమః'' అను రామషడక్షరిని వ్రాయవలెను.

6. ఈ విధముగా నూరుపర్యాయములుగాని వేయిపర్యాయములుగాని నియమముగా వ్రాయవలెను. ప్రతి నూటికి చివర ''శ్రీరామ శ్శరణం మమ'' అను

7. శ్రీరామాష్టాక్షర మంత్రమును వ్రాసియే సమాప్తి చేయవలెను. ప్రతిదినమును నూరు పర్యాయములుగాని వేయి పర్యాయములుగాని నియమానుసారముగ

8. శ్రీరామచంద్రుని పాదపద్మములను ధ్యానించుచు పూర్వాహ్ణముననే (ఉదయమందే) వ్రాయవలెను. అనంతరము యథాశక్తిగ నా నామములను పూజించి వాటికి నివేదించిన పదార్థమును భుజింపవలెను.

9. కోటిపర్యాయములుగాని లక్షపర్యాయములు గాని వ్రాసినయనంతర ముద్యాపన చేయవలెను. ఆపదలను బాపునట్టియు, సర్వసంపదల నొసంగునట్టియు

10. లోకముల కానందము నొనగూర్చునట్టి శ్రీరాముని మాటిమాటికి నమస్కరించుచున్నాను. అను ఆపదలనుండి యుద్ధరించునట్టియు సర్వ సంపదలను సమృద్ధిగ నిచ్చునట్టి మంత్రమును

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 11. సహస్రాన్తే సహస్రాన్తే<br>విలిఖే ల్లేఖకో జనః,<br>శ్రీరామ రామ రామేతి<br>లిఖే త్సప్తాక్షరీం తు వా. | 11. ప్రతి వేయి నామములు వ్రాసిన తరువాత రామ నామమును లిఖించు జనులు వ్రాయవలెను. లేక "శ్రీరామ రామరామ" యను శ్రీరామ సప్తాక్షరినైనను వ్రాయవలెను. |
| 12. ఉక్తేనైవ ప్రకారేణ<br>య స్స ముచ్యేత బన్ధనాత్,<br>శ్రీరామేతి త్ర్యక్షరం వా<br>మహాపాతక నాశనమ్. | 12. ఈ చెప్పిన ప్రకారముగ నాచరించినవారు సంసారబంధమునుండి విముక్తు లగుదురు. శ్రీరామ యను మూడక్షరములుగల మంత్ర మైనను మహాపాతకముల నశింపజేయును. |
| 13. లిఖ న్మను మవాప్నోతి<br>యథోక్తవిధినా ప్రియే!<br>యథో ద్దిష్టం సమాప్తే తు<br>రామనామ విలేఖనే. | 13. ప్రియమైన పార్వతీ! ఈ మంత్రమును శాస్త్రోక్త ప్రకారముగ లిఖించిన తాను కోరిన కోరికలను పొందుచున్నాడు. రామనామమును వ్రాయుట ముగించునపుడు |
| 14. శ్రుత్వా రామాయణకథాం<br>పూర్వోక్తవిధినా ఽఽదరాత్,<br>శతాంశం వా దశాంశం వా<br>కృత్వా ఽగ్ని ముఖ మాదితః. | 14. పూర్వము చెప్పినటు లాదరముతో రామాయణ కథను విని తొలుత నూరవ వంతుగాని పదవవంతుగాని యగ్నిని వ్రేల్చి |
| 15. స్వాహాన్తయా షడక్షర్యా<br>హ్వాజ్యేన జుహుయా త్తతః,<br>రామస్య ప్రతిమాం హైమీం<br>సింహాసన నిషాదితామ్. | 15. 'స్వాహా' కారము అన్తమందుగల షడక్షరి నుచ్చరించుచు నేతితో హోమము చేయవలెను. సింహాసనమునందుంచబడిన బంగారు రామ విగ్రహమును |
| 16. ప్రదద్యా ద్గురవే దివ్యాం<br>భోజయే ద్బ్రాహ్మణా నథ,<br>ఐహికాముష్మికీ స్సిద్ధీ-<br>ర్లభతే నాఽత్ర సంశయః | 16. ఆచార్యునకొసంగి యనంతరము బ్రాహ్మణులను భుజింపజేయవలెను. దీనివలన నిహపరసుఖ ముల నందగలుగుననుటలో సందియములేదు. |

సంస్కృత మూలమ్ — ఆంధ్రానువాదము.

17. దేహావసానే ప్రాప్నోతి
త ద్విష్ణో: పరమం పదమ్,
శ్రీరామచరణాంభోజ -
శరణాగతి తత్పర:.

17. శ్రీరామచంద్ర పదపంకజముల నాశ్రయించుట యందు తత్పరుడై శరీరమును విడచిన పిమ్మట విష్ణుపదసామ్రాజ్యము నందును.

18. అత్రా చార్యో భవే ద్దేవి !
నాఽన్య స్సంకీర్ణధర్మవాన్,
శ్రీరామాయణసారజ్ఞ:
శ్రీరామార్చన తత్పర:.

18. శ్రీమద్రామాయణసారమును చక్కగా నెఱిఁగిన వాఁడును శ్రీరామచంద్రుని పూజయం దాసక్తి కలిగినవాడైన పురుషుడే ఆచార్యుడు కాదగి యున్నాడు. కాని నానా దైవతభక్తుడు ఆచార్యుడు కానేరడు.

19. అత్రా ఽఽచార్య శ్చ శిష్య శ్చ
భవే న్నా ఽన్యపరాయణ:,
విష్ణో ర్నామ్నాం సహస్రస్య
పఠనం కురు సర్వదా.

19. ఆచార్యుడుగాని శిష్యుడుగాని యితర దైవములయం దాసక్తి కలిగినవారు కారాదు. నీవు ఎల్లప్పుడును విష్ణుసహస్రనామములనే పఠింపుము.

20. లిఖిత్వా రామనామాని
నియతం మోక్ష్యసే ఽంహస:,
నామ్నో ఽస్తి యావతీ శక్తి:
పాపనిర్మూలనక్షమా.

20. ఓ పార్వతీ ! రామనామమును వ్రాసినచో తప్పక పాపములనుండి విడివడుదువు. పాపముల నిర్మూలించునట్టి శక్తి రామనామ మంత్రమున కెంతయున్నదో

21. తావ త్కర్తుం న శక్నోతి
పాతకం పాతకీ జన:,
తపాంసి యజ్ఞా: క్రతవ:
తీర్థా న్యనశనం తథా.

21. అంతటి పాపముల నెట్టిపాపియును చేయజాలడు. తపములును, యజ్ఞములును, క్రతువులును, పుణ్యతీర్థములును, ఉపవాసములును

22. రామమన్త్రస్య నార్హన్తి
కలాం కోటితమా మపి,
రామనామ లిఖిత్వా చ
శ్రుత్వా రామాయణం తత:.

22. రామమంత్రమునకు కోటియంశమునకును సరిరావు. రామనామమును వ్రాసినను అట్లే రామాయణమును వినినను

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 23. స్త్రియో వైశ్యా శ్చ శూద్రా శ్చ<br>సర్వే యాన్తి పరాం గతిమ్,<br>ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞై:<br>త్రేతాయాం ద్వాపరే ఽర్చయన్. | 23. స్త్రీలైనను వైశ్యులైనను శూద్రులైనను సరియే అందరును ఉత్తమగతి నందజాలుదురు. కృతయుగమున తపస్సుచేతను త్రేతాయుగమున యజ్ఞములు చేయుటవలనను ద్వాపరయుగమున పూజలచేతను |
| 24. య దాప్నోతి తదాప్నోతి<br>కలౌ హరికథామృతాత్,<br>విపదుత్తరణం ప్రేప్సు:<br>సంపదాం సంగ్రహం తథా. | 24. ఎట్టిఫలమును బడయజాలుదురో అట్టి ఫలమును కలియుగమున హరికథామృతమువలన పొంద వచ్చును ఆపదలనుండి విముక్తుడు కావలయు నన్నను ధనధాన్యసమృద్ధిని కోరియున్నను |
| 25. శ్రీమత్సుందరకాండస్య<br>సప్తసర్గం పఠేత్తు వా. | 25. శ్రీమద్రామాయణమునందలి శ్రీ సుందరకాండ యందుగల సప్తసర్గలను చదువవలెను. అని ఈశ్వరుడు తెలుపగా పార్వతి మరల నడిగెను. |
| సుందకాండసప్తసర్గపారాయణ విధి: - | సుందరకాండ సప్తసర్గ పారాయణ విధానము - |
| **శ్రీపార్వత్యువాచ -** | **పార్వతి పలికెను -** |
| 26. కథం సుందరకాండస్య<br>సప్తసర్గం పఠే న్నర:,<br>విధానం తస్య మే బ్రూహి<br>కృతార్థా స్యా మహం ప్రభో ! | 26. ప్రభూ! సుందరకాండయందలి సప్తసర్గ పారాయణ మెట్లు చేయవలయునో దాని విధానమునంతయు నాకు తెలుపుము. నేనువిని కృతార్థురాల నగుదును. అని యడుగగా |
| **శ్రీమహేశ్వర ఉవాచ -** | **ఈశ్వరుడు తెలిపెను -** |
| 27. త్రివర్గఫలకామేన<br>విపదుత్తరణేచ్ఛునా,<br>శ్రీమత్సుందరకాండస్య<br>పాఠ: కార్యో విజానతా. | 27. ధర్మార్థకామములను బడయగోరినను ఆపదల నుండి విముక్తుడు కావలయునన్నను ప్రాజ్ఞుడు సుందరకాండను పఠింపవలెను. |
| 28. శాన్తికర్మణి సర్వత్ర<br>తథా దుస్స్వప్నదర్శనే,<br>గ్రహపీడాసు చోగ్రాసు<br>రోగేషు విషమేషు చ. | 29. ఏపనికైనను శాంతి జరుపుకొనవలయునన్నను, దుస్స్వప్నములు వచ్చినను, భయంకరములగు గ్రహములు పీడించుచున్నను, క్రూరరోగములు కలిగినను, |

సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము

29. అరణ్యే ప్రాంతరే వాపి
శస్త్రచోరాగ్నిపీడనే,
సర్వా స్వాపత్సు ఘోరాసు
నై తస్మా త్తారకం పరమ్.

29. అరణ్యమునకాని దూరమైన నిర్జనమైన మార్గమునందుకాని ఆయుధములవలన, దొంగలవలన, అగ్నివలన నేయాపద సంభవించినను, భయంకరమగు ఆపదలలోను రక్షకము సుందరకాండ పారాయణము తక్క నితరమేదియును కానరాదు.

30. శ్రీమత్సున్దరకాండస్య
సప్తసర్గ్యభిపాఠతః,
మహారాజ్యాదిసంపత్తి
ర్లభ్యతే దుర్లభా ఽపి వా.

30. శ్రీమద్రామయణ సుందరకాండము యొక్క సప్తసర్గపారాయణచే మహారాజ్యాదిసంపద లెంతటి దుర్లభములైనను పొందగలుగుచున్నాడు.

31. ఆయుష్కామో లభేతా ఽఽయుః
ధనకామో ధనాన్యపి,
శ్రీకామః శ్రియ మాప్నోతి
క్షితికామ స్తథా క్షితిమ్.

31. ఆయుర్దాయమును గోరినవా రాయువును, ధనము నభిలషించువారు ధనమును, సంపద నభిలషించువారు సంపదలను భూమిని కాంక్షించువారు భూమిని,

32. విద్యాకామ స్తథా విద్యాం
స్త్రీకామ శ్చ తథా స్త్రియమ్,
ఆరోగ్యకామ స్త్వారోగ్యం
సప్తసర్గ్యభిపాఠనాత్.

32. విద్యను బడయగోరువారు విద్యను, స్త్రీని కోరువారు స్త్రీని, ఆరోగ్యమును పొందగోరువారు ఆరోగ్యమును సుందరకాండయందలి సప్తసర్గపారాయణముచే పొందగలుగుచున్నారు.

33. యదా యదా హి రామస్య
వృత్తం పిపఠిషే ద్బుధః,
తదా తదా తు ధర్మాత్మే
త్యేతన్మూలమనుం జపేత్.

33. రాముని చరితమును చదువగోరు బుద్ధిమంతులు రామాయణ పారాయణావసరమున 'ధర్మాత్మా సత్యసంధశ్చ' అను మూలమంత్రమును చదువవలెను.

34. శ్రీరామచరణాంభోజ
ద్వన్ద్వం ధ్యాయన్ ప్రసన్నధీః,
సకృదేవేతి చరమ
శ్లోకం చ శుభదం జపేత్.

34. నిర్మలమనస్కుడై శ్రీరామచరణకమలములను ధ్యానించుచు శుభప్రదమగు "సకృదేవ ప్రపన్నాయ" అను చరమశ్లోకమును చదువవలెను.

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 35. అనయో ర్మంత్రయో: కో ను<br>మాహాత్మ్యం వేత్తి వల్లభే!<br>అన్యత్ర జానకీనాథాత్<br>అన్యత్ర చ హనూమత:. | 35. ప్రియమగు నో పార్వతీ! ఈరెండు మంత్రముల యొక్క మాహాత్మ్యమును శ్రీరామచంద్రుడును, హనుమంతుడును తెలిసికొన జాలుదురేకాని యితరులు తెలియజాలరు. |
| 36. శుభే ఽహ్ని శుభనక్షత్రే<br>సంకల్ప్యో పక్రమే ద్బుధ:,<br>పాఠం సుందరకాండస్య<br>స ప్తసర్గ్యా: యథావిధి. | 36. తెలివిగలవాడు మంచితిథియందు శుభనక్షత్ర మున సంకల్పించి సుందరకాండయందలి సప్తసర్గ పారాయణను యథావిధిగ ప్రారంభింప వలెను. |
| 37. సప్తసర్గీ మనుదినం<br>పఠే న్నియమపూర్వకమ్,<br>పౌన:పున్యేన తం కాండం<br>యావత్కాణ్డ స్సమాప్యతే. | 37. ప్రతిదినమును నియమానుసారముగ ఏడేసిసర్గ లును మరలమరలకాండము పూర్తియగువరకు చదువవలెను. |
| 38 అన్యూనానతిరిక్తం తు<br>కాండా న్తే సప్తసర్గకా:,<br>సమాప్యన్తే యథా దేవి!<br>తదా విప్రాంశ్చ భోజయేత్. | 38. కాండము పూర్తియగునప్పటికి సర్గలు తక్కువగా గాని అధికముగాగాని యుండరాదు. అట్లు పూర్తిచేసినతరువాత బ్రాహ్మణుల కన్న దానమును చేయవలెను. |
| 39. సర్గసంఖ్యై ర్దినై స్తత్తు<br>పూర్యతే నాన్యథా ప్రియే!<br>ఏకం పారాయణం హ్యేతత్<br>సప్తసర్గ్యా శ్శుచివ్రతే! | 39. ౧౦ దరువదియెనిమిది సర్గలు కలవు. కావున అరువది యెనిమిది దినములకు నీపారాయణ పూర్తియగునుగాని మరియొకవిధముగ గాదు. మంచిప్రవర్తనగల పార్వతీ! ఇట్లు సప్తసర్గ పారాయణము మొక్కటి యగును. |

| మహాస ప్తసర్గపారాయణమ్ - | మహాస ప్తసర్గపారాయణము - |
|---|---|
| 40. సప్తకృత్వ: పఠే దేవం<br>తన్మహా సప్తసర్గకమ్,<br>భోజయే ద్బ్రాహ్మణా నన్తే<br>నియమా త్సర్గసంఖ్యయా. | 40. ఈ విధముగా నాసప్తసర్గల నేడుపర్యాయములు చదివిన నది మహాసప్తసర్గపారాయణమనబడును. పారాయణాంతమున సర్గల సంఖ్యానుసారముగ బ్రహ్మణులను భుజింపజేయవలెను. |

## సంస్కృత మూలమ్

41. ఏవం పఠన్ పాఠయన్వా
దుర్గా ణ్యతితరే దసౌ,
లభతే ఽభీప్సితా న్కామాన్
సర్వా నేవ న సంశయః.

42. పాఠనే ప్రతిపాఠం తు
సప్తనిష్కా తు దక్షిణా,
వాచకాయ ప్రదేయా స్యాత్
వస్త్రమాల్యానులేపనైః.

43. మహత్యాం సప్తసర్గ్యాం తం
సమాప్త్యా మనుక్రమాత్.
సువర్ణాన్ సర్గసంఖ్యాకాన్
దద్యా దాదృత్య దక్షిణామ్.

44. ఇత్యేత త్కథితం దేవి
యత్పృష్టో ఽహ మిహ త్వయా,
ధ్రియతాం హృదయే సాధు
కి మన్య చ్ఛ్రోతు మిచ్ఛసి ?

ఇ తి
శ్రీమత్పారాశర్యే ఉపపురాణే
శ్రీ రామాయణ మాహాత్మ్యే
షష్ఠో ఽధ్యాయః.

## ఆంధ్రానువాదము

41. ఈ విధముగ పారాయణమును చేసినవారుగాని పారాయణ చేయించినవారుగాని యాపదల నతిక్రమించి తమ కిష్టమగు సమస్తమగు కోరికలను పొందుదురనుటలో సందియములేదు.

42. ప్రతి ఆవృత్తికిని పాఠకునకు వస్త్రములు పూలమాలలు చందనములతో ఏడు నిష్కములు బంగారమును దక్షిణగా సమర్పింపవలెను.

43. మహా సప్తసర్గ పారాయణ సమాప్తియగునపుడు క్రమానుసారముగ సర్గసంఖ్యలను లెక్కించి సాదరముగ (68) సువర్ణములను దక్షిణను సమర్పింపవలెను.

44. ఓ పార్వతీ! నీ వడిగినదానికిట్లు తెలిపితిని. దీనిని చక్కగా మనస్సున జ్ఞాపక ముంచుకొనుము. ఇంకను నీ వేమి వినదలచియుంటివో యడుగు మని పరమేశ్వరుడు పార్వతి నడిగెను.

ఇ ది
శ్రీమత్పారాశర్య-ఉపపురాణమున
శ్రీరామాయణ మాహాత్మ్యమున
ఆరవ యధ్యాయము.

సంస్కృత మూలమ్

# సప్తమోఽధ్యాయః

అశక్తానాం శ్రీరామాయణపారాయణ విధానమ్

1. ధన్యా స్మ్యనుగృహీతా స్మి
య ద్రామాయణ వైభవమ్,
కృపయా శ్రావితా స్మ్యద్య
సర్వజ్ఞేన త్వయా విభో !

2. రాజా వా రాజతుల్యో వా
ధనికో యస్తు కశ్చన,
తేన శక్య మిదం కర్తుం
యత్ప్రోక్తం భవతా ప్రభో !

3. ధనినాం సులభా హ్యేషా
రామాయణకథా శ్రుతిః,
అకిఞ్చనైః కథం లభ్యా
శ్రోతుకామైస్తు మానుషైః.

4. రాఘవాఽఽచార్యవిప్రాణాం
అర్చనౌపయికం ధనమ్,
అకిఞ్చనై రసులభం
దుర్లభా తత్కథాశ్రుతిః.

ఆంధ్రానువాదము

# ఏడవ అధ్యాయము

అశక్తులు శ్రీరామాయణ పారాయణము చేయువిధము

1. పరమేశ్వరా! ప్రభూ! శ్రీమద్రామాయణవైభవమును సర్వజ్ఞులగు మీరుదయతో వినుపింపగా విని ధన్యురాలనైతిని. అనుగ్రహింపబడితిని.

2. ప్రభూ! మీరు తెలిపిన యీపారాయణ విధానమును రాజులు, రాజులతో సమానమగు నైశ్వర్యము కలవారు కొందరుధనికులు మాత్రమే యాచరింపజాలుదురు.

3. ఇట్టి రామాయణ కథాపారాయణము వినుట ధనికులకుమాత్రమే సులభసాధ్యమైయున్నది. నిర్ధనులగు మనుజులు వినగోరిన నదెట్లు సాధ్యమగును?

4. శ్రీరామచంద్రుని, రామాయణమును వినుపించు నాచార్యులను (గురువులను), విప్రులను నర్చించుటకు తగినంత ధనము నిర్ధనులకు దుర్లభమగుటచే రామాయణకథాశ్రవణము వారికి దుర్లభ మేకదా।

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 5. తస్మాత్కథం మహాభాగ!<br>తరిష్య న్త్యకించనాః,<br>అథవా నైవ కిం తేషాం<br>అధికారః కథాశ్రుతౌ? | 5. కావున నో పరమేశ్వరా! అకించనులు తరించు నుపాయ మేమి? వారికి కథాశ్రవణమున కధికారము లేనేలేదా? |
| 6. యథా తే ఒపి తరిష్యన్తి<br>దుస్తరం భవవారిధిమ్,<br>తథా కశ్చి దుపాయో ఒస్తి<br>యది తం కృపయా వద. | 6. వారును రామాయణమును విని, తరింపశక్యముగాని సంసారసముద్రమును తరించుట కుపాయమున్నచో దయతో తెలుపుడని పార్వతి యీశ్వరు నడిగెను. |
| **శ్రీమహేశ్వర ఉవాచ** | **పరమేశ్వరుడు తెలిపెను -** |
| 7. ధనినో వా దరిద్రా వా<br>దేవి! రామాయణ శ్రుతౌ,<br>అధికుర్వన్తి సర్వే ఒపి<br>నాత్ర కశ్చన సంశయః. | 7. దేవీ! ధనికులుగాని దరిద్రులుకాని రామాయణమును వినుట కందరును నర్హులే. ఇందు సంశయము లేదు. |
| 8. నరస్య ధనసంపత్తిః<br>యావతీ యస్య విద్యతే,<br>తాం నైవా ఒపలపే చ్ఛక్తిం<br>విప్రగుర్వచ్యుతార్చనే. | 8. ఏ మనుజున కెంత సంపత్తియుండునో ఆ ధన సంపద ననుసరించియే భగవంతుని విప్రులను గురువులను పూజించవలెను. ఆ శక్తిని సంకోచింపచేయరాదు. |
| 9. అకించనో ఒపి రామస్య<br>కథాం శ్రుత్వా ప్రయత్నతః,<br>విహితే ష్వష్టమాంశం వా<br>షోడశాంశ మథా పివా. | 9. అకించనుడైనను శ్రీరామకథ నెట్టైనను విని విధించిన దక్షిణలలో నెనిమిదవయంశమును గాని పదునారవ యంశమునుగాని |
| 10. దద్యాదేవ యథాశక్తి<br>దక్షిణాదిక మాదరాత్,<br>శక్తిం నాపలపే ద్దేవి!<br>ప్రాణైః కంఠగతై రపి. | 10. దక్షిణను యథాశక్తిగ నాదరముతో నీయవలెను. ప్రాణములు పోవు సమయమునందైనను శక్తిని మరుగుపరచరాదు. |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 11. అశక్త్యా వప్రదానే తు<br>ప్రత్యవైతి న కశ్చన,<br>శక్తావ ప్యదద న్మర్త్యో<br>భవత్యాత్మాపహారక:. | 11. దక్షిణ నిచ్చుటకు నిజముగా శక్తిలేనివారి కెట్టి ప్రత్యవాయమును కలుగనేరదు. కాని శక్తి కలిగియుండియు దక్షిణ నీయనేరని వా రాత్మవంచకు లగుదురు. |
| 12. శక్తౌ సత్యా మపి శ్రీమాన్<br>నాస్తి నాస్తీతి యో వదేత్,<br>ఆకల్పం దేహి దేహీతి<br>స భిక్షేత న సంశయ:. | 12. ధనవంతుడై దక్షిణ నీయగలంత శక్తి కలిగియుండియు లేదు లేదని పలుకు నరుడు కల్పాంతమువరకును యాచకుడై యాచన చేయు ననుటలో సందియము లేదు. |
| 13. కదాచిదపి దారిద్ర్యం<br>మమ మా స్త్వితి చిన్తయన్,<br>దద్యా దేవ యథాశక్తి<br>న దద ద్దుర్విధో భవేత్. | 13. నాకెప్పుడును దారిద్ర్యము కలుగకుండుగాక! యని తలచుచు యథాశక్తిగా దక్షిణ నీయ వలెను. అట్లిచ్చువారు ఎన్నటికిని దురదృష్ట వంతులు కారు. |
| 14. అదానదోషేణ భవేత్ దరిద్రో<br>దారిద్ర్యదోషేణ కరోతి పాపమ్,<br>పాపా దవశ్యం నరకం ప్రయాతి<br>పున ర్దరిద్ర: పున రేవ పాపీ. | 14. దానమీయజాలనివా డా దోషమువలన దరిద్రు డగును. దారిద్ర్యమువలన పాపము నాచ రించును. పాపమువలన తప్పక నరకమున కేగును. మరల దరిద్రుడై జనించును, దారి ద్ర్యమువలన మరల పాపముల నాచరించును. |
| 15. ప్రదానభాగ్యేన భవే ద్ధనాఢ్యో<br>ధనాఢ్యభావేన కరోతి పుణ్యమ్,<br>పుణ్యాదసౌ స్వర్గ మవశ్య మేతి<br>పున ర్ధనాఢ్య స్సుకృతీ పున శ్చ. | 15. దానము నిచ్చుటవలన ధనవంతుడగును. ధన వంతు డగుటవలన పుణ్యకర్మల నాచరించును. పుణ్యమువలన స్వర్గము నందును. మరల ధన వంతుడై జనించును. మరల పుణ్యకర్మల నాచరించును. |
| 16. తస్మా ద్భగవత: ప్రీతిం<br>ఆచర న్నాదరా న్నర:,<br>వైష్ణవాచార్యవిష్ణ్వర్థే<br>వినియుంజ్యాత్ స్థితం ధనమ్. | 16. కావున మనుష్యుడు భగవత్ప్రీతికై యాదర మున విష్ణుభక్తులకును గురువులకును ప్రీతి కలుగుటకొరకు తన ధనమును వినియోగింపవలెను. |

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 17. యో య శ్శృణోతి రామస్య<br>కథా మాచార్యవ క్త్రతః,<br>అవశ్యం తేన తేనాఽర్చ్యో<br>రామప్రీత్యై గురు ర్భృశమ్. | 17. ఏ మనుజుడు గురువులవలన రామకథను<br>వినునో యాతడు తప్పక శ్రీరామచంద్రుని<br>ప్రీతికై గురువుల నర్చింపవలెను. |
| 18. న ధనం భగవద్దివ్య<br>కథాశ్రవణకారణమ్,<br>వివేక: కేవలం హ్యత్ర<br>కారణం సర్వమంగళే! | 18. సమస్త మంగళముల నొసంగు నో పార్వతీ!<br>భగవంతుని దివ్యకథలను వినుటకు ధనము<br>మాత్రమే కారణముకాదు. ఈవిషయమున<br>జ్ఞానముమాత్రమే కారణము. |
| 19. కారణత్వం ధనస్యైవ<br>భవే ద్యది శుచిస్మితే!<br>అమీ సర్వే ఽపి ధనిన:<br>శృణుయు ర్భగవత్కథామ్. | 19. సుందరమగు చిరునవ్వుగల పార్వతీ! భగవ<br>త్కథలను వినుటకు ధనమే కారణమైనచో నీ<br>ధనికు లందరును భగవత్కథను విందురు<br>కదా! |
| 20. అత్రై ర్దీవ్య న్త్యద న్త్య న్నం<br>స్త్రీషు రజ్య న్తి సంతతమ్,<br>మృగయాం యా న్తి పశ్య న్తి<br>ద్యూతనృత్తాదికం వృథా. | 20. పాచికలాడుట, తిండిపోతులుగా నుండుట,<br>స్త్రీలతో నహర్నిశము సరససల్లాపములాడుట,<br>వేటాడుట, జూదము, నాట్యము మొదలగు<br>చెడుదృశ్యములను చూచుట, |
| 21. గోష్ఠీహాస్యాని కుర్వ న్తి<br>నిద్రా న్తి ప్రలప న్తి చ,<br>ఐహికాముష్మికశ్రేయో-<br>-గన్ధహీనాసి భామిని! | 21. పలువురిలో విపరీత హాస్యములాడుట, సర్వదా<br>నిద్రించుట, నోటికివచ్చినటుల మాటలాడుట,<br>ఇహలోక పరలోక శ్రేయస్సను మాటయేలేస |
| 22. ఏవం విధాని కర్మాణి<br>సంతన్వ న్తి ప్రయత్నత:,<br>జాతా హ్యాసురసంపత్తౌ<br>ధనమానమదాన్వితా:. | 22. పలువిధములగు నిట్టి కృత్యములను ప్రయత్న<br>పూర్వకముగ నొనరించుట యాసురసంపద<br>యందుజనించి ధనము, అభిమానము, అహంకార<br>ములతో గూడిన జను లాచరించు కృత్యములు. |

# శ్రీరామాయణ మాహాత్మ్యమ్

**సంస్కృత-మూలమ్** | **ఆంధ్రానువాదము**

23. భోగాపవర్గదం శ్రీమ
న్నారాయణకథామృతమ్,
శ్రోత్రయో స్తప్తనారాచ
నిభం తేషా మభాగ్యతః.

23. ఇహపరసాధనముల నిచ్చునట్టి శ్రీమన్నారాయణ కథామృతము-దురదృష్టవశమున వారి చెవుల నెఱ్ఱగాకాచిన ములికివలె బాధించును.

24. సత్కథాశ్రుతి రప్యేభి
ర్వర్జ్యతే ఽతిప్రయత్నతః,
కా కథా ఽచార్యపూజాదేః
తేషాం వితథజన్మనామ్.

24. వీరు సత్కథాశ్రవణమునుగూడ నతిప్రయత్నముతో తప్పించుకొనెదరు. అట్టి వ్యర్థజీవుల కాచార్యపూజాదు లనిన చెప్పున దేమున్నది ?

25. ఏతే హన్తాఽతిమహతీం
సంపదం ప్రాప్య దుర్భగాః,
వృథా తా మపచిన్వన్తః
పతన్తి నరకే ఽశుచౌ.

25. వీ రత్యుత్కృష్టమగు సంపదనందియు దౌర్భాగ్యవశమున దానిని దురుపయోగపరచుచు నపవిత్రమగు నరకమున పడుదురు.

26. తస్మా ద్ధనం హరికథా
శ్రవణే నైవ కారణమ్,
వివేకః కారణం సో ఽపి
సుకృతై రేవ లభ్యతే.

26. కావున ధనము హరికథాశ్రవణమునకు కారణముగాదు. మరి వివేకమే సాధనము. అట్టి వివేకజ్ఞానము పూర్వజన్మ సుకృతమున్ననే కలుగుచున్నది.

27. యైర్హి సాక్షా ద్విష్ణుపత్నీ
లక్ష్మీ రారాధితా పురా,
తే దైవీ మభిజాయన్తే
సంపదం నాఽపరే జనాః.

27. పూర్వజన్మమున సాక్షాత్ విష్ణుపత్నియగు లక్ష్మి నారాధించినవారే దైవీసంపత్తునం దవతరించుచున్నారు. ఇతరుల కట్టి జన్మ దుర్లభము.

28. తేషాం శౌచం దయా సత్యం
శమ ఇంద్రియనిగ్రహః,
విష్ణువైష్ణవగుర్వఙ్ఘ్రి -
కమలైకాన్తభక్తతా.

28 అట్టి దైవీసంపత్తునందు పుట్టినవారికి అచారము, దయ, సత్యము, అంతరింద్రియ నిగ్రహము, బహిరింద్రియనిగ్రహము, విష్ణువునందును విష్ణుభక్తులయందును గురువుల పాదపద్మముల యందును సుస్థిరమగు భక్తియు,

సంస్కృతమూలమ్ — ఆంధ్రానువాదము

29. శ్రీమన్నారాయణకథా
శ్రవణైకాన్తచిత్తతా,
నిత్యం తచ్చరణామ్భోజ
పరిచర్యామహోత్సవః.

29. శ్రీమన్నారాయణుని కథలను వినుటయందు మనస్సును లగ్నమొనరించుటయు, నిత్యము విష్ణు పాదపద్మముల పరిచర్యయే మహోత్సవమని తలచుచుండుటయు,

30. దేశే కాలే చ పాత్రే చ
దానం దాక్షిణ్య మార్దవమ్,
ఏవంవిధాస్తు కల్యాణాః
సమ్భవన్తి గుణా నృణామ్.

30. దేశకాలపాత్రల నెఱింగి దానము చేయుటయు, సర్వప్రాణులయందు దయకలిగియుండుటయు, ఇంద్రియనిగ్రహము కలిగియుండుట మొదలగు కల్యాణగుణములు కలుగుచున్నవి.

31. ఏవం భారతవర్షే ఽస్మిన్
జన్మ లబ్ధ్వా ఽతిదుర్లభమ్,
కుర్యా దవితథం రామ
కథాశ్రుత్యర్చనాదిభిః.

31. ఇట్టి భారతదేశమున నతిదుర్లభమగు మనుష్య శరీరమును పొంది దానిని శ్రీరామచంద్రుని కథలను వినుట, శ్రీరాముని పూజించుటాదిగా గల పనులచే సఫలపరచుకొనవలెను.

32. యావ ద్రాజా ధనం దద్యాత్
తత్ర కోటితమాంశకమ్,
దత్వా ఽపి కృతకృత్యః స్యాత్
తేన తుల్య మకిఞ్చనః.

35. నిర్ధనుడు రాజు ఇచ్చుధనములో కోటియంశము నిచ్చినను వానివలెనే కృతకృత్యు డగును.

**విత్తలోభస్య దూషణం –**

**ధనలోభము వహింపరాదు –**

33. దరిద్ర ముపమాం కృత్వా
స్తోకం దద్యా న్న విత్తవాన్,
సంపత్తౌ తుచ్ఛధీ స్సత్యాం
నిస్స్వ ఏవ భవే త్పునః.

33. దరిద్రు నుపమానముగా తీసికొని ధనవంతుడు కొలదిగా దక్షిణ నీయరాదు. సంపద కలిగి యుండియు పిసినారియగునేని యాతడు మరల దరిద్రుడుగానే పుట్టును.

34. అత్ర తూదాహరన్తీమం
ఇతిహాసం పురాతనమ్,
యథాఽధికారం దత్వైవ
శ్రేయో నిష్పద్యతే యథా.

34. ఈ విషయమున నీ ప్రాచీనేతిహాసము నుదాహరించుచున్నారు. తనకు తగినట్లుగా దానమిచ్చిననే దానివలన శ్రేయస్సు కలుగుననుట కీ కథయే యుదాహరణము.

సంస్కృత మూలమ్. | ఆంధ్రానువాదము.

**మాకందచరిత్రం -**

**మాకందుని కథ -**

35. అసీ ద్వైశ్యో విదర్భేషు
మాకన్దో నామ కశ్చన
భూయసా పీడ్యమానో ఽసౌ
దారిద్ర్యేణ మహామనాః.

35. పూర్వము విదర్భదేశమున మాకందుడను నొక వైశ్యు డుండెను. ఆ బుద్ధిమంతుడు మిక్కిలి దారిద్ర్యముచే పీడింపబడుచు

36. మదాన్ధాన్ దుర్ముఖాన్ లుబ్ధాన్
ధనికా న్వీక్ష్య భూయసః,
భవేయం యద్యహం జాతు
ధనవాన్ సకలం ధనమ్.

36. ఐశ్వర్యముచే కన్నుమిన్ను కాననట్టియు, సత్సంభాషణ లేనట్టియు, పిశినారులగు ధనవంతులనుజూచి "యెపుడైనను నేను ధనికుడనైనచో నా ధనమంతయును

37. దద్యాం పాత్రేషు నా ఽసత్యం
నామీ ఇవ వృథా ధనీ,
కదాచి దపి భూయాంసం
ఇత్థం ముహు రచిన్తయత్.

37. తగిన పాత్రులను జూచి చక్కగా దానము చేయుదును. కాని వీరివలె నెన్నటికిని వ్యర్థముగ నా ధనమును వెచ్చింపజాల" నని మాటి మాటికి నాలోచించుచుండెడివాడు.

38. కదాచి ద్గాలవం నామ
మహర్షిం సంశితవ్రతమ్,
యదృచ్ఛయా ఽఽగతం వీక్ష్య
నత్వా ప్రోవాచ ప్రాంజలిః.

38. ఇట్లుండ నొకానొకప్పుడు సదాచారముగల గాలవమహర్షి తలవని తలంపుగ విచ్చేయగా వారికి మాకందుడు నమస్కరించి చేతులు జోడించి ఇట్లు పలికెను.

**మాకన్ద ఉవాచ -**

**మాకందు డడిగెను –**

39. సర్వజ్ఞో ఽసి మహర్షే! త్వం
త్వా మహం శరణం గతః,
తథా దయస్వ మే స్వామిన్ !
యథా స్యాం ధనవా నహమ్.

39. ఓ మహర్షీ! నీవు సర్వము నెఱింగినవాడవు. నేను నిన్ను శరణుజొచ్చుచున్నాను. ధనవంతుడ నగునట్లు నన్నాశీర్వదింపుము.

**గాలవ ఉవాచ -**

**గాలవమహర్షి పలికెను -**

40. మాకన్ద! శ్రుణు యేనైవ
భవిష్యసి భవా న్ధనీ,
త ముపాయం బ్రవీ మ్యద్య
శక్త్యా దేహి ధనీ భవేః.

40. ఓ మాకన్దా! నీవు ధనవంతుడవగు నుపాయమును చెప్పెదను వినుము. నీవు యథాశక్తిగ దానము నొసంగుచుండుము.

సంస్కృత మూలమ్

41. ఉత్పత న్నపి చా ఽఽకాశం
విశన్నపి రసాతలమ్,
అట న్నపి మహీం కృత్స్నాం
నాదత్త ముపతిష్ఠతే.

42. దత్తం హి ప్రాప్యతే స్వర్గే
నా ఽదత్తం నామ కైశ్చన,
యత్కించి ద్దత్త మశ్నాతి
పుష్కలం త ద్భవాన్తరే.

43. ధనీ స్యా మితి కామ శ్చేత్
తవ దేహి యథాబలమ్,
భవే ర్భవాన్తరే నూనం
ధనికో నాత్ర సంశయః.

44. అథ వా చిత్తవైకృత్యా
హేతునా కిము సంపదా,
కర్తు మిచ్ఛసి త ద్బ్రూహి
పృచ్ఛతే మే మహామతే!

**మాకన్ద ఉవాచ –**

45. భూయిష్ఠం దాతు మిచ్ఛామి
దారిద్ర్యే ఽద్య దదామి కిమ్,
ఉదారచిత్తతా వ్యర్థా
మమ కాఙ్క్షామి తద్ధనమ్.

**గాలవ ఉవాచ -**

46. భూయిష్ఠం దాతు మిష్టం చేత్
త త్ప్రాప్స్యసి భవాన్తరే,
దారిద్ర్యే ఽపి యథాశక్తి
దేహి సంప్రతి వాణిజ!

ఆంధ్రానువాదము

41. అకసమున కెగిరినను, రసాతలమున ప్రవేశించినను, భూభాగమునంతయును తిరిగినను దానము చేయనివారి కేమియు సమకూర జాలదు.

42. ఈ జన్మలో దానము చేసినదే స్వర్గమున లభించును దాన మీయనిదే యెవరును దేనిని అనుభవింపజాలరు. తనకు కలిగిన దానిలో నితరులకు కొంతదానముచేసిన నది మరుసటి జన్మమున పుష్కలముగా ఫలించును.

43. నీకు ధనవంతుడు కావలయునను కోరిక యున్నచో యథాశక్తిగ దానమును చేయుము. నీవు రాబోవు జన్మమున ధనవంతుడ వగుదువు. సందియము లేదు.

44. మనోవికారమును కలిగించు సంపదవలన నేమి ప్రయోజనము? నీవు దానితో నేమి చేయదలచు కొంటివో నాకు తెలుపుమని గాలవముని మాకందు నడిగెను.

**మాకందుడు బదులు పలికెను –**

45. నాకు మిక్కుటముగ దానము చేయవలెనని యున్నది. కాని నేనిపుడీ దరిద్రావస్థయం దేమి దానమీయజాలుదును ? మనస్సులో నుదారములగు తలంపు లుండిన నేమి ప్రయోజనము? కావున నేను ధనమును కోరుచున్నాను.

**గాలవుడు చెప్పెను –**

46. ఓ వర్తకుడా! నీవు జన్మాంతరమున హెచ్చుగా దానమును చేయదలచితివేని యిప్పుడు దరిద్రుడవైనను శక్తిపంచనలేక దానమొసంగుము. దానిని బడయగల్గుదువు.

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| **మార్కణ్డ ఉవాచ -** | **మాకందుడు పలికెను –** |
| 47. నాల్పాపి శక్తి ర్ద్విజ ! మే<br>దాతుం కిం నామ దద్మ్యహమ్,<br>ఏతై: పటోలకై ర్జీవా<br>మ్యహం నిష్కుటసమ్భవై:. | 47. ఓబ్రాహ్మణా! నాకు దానమిచ్చుటకు కొంచెమైనను శక్తిలేదు నే నేమి దాన మీయగలను? నేను పెరటితోటలో కాచిన పొట్లకాయలతో జీవితమును గడుపుచున్నాను. |
| 48. నేతో ఽపి జీవికా కాచి<br>న్మమ బ్రాహ్మణ! విద్యతే,<br>పటోలలతికా శ్చేమా:<br>పశ్య నిష్కుటకే మమ. | 48. ఓబ్రాహ్మణా! ఇంతకంటె నాకు వేఱొండు జీవనోపాధి యేదియు లేదు. నీవు నా పెరటితోటయందలి యీ పొట్లతీగలను చూడుము. అని మాకందుడు తెలుపగా |
| **గాలవ ఉవాచ –** | **గాలవుడు పలికెను –** |
| 49. అనావిల ముదారం చే<br>త్తవ చేతో మహామతే!<br>ఏతేషామ ప్యలం దానం<br>ధనీ సంపత్స్యతే భవాన్. | 49. ఓబుద్ధిమంతుడా! నీ మనస్సు నిష్కల్మష మైనదియును ఉదారమైనదియును అయినచో వీటిని దానము చేసినను నీవు ధనవంతుడువు కాగలవు. |
| 50. నియమేన ప్రదేహిమాన్<br>కోమలాం స్త్వం పటోలకాన్,<br>దానేనాఽల్పేన నిస్స్వోపి<br>భవే చ్ఛ్రీమా న్భవాన్తరే. | 50. నీవు నియమముగ లేతపొట్లకాయలను దానము చేయుము. దానము తక్కువదైనను నీవు దరిద్రుడవగుటచే నిట్టి దానమువలననే మరుసటి జన్మమున శ్రీమంతుడ వగుదువు. |
| 51. మా విస్మార్షీ: కదాపి త్వం<br>స్వసంకల్పం ధనాగమే,<br>ప్రాయో ధనాగమే చిత్త<br>వైకృతం భజతే నర:. | 51. నీవు ధనవంతుడ వైనప్పుడును నీ వీ సంకల్పమును మరువవలదు. సాధారణముగా ధనవంతు డగుతరి మనుజునకు మనస్సు మారిపోవుట సహజము. |
| 52. యథైవ శృంగం గో: కాలే<br>వర్ధమానస్య వర్ధతే,<br>తథైవ తృష్ణా విత్తేన<br>వర్ధమానేన వర్ధతే. | 52. ఆవు పెరిగినకొలది దాని కొమ్ములును పెరిగినట్లు ధనమభివృద్ధిచెందుకొలది యాశయు పెరుగును. |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 53 న కామా ననువ ర్తేత<br>దుఃఖం కామేము వై రతిః,<br>ప్రాప్యార్థ ముపయుంజీత<br>ధర్మం, కామా న్వివర్జయేత్. | 53. ఎప్పటికిని కోరికల ననుసరించి ప్రవర్తింపరాదు. కోరికలందుం దాసక్తి కలిగియుండుట దుఃఖకారణమే యగుచున్నది. ధనము కలిగినచో దానిని ధర్మమార్గముననే వ్యయపరచుచు, కోరికలను వీడి యుండవలెను. |
| 54. శ్రేయసే తే వరం దద్మి<br>స్యాత్తే జన్మా న్తరస్మృతిః. | 54. నీకు శ్రేయస్సు కలుగుటకై మరుసటి జన్మమున నీజన్మనుగూర్చిన జ్ఞాపక ముండున ట్లను గ్రహించుచున్నాను. |

| మహేశ్వర ఉవాచ – | మహేశ్వరుడు తెలిపెను – |
|---|---|
| 55. ఇత్యుక్త్వా న్తర్దధే శ్రీమాన్<br>గాలవో మునిసత్తమః,<br>శ్రుత్వా మునివచో వైశ్యో<br>ముముదే కృతకృత్యవత్. | 55. అని పలికి మునిశ్రేష్ఠుడగు గాలవుడు అంతర్ధానమాయెను. వైశ్యుడగు మాకందుడును మునివచనములను విని కృతకృత్యుడనై తనని సంతసించెను. |
| 56. తదా ప్రభృ త్యనుదినం<br>ఏకైకం స పటోలకమ్,<br>భక్త్యా పరమయా యుక్తో<br>విప్రేభ్య స్సాదరం దదౌ. | 56 అప్పటినుండియు నతడు ప్రతిదినము నొక్కొక్క పొట్లకాయను బ్రాహ్మణులకు మిక్కిలి భక్తితో నిచ్చుచుండెను. |
| 57. అకిఞ్చనో ఽహం కిం దద్యాం<br>దయధ్వం మమ కేవలమ్,<br>ఇత్యల్పదానతో వ్రీతో<br>విప్రా న్ప్రార్థయతే ముహుః. | 57 అతడు దానము చేయునప్పుడు " ఓ బ్రాహ్మణులారా! నేను దరిద్రుడను నే నేమి దానముచేయగలను? నా యందు ప్రీతినిమాత్రముంచెదరు గాక! " అని తానిచ్చు నల్పదానముచే సిగ్గుపడుచు మాటిమాటికి వారిని ప్రార్థించుచుండెను. |

| మాకందస్య ద్వితీయం జన్మ – | మాకందుని రెండవ జన్మము – |
|---|---|
| 58. అథ కాలే బహుతిథే<br>కాలధర్మ ముపేయివాన్,<br>తేన దానప్రభావేన<br>రాజా వఙ్గే ష్వజాయత. | 58. ఇట్లు చాలకాలము గడిచిన యనంతరము మాకందుడు మరణించియూ దానప్రభావమున వంగదేశమున రాజుగా పుట్టెను. |

| సంస్కృత మూలమ్. | ఆంధ్రానువాదము. |
|---|---|
| 59. శ్రీమాన్ బృహచ్ఛ్రవో నామ<br>స తు పిత్రా ఽభిషేచితః,<br>వరేణ గాలవమునేః<br>రాజా జాతిస్మరో ఽభవత్. | 59. అతనిపేరు బృహచ్ఛ్రవుడని యంచబడెను అతడు తండ్రిచే నభిషేకింపబడి గాలవముని వరముచే తన పూర్వజన్మజ్ఞానమును కలిగిన వాడాయెను. |
| 60. పురా పటోలకా న్కాంశ్చిత్<br>దత్వా జాతో ఽస్మి భూపతిః,<br>భూయిష్ఠ మద్య తానేవ<br>దత్త్వా స్యాం మండలేశ్వరః. | 60. నేను పూర్వజన్మమున కొన్ని పొట్లకాయలను దానమిచ్చుటచే రాజుగా నైతిని. మరల నెక్కుడుగా వానినే యీ జన్మమున దానము చేసి భూమండలేశ్వరుడ నయ్యెదను. |
| 61. ఇతి సంకల్ప్య భూయిష్ఠం<br>ఆనీయ స పటోలకమ్,<br>బ్రాహ్మణేభ్యో ఽన్వహం ప్రాదా<br>ద్రాజా నాఽన్యత్తు కించన. | 61. అని సంకల్పించి చాల పొట్లకాయలను తీసికొనివచ్చి బ్రాహ్మణులకు ప్రతిదినమును దానము చేయుచుండెను. కాని యితర వస్తువులను వేటిని దాన మీయకుండెను. |
| 62. వినా పటోలకం రాజా<br>నాఽదదా త్కాకిణీ మపి,<br>పప్రచ్ఛ బ్రాహ్మణాన్ సర్వాన్<br>ఆగతాన్ స ముహు ర్ముహుః. | 62. రాజు పొట్లకాయలను తప్ప గ్రుడ్డిగవ్వనైననీయకుండెను. దానమును స్వీకరించుటకు వచ్చుచున్న బ్రాహ్మణులనందరును మాటిమాటికి |
| 63. తావతే యద్ధి నిష్పన్న<br>మియతా స్కా త్కియ త్పునః?<br>బ్రూత సర్వే మహాప్రాజ్ఞా<br>యూయం సర్వే ద్విజోత్తమాః. | 63. అంత కింత సిద్ధించిన నింత కెంత మరల సిద్ధించును? ప్రాజ్ఞులారా! బ్రాహ్మణోత్తములారా! మీరందరు నాకు తెలుపుడని ప్రశ్నించు చుండెను. |
| 64. ఇతి రాజకృతం ప్రశ్నం<br>గూఢార్థం బ్రాహ్మణోత్తమాః,<br>అజానన్త స్తు తూష్ణీకా<br>నిత్యం జగ్ము ర్యథాగతమ్. | 64. ఇట్లు రాజు ప్రశ్నింపగా గూఢార్థముగలయా ప్రశ్నను బ్రాహ్మణోత్తము లెఱుంగజాలక మాటలాడకయే వచ్చిన మార్గముననే వెడలిపోవుచుండిరి. |

సంస్కృతమూలమ్

ఆంధ్రానువాదము

65\. అథ వఙ్గేశ్వరం ద్రష్టుం
కదాచి ద్గాలవో మునిః,
భూమికాన్తర మాదాయ
తత్రాఽగా ద్యత్ర భూపతిః

65\. అంతట నొకానొకప్పుడు గాలవ మహర్షి వఙ్గేశ్వరుని చూచుటకు మారువేషమున నా రాజునొద్దకు వచ్చెను

66\. ఆగతం బ్రాహ్మణం వీక్ష్య
స తు రాజా బృహచ్ఛ్రవాః.
దత్త్వా పటోలకం తస్మై
ప్రప్రచ్ఛ వినయాన్వితః.

66\. వచ్చిన బ్రాహ్మణుని చూచి బృహచ్ఛ్రవుడను నారాజు పొట్లకాయ నాతని కిచ్చి సవినయముగ ఇట్లడిగెను.

**రాజా -**

67\. తావతే యద్ధి నిష్పన్నం
ఇయతా స్యాత్క్రియ త్పునః?
బ్రూహి మే పృచ్ఛతే సౌమ్య!
త్వం సర్వజ్ఞో మతో మమ.

**రాజు అడిగెను –**

67\. అంత కింతైన మరల నింత కెంతగును? ఓ మహానుభావా! నా ప్రశ్నకు బదులు తెలుపుము. నీవు సర్వజ్ఞుడవని నా అభిప్రాయమని ప్రశ్నించెను.

**గాలవః -**

68 తావతే యద్ధి నిష్పన్నం
సత్య మేత న్న సంశయః,
ఇయతా తావదేవ స్యాత్
న హి కశ్చన సంశయః.

**గాలవుడు తెలిపెను –**

68 అంత కింత కలిగె ననుటలో సందియము లేదు. సత్యమే. కాని యింతకు మునుపటివలె నంతయే యగుననుటలో గూడ సందియము లేదుకదా!

**మహేశ్వర ఉవాచ -**

69\. ఇత్యుక్తవన్తం తం విప్రం
హస్తే జగ్రాహ భూపతిః,
గాలవో ఽయం మహాభాగ
ఇతి మత్వా మహామనాః.

**మహేశ్వరుడు పలికెను –**

69\. అని తెలుపుగా నారాజు బ్రాహ్మణుని చేతితో పట్టుకొని బుద్ధిమంతుడగు నా రాజు "ఈతడు పూజ్యుడగు గాలవుడే" యని తలచి

**రాజా -**

70\. క స్త్వం చరసి విప్రర్షే!
భస్మచ్ఛన్న ఇవాఽనలః,
యది త్వం గాలవో బ్రహ్మన్!
బ్రూహి మే య ద్వివక్షితమ్.

**రాజడిగెను –**

70 విప్రపుంగవా? బూడిదచే కప్పబడిన అగ్నిహోత్రమువలె చరించు నీ వెవడవు? నీవు గాలవ మహర్షివే యైనచో నేను తెలియ గోరుచున్న దానిని తెలుపుమని యడిగెను.

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| **గాలవః -** | **గాలవుడు పలికెను -** |
| 71. స్మరస్యథ కథం భూప!<br>మాకన్ద స్త్వం భవిష్యసి,<br>గాలవో ఽహం న సన్దేహో<br>బ్రూహి య త్తే వివక్షితమ్. | 71. రాజా! నీవు మరల మాకందు డెట్లగుదువో తెలిసినదా? నేను గాలవుడనే. సందియములేదు. నీవు తెలియ గోరుదానిని చెప్పుము. అని యడిగెను. |
| **రాజా -** | **రాజు పలికెను —** |
| 72. ధన్యో ఽస్మ్యనుగృహీతో ఽస్మి<br>కృపయా య ద్భవా న్మమ,<br>ఆగతో దర్శనం సౌమ్య !<br>పృచ్ఛా మ్యేత ద్బ్రవీతు మే. | 72. ధన్యుడ నైతిని, అనుగ్రహింపబడితిని. దయతో నీవు నాకు దర్శనమిచ్చితివి. సాధుశీలా! నే నడిగినదానికి నాకు బదులొసంగుము |
| 73. తావతే యద్ధి నిష్పన్నం<br>సత్య మేత న్న సంశయః,<br>ఇయతా తావదేవ స్యాత్<br>న హి కశ్చన సంశయః, | 73. "అంతకుయింత కలిగెననుటలో సందియము లేదు ఇది సత్యము. మరల నంతియే కలుగు ననుటలోను సందియము లేదు". |
| 74. ఇత్య బ్రవీ ద్య దేత త్త్వం<br>కో ఽర్థ స్తస్య మహామునే ! | 74. అని నీవు పలికినదాని కర్థమేమియో నాకు తెలుపుము. అని యడిగెను. |
| **గాలవః —** | **గాలవుడు చెప్పెను -** |
| 75. య త్త్వం పటోలక మదాః<br>పురా ఽత్యర్థ మకిఞ్చనః,<br>దానేన తావతే య త్తే<br>ఫలం జాతో ఽసి య న్నృపః. | 75. పూర్వమునీవు మిక్కిలి దరిద్రుడవుగానుంటివి. అసమయమునకు తగినట్లు నీవు పొట్లకాయలను దాన మొసంగితివి. అ దానముచే నీ వీ జన్మమున రాజుగా పుట్టితివి. |
| 76 మహతీం సంపదం ప్రాప్య<br>య దద్యా దరణీపతే!<br>పటోలకానేవ పునః<br>ప్రయచ్ఛసి న కిఞ్చన. | 76. ఓ రాజా! గొప్ప సంపదను పొందియు నేడు మరల పొట్లకాయలనే దానమిచ్చుచున్నావే గాని మరి యితర మేమియు దానమిచ్చుటలేదు. |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 77. ఇయతా తావ దేవ స్యాత్<br>ఫలం య న్నిస్స్వతా పునః. | 77. కావున నీదాన ఫలితముగ మరల దరిద్రుడవే<br>యగుదువని గాలవుడు తెలిపెను. |
| **రాజా -** | **రాజు పలికెను -** |
| 78. య ద్దత్వా కిఞ్చి దేవా ఽహం<br>భూమిపాలో ఽభవం మునే!<br>భూయ స్తదేవ దత్వా ఽహం<br>న కథం స్యా మితో ధనీ. | 78. మునీశ్వరా! నేను పొట్లకాయలు కొద్దిదానముచేసి<br>భూపతి నైతినిగాదా, మరల నా పొట్లకాయలనే<br>యిచ్చుటచే నింతకంటె ధనవంతుడ నెందులకు<br>కాజాలను? |
| 79. అత్ర మే సంశయో భూయాం<br>శ్ఛిన్ధి తం మునిపుఙ్గవ!<br>య త్తేనై వేహ దానేన<br>పున ర్దారిద్ర్య మాప్నుయామ్. | 79. మునిశ్రేష్ఠా! మరల నా దానముచేతనే దరి<br>ద్రుడ నగుదు ననుటలో నాకు మిక్కిలి సంది<br>యము కలుగుచున్నది. దానిని పోగొట్టుము.అని<br>యడిగెను. |
| **గాలవః -** | **గాలవుడు సదోబోధ చేయుట -** |
| 80. సత్య మేవ యదాత్థ త్వం<br>కిం త్వేత చ్ఛృణు పార్థివ!<br>నిస్స్వానాం ధనికానాం చ<br>దానే ఽస్తి మహ ద న్తరమ్. | 80. ఓ రాజా! నీవు చెప్పినది నిజమే కాని యీ<br>మాటలను వినుము. దరిద్రులును ధనవంతులును<br>దానము చేయుటలో చాల భేదమున్నది. |
| 81. యావ చ్చక్రేశ్వరో దద్యాత్<br>నిస్స్వ స్తత్రాల్ప మంశకమ్,<br>దత్వా తత్ఫల మాప్నోతి<br>స యావ త్ఫల మశ్నుతే. | 81. చక్రవర్తి దానముచేయుదానిలో నల్పాంశము<br>నైనను దరిద్రుడు దానము చేసిన చక్రవర్తి<br>పొందజాలినంతటి ఫలమునే పొందగలుగును. |
| 82. గజేన్ద్రో ఽశ్నాతి భూయిష్ఠం<br>అల్పిష్ఠం మశకో నృప!<br>ఉభయో రపి సౌహిత్యే<br>తారతమ్యం న కించన. | 82. రాజా! విను గధికముగ భుజించిన దోమ<br>మిక్కిలి స్వల్పముగ నారగించును: ఈ రెంటి<br>తృప్తిలోను తారతమ్య మేమియు లేదుకదా! |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 83. దద్యా న్న తావ దేవా ఒఢ్యో<br>యావ ద్దద్యా దకించన:,<br>యది దద్యా త్తావ దేవ<br>దుర్మేథా నిస్స్వతా మియాత్. | 83. దరిద్రు డెంత దానమిచ్చునో యంతయే ధన వంతు డీయరాదు బుద్ధిహీనుడై దరిద్రునివలె తానును దానము చేసెనేని ధనికుడు దరిద్రు డగును. |
| 84. మహతీం సంపదం ప్రాప్య<br>దానే దుర్గతతుల్యతామ్,<br>యత్త్వార్థయేత తత్త్వాయో<br>భావిదారిద్ర్య సూచనమ్. | 84. గొప్పసంపద కలిగియుండి దానము చేయుటలో దరిద్రుని పోలియుండిన నాతడు రాబోవు జన్మమున దరిద్రుడగుటనే యాతని బుద్ధి సూచించుచున్నది. |
| 85. దరిద్రవదనా ద్వాణీ<br>యాదృశీ నృప! నిస్సరేత్,<br>న వదే త్తాదృశీం భూష్ణు:<br>శ్రీమా నాపద్యపి క్వచిత్. | 85. రాజా! దరిద్రుని నోటినుండి వచ్చునటువంటిదీన వాక్కును బాగుపడదలచినశ్రీమంతు డాపదల యందైనను ఎవరియొద్దను పలుకరాదు. |
| 86. శ్రియం ప్రాప్తవతో యస్య<br>శుష్కా గీ ర్నిస్సరే న్ముఖాత్,<br>న తద్వదన మీక్షేత<br>శ్రేయస్కామ: కథంచన. | 86. ధనమును కలిగియుండిన యాతని నోటి నుండి బీదతనము వెల్లడించు పలుకులు వెలువడెనేని శ్రేయస్సును పొందగోరువా డాతని ముఖము నెన్నడును చూడరాదు. |
| 87. అకించనోఽపి యో భూష్ణు:<br>న దరిద్రగిరం వదేత్,<br>ఆశాసన్తే సురా స్తస్మై<br>కల్యాణం నాత్ర సంశయ:. | 87. బాగుపడగోరువాడు దరిద్రుడేయైనను దరిద్రునివలె మాటలాడరాదు. అట్టివానికిదేవతలు కల్యాణము ననుగ్రహింతురనుటలో సందియము లేదు |
| 88. యో బ్రూయా ద్దార్విధీం వాణీం<br>య: కుర్యా ద్దార్విధీంధియమ్,<br>ప్రాప్యాపి రాజ్యసంపత్తిం<br>తస్య లక్ష్మీ: పరాఙ్ముఖీ. | 88. దరిద్రునివలె మాటలాడుచు, దరిద్రునివంటి బుద్ధికలిగి యుండువాడు మహారాజైనను లక్ష్మి అతనివట్ల ప్రసన్నురాలు కాజాలదు. |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 89. స్వల్పామపి శ్రియం ప్రాప్య<br>యస్య దీర్ఘ లఘీయసీ,<br>తస్య లక్ష్మీ ర్జగన్మాతా<br>తరఙ్గయతి సంపదః. | 89. కొద్ది ధనముండియు నెవ్వని బుద్ధి అల్పము నుండదో యాతనికి జగన్మాతయగు లక్ష్మి సంపదల నుత్కృష్టముగా నిచ్చును. |
| 90. సత్యం బ్రవీమి రాజేన్ద్ర!<br>త్రిరహం నాత్ర సంశయః,<br>శ్రీమానపి కదర్యో యః<br>స దారిద్ర్యా ద్వినశ్యతి. | 90. ఓ రాజేంద్రా! ముమ్మాటికి నేను చెప్పునది సత్యము ఇందు సందియములేదు. ధనవంతుడై నను లుబ్ధుడైనచో నాతడు దారిద్ర్యము వలన నశించును. |
| 91. దద్యా చ్ఛ్రీమానివ శ్రీమాన్<br>నిస్స్వో నిస్స్వ ఇవ ప్రభో!<br>పనసః పనసం దద్యాత్<br>బదరో బదరీఫలమ్ | 91. ధనికుడు తన సంపదకు తగినట్లును దరిద్రుడు తన శక్త్యనుసారముగను దానము చేయవలెను. పనసచెట్టు తనకు తగిన పనసపండు నొసంగును. రేగుచెట్టు తనకుతగిన రేగుపండు నొసంగును. |
| 92. పనసో బదరీతుల్యం<br>కపిత్థసదృశం తు వా,<br>నారికేళసమం వాపి<br>యది దద్యా త్ఫలం క్వచిత్. | 92. పనసచెట్టు రేగిపండ్లంతవిగాని, వెలగ పండ్లంతటివి గాని కొబ్బరికాయలవంటివిగాని పనసపండ్ల నొసంగినచో |
| 93. న త త్ప్రశంసన్తి నరా<br>మూఢా అపి కథంచన,<br>బదరీ జాతు చే ద్దద్యాత్<br>కపిత్థసదృశం ఫలమ్. | 93. దానిని మూఢులైనను ఎన్నటికిని స్తుతింపరు. రేగుచెట్టు ఎప్పుడైనను వెలగపండ్లంత పండ్లు కాసినచో |
| 94. ఆబాల మా చ గోపాలాత్<br>త త్ప్రశంసన్తి మానవాః,<br>త చ్ఛ్రీమతో ఽల్పదానం యత్<br>త త్ప్రశంసన్తి నోత్తమాః. | 94. ఆబాలగోపాలమును దానినందరును స్తోత్రము చేయుదురు. అట్లే ధనికుని యల్పదానము నుత్తమమానవులు ప్రశంసింపరు. |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 95. కించిద ప్యధికం దానం<br>దరిద్రస్య ప్రశస్యతే,<br>ఇదం ప్రాగ్భవ ఏవా ఽహం<br>అన్వశాం తవ భూపతే! | 95. దరిద్రుడు చేసిన దాన మల్పమైనను దాని నందరును పొగడుదురు. ఓ రాజా! దీనిని నీకు పూర్వజన్మమున నే నేను తెలిపితిని. |
| 96. విస్మర న్బుద్ధిదౌర్బల్యాత్<br>లోభ మద్యానువర్తసే,<br>జహీమాం పాపికాం బుద్ధిం<br>శ్రేయసీం ధియ మాప్నుహి. | 96. నీవు నీ బుద్ధిమాంద్యమువలన దానిని మరచి పోయి నేడు లోభముతో ప్రవర్తించుచున్నావు. ఈ దుష్టబుద్ధిని విడచి మంచిబుద్ధిని పొందుము. |
| 97. లోభో ఽల్పో ఽపి యశో హన్తి<br>శ్విత్రం రూప మివోర్జితమ్,<br>హరిణా కృపయా దత్తం<br>తవ యద్వసు మానద! | 97. మిక్కిలి ప్రకాశవంతమగు సౌందర్యమునైనను బొల్లి పాడుచేయునట్లు లోభము కొంచెమే యైనను కీర్తిని పాడుచేయును. ఓ గౌరవ నీయుడా! నీకు భగవంతు డిచ్చిన ధనమును |
| 98. దేహి పాత్రేషు సత్కృత్య<br>శృణు త్వం సత్కథాం ముహుః,<br>పూజయ జ్ఞానదాతౄం స్త్వం<br>శృణు రామకథా మపి. | 98. తగినవారికి సగౌరవముగ దానము చేయుము. మాటిమాటికి మంచి కథలను వినుము. నీకు జ్ఞానోపదేశము చేసినవారిని పూజింపుము. రామకథను వినుము. |
| 99. ఆరాధయ రఘూత్తంసం<br>విత్తశాఠ్యవివర్జితః,<br>ఏవం హి తే భవే త్స్వస్తి<br>భజే స్త్వం సార్వభౌమతామ్. | 99. ధనలోభము లేనివాడవై శ్రీరామచంద్రుని పూజింపుము ఇట్లు చేసిన నీకు మంగళము కలుగును. నీవు సార్వభౌముడ వగుదువు. |
| 100. నాత్ర కశ్చన సందేహః<br>కురుష్వ వచనం మమ,<br>కర్తుం తే జాఠరీం పూర్తిం<br>న దత్తం హరిణా ధనమ్. | 100. ఇందు సందియము లేదు. నామాట ప్రకారము చేయుము. నీ పొట్ట నింపుకొనుటకై భగవంతు డీ ధనము నీయలేదు. |

**సంస్కృత మూలమ్** / **ఆంధ్రానువాదము**

101. యాగదానాదిభి శ్శ్రేయ:
ప్రాప్తుమేవ న సంశయ:,
యద్య భీష్టం భగవత:
త్వత్కుక్షే రేవ పూరణమ్.

101. ఈ ధనముతో యాగము దానము మొదలగు కృత్యముల నాచరించి శ్రేయస్సును పొంద వలెను. సంశయము వలదు. భగవంతునకు నీ పొట్ట నింపుకొనుటయే యభీష్ట మైనచో

102. యావ ద్ధ్రియేత జఠరం
ప్రదద్యా త్తావదేవ తే,
నహి రాజ్ఞాం శ్రియ స్స్వార్థా:
పరార్థా ఏవ వస్తుత:.

102. నీ పొట్ట నింపుకొనుటకు తగినంత ధనమునే యిచ్చియుండెడివాడు. రాజులయొక్క ధనము స్వార్థమున కెన్నటికిని ఉపయోగింపరాదు. అది పరులకొఱకే యీయబడినది.

103. జ్ఞాత్వైవం దానధర్మేషు
వినియుజ్క్ష్వ ధనం నృప!
న మాతా న పితా నాపి
భ్రాతా న సుతబాన్ధవా:.

103 ఈ విధము నెఱింగి రాజా! దానధర్మములకై నీ ధనము నుపయోగింపుము. తల్లి, దండ్రి, సోదరులు, పుత్రులు, బంధువులు,

104. న ధనం నచ రాజ్యం వా
జా త్వాముత్రోపకుర్వతే,
ఏక: ప్రజాయతే జన్తు:
ఏక ఏవ ప్రలీయతే.

104. ధనము, రాజ్యము పరలోకమున నొకప్పుడు నుపయోగింపవు. ప్రాణి యొంటరిగనే జనించును, ఒంటరిగనే లీనమగును

105. ఏకో ఽనుభుఙ్క్తే సుకృతం
ఏక ఏవ హి దుష్కృతమ్,
మృతం శరీర ముత్సృజ్య
కాష్ఠలోష్ఠసమం చితౌ.

105. సుకృతము నొంటరిగనే యనుభవించును. అట్లే దుష్కృతము నొంటరిగనే యనుభవించును. జీవుడు లేచిపోవుటచే కఱ్ఱవలెను, మట్టిపెళ్లవలె నైన శరీరమును చితియందు విడచి,

106. విముఖా బాన్ధవా యాన్తి
ధర్మ స్త మనుగచ్ఛతి,
త్యక్త్వా త్వ య్యఖిలం యాతే
కస్య వైత ద్భవే ద్ధనమ్.

106. బంధువులు విముఖులై వెడలిపోవుదురు. నీవు నీ సంపద నంతయు వదలి వెళ్ళిన నా ధన మంతయు నెవ రనుభవింతురు ?

సంస్కృత మూలమ్.

107. అనిత్యే ఽత్ర ధనే కాఽఽస్థా
మమేతి హృది ధార్యతామ్,
ధనం వా పురుషో రాజన్ !
పురుషం వా ధనం క్వచిత్.

108. అవశ్య మేక మన్యత్తు
త్యజత్యేవ న సంశయః,
యావ త్స్వయ త్స్వవశే విత్తం
తావదేవ మహామతిః.

109. తత్కు ర్యా జ్జాగరూకో ఽసౌ
య దముత్రోపకారకమ్,
అవశం హి యదా విత్తం
తదా ధర్మం చికీర్షతా.

110. గతాయాం ప్రావృషి ప్రాయః
సస్యం పుంసా ప్రరోప్యతే,
తస్మా త్కల్యో యదైవ స్యాత్
తదైవ మతిమా న్నరః.

111. త్వరమాణః ప్రయత్నే న
దానధర్మాన్ సమాచరేత్.

**మహేశ్వర ఉవాచ –**

112. ఇత్యుక్తవన్తం రాజేన్ద్రో
గాలవం మునిపుంగవమ్,
ప్రశ్రయావనతో భూత్వా
నిర్విణ్ణో వాక్య మబ్రవీత్.

ఆంధ్రానువాదము.

107. నా కీ యనిత్యమగు ధనమునెడ నిత్యమను బుద్ధియేల ? అని మనస్సున జ్ఞాపకముంచుకొనుము, రాజా ! ధనమును పురుషుడు గాని, పురుషుని ధనముకాని యెపుడో యొకప్పుడు

108. తప్పక విడువనే విడుచును. సందియము లేదు. ధనము తనవశమున నున్నప్పుడే బుద్ధిమంతుడు

109. ఇహపరసాధన మగునట్లు జాగరూకుడై ప్రవర్తింపవలెను. ధనము తన వశము తప్పినప్పుడు ధర్మమును చేయగోరువాడు

110. వర్షకాలము దాటిన తరువాత సస్యమును వేయు మనుజునివంటివాడు. కావున (ఉదయముననే) ధనవంతుడుగ నున్నప్పుడే బుద్ధిమంతుడు

111. త్వరపడుచు ప్రయత్నపూర్వకముగ దానధర్మములను చేయవలెను.

**మహేశ్వరుడు పలికెను -**

112. అని గాలవుడు తెలుపగా రాజు దుఃఖించుచు, గాలవమునివర్యునితో సవినయముగా నిట్లు పలికెను.

సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము

**రాజా -**

113. మహర్షే! య దతిక్రాన్తం
అజ్ఞానా ద్బుద్ధిలాఘవాత్,
శిష్యస్య మమ త త్సర్వం
క్షన్తవ్యం కరుణానిధే!

**రాజు అడిగెను —**

113. దయాసముద్రుడవగు మహర్షీ! అజ్ఞానము వలనను బుద్ధిలాఘవమువలనను నీ శిష్యుడనగు నే నాచరించినదంతయు క్షమింపుము.

114. త్వమేవ రామచరితం
సంశ్రావయ మునే! మమ,
య దన్యదపి జానీషే
హితం తదపి మే వద.

114 ఓ మునీ! నీవే నాకు రామచరిత్రము వినిపింపుము. ఇతర మేదియైన నెఱిగియున్నచో నట్టి హితమునుగూడ నా కుపదేశింపుము. అని యడిగెను.

**మహేశ్వర: -**

115. ఇతి సంప్రార్థిత స్తేన
రాజ్ఞా స మునిసత్తమ:,
శ్రావయామాస విధినా
రామాయణమహా మనుమ్

**మహేశ్వరుడు తెలిపెను —**

115. అని యిట్లా మునిశ్రేష్ఠుడు రాజుచే ప్రార్థింపబడి యథావిధిగ రామాయణ మహామంత్రమును వినిపించెను.

116. అర్చిత శ్చ యథా న్యాయం
తేన రాజ్ఞా మహాముని:,
శ్రేయ స్యేవాస్తు తే బుద్ధి:
ఇత్యుక్త్వా న్తరధా త్ప్రియే!

116. ఓ ప్రియురాలా! ఆ విధముగ యథావిధిగ నా రాజుచే పూజింపబడి మహాముని "రాజా! నీ బుద్ధి శ్రేయోవిషయమున ప్రవర్తించు గాక!" యని పలికి యంతర్ధాన మాయెను.

117. అథ రాజా యథావిత్తం
దద త్పాత్రేషు భూరిశ:,
యశసా దివ మావృణ్వన్
కాలధర్మ ముపేయివాన్.

117. అంతట రాజు సత్పాత్రలయందు మిక్కుటముగా నా ధనమును దానము చేసెను. తన కీర్తి స్వర్గమువరకు వ్యాపింపగా నాతడు చని పోయెను.

**మాకందస్య తృతీయం జన్మ —**

118. అథ కాశీషు సఞ్జాత
శ్చక్రవర్తీ మహామనా:,
తీర్థకీర్తి రితి ఖ్యాత:
స గాలవవచ: స్మరన్.

**మాకందుని మూడవ జన్మము -**

118. అనంతరము మహాజ్ఞానముగల చక్రవర్తియై తీర్థకీర్తియని ప్రసిద్ధిచెంది కాశిలో జన్మించెను. అతడు గాలవుని మాటలను స్మరించుచు

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 119. చక్రే దానాని సర్వాణి<br>యజ్ఞాం శ్చాప్యాప్తదక్షిణాన్,<br>తపాం స్యతప్త విధివత్<br>తథానాఽనశనాన్ బహూన్. | 119. సకలదానములను, భూరిదానములతో యజ్ఞములనాచరించెను. యథావిధిగ తపముల నాచరించెను. ఉపవాసము లనేకములు చేసెను. |
| 120. నిత్యం స స్నా స జాహ్నవ్యా<br>మశృణో త్తత్కథాం తథా,<br>ఆముష్మికం ఫలం ప్రాప్తు<br>మేవ సర్వం చకార సః. | 120. గంగయందు ప్రతిదినము స్నానము చేసెను. మంచికథలను వినుచుండెను. తన కృత్యములన్నియు పరలోకసుఖమును బడయగోరి యాచరించెను. |
| 121. కామవాసనయా చిత్తం<br>న యదాఽఽవిలతాం జహౌ,<br>తదా నిర్విణ్ణధీ రాజా<br>ఽచిన్తయ ద్గాలవం మునిమ్. | 121. ఇన్నివిధములగు సత్కృత్యము లాచరించుచున్నను మనస్సున కోరికల ననుభవించవలెననెడి యాస మిక్కుటమగుచుండగా రాజు విచారించు మనస్సు కలవాడై గాలవమునిని తలంచుకొనెను. |
| 122. ధ్యానమాత్రేణ స మునీ<br>రాజ్ఞో దర్శన మాయయౌ,<br>జాతిస్మర స్స రాజాపి<br>ప్రత్యుత్థాయ కృతాంజలిః. | 122. ధ్యానించినమాత్రముననే గాలవముని రాజునకు ప్రత్యక్షమాయెను. రాజును తన జన్మ నెఱింగినవాడగుటచే నెదురేగి చేతులు జోడించి, |
| 123. ప్రణమ్య గురవే తస్మై<br>సాఞ్జలి స్సమభాషత. | 123. గురువగు గాలవమునికి నమస్కరించి సవినయముగ నిట్లు పలికెను. |
| **తీర్థకీర్తి రువాచ –** | **తీర్థకీర్తి పలికెను –** |
| 124. ప్రాప్తోఽస్మి సార్వభౌమత్వం<br>భగవం స్త్వదనుగ్రహాత్,<br>నాన్తం పశ్యామి తృష్ణాయాః<br>శాన్తి ర్మే రోచతే మునే! | 124. ఓ పూజ్యుడా! నీ యనుగ్రహమువలన చక్రవర్తి నైతిని. ఓ మునీశ్వరా! నా యాశ కంతము కానరాకున్నది. నాకు శాంతికలుగు నుపాయ మేమి ? |

సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము

125. న జాతు కామః కామానాం
ఉపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ
భూయ ఏవాభివర్ధతే.

125. కోరిక లనుభవించుటచే నెప్పుడును, కామము శాంతి నొందదు. హవిస్సు నుంచినకొలది యగ్నిహోత్రము ప్రజ్వరిల్లుచునే యుండునట్లు, కోరికల ననుభవించినకొలది యీ కామ మభివృద్ధిని చెందుచునేయుండును.

126. దదతోఽపి చ దానాని
యజతోఽపి క్రతూత్తమైః,
మజ్జతోఽపి చ గంగాయాం
న హి శుధ్యతి మే మనః.

126. పెక్కు దానముల నాచరించినను, యాగములెన్ని యొనరించుచున్నను, నా మనస్సు పవిత్రము కాకున్నది.

127. యథా శుధ్యే న్మమ మతి
ర్యథా స్యాం శాశ్వతే పదే,
తథా మా మనుగృహ్ణీష్వ
త్వత్తోఽన్యా నాస్తి మే గతిః.

127. నా మనస్సేవిధముగ పరిశుద్ధినొందునో, నాకు మోక్షసామ్రాజ్యము నధిష్ఠించు భాగ్య మేరీతిని చేకూరునో యట్లు నన్ననుగ్రహింపుము. నీవు తప్ప నాకు వేఱొండు గతి కానరాదని రాజు విలపించెను.

**గాలవ ఉవాచ –**

**గాలవుడు పలికెను -**

128. ఇదానీం త్వం కృతార్థోఽసి
యజ్జాతా నైష్ఠికీ మతిః,
శ్రూయతా మభిధాస్యామి
యేన త్వం సుఖ మాప్నుయాః.

128. రాజా ! నీకు జ్ఞానోదయమైనది. నీ విపు డాకారణమున కృతార్థుడవైతివి. నీవు సుఖపడు మార్గమును చెప్పెదను వినుము.

129. జహీహి రాజశార్దూల !
నిశ్శేషం కామవాసనాః,
కురుష్వ యజ్ఞదానాది
ఫలా న్యనభిసందధత్.

129. ఓ రాజేంద్రా ! నీవు సమూలముగ కోర్కెలను వీడుము. నీవు ప్రతిఫలము నాశింపక యజ్ఞదానాదుల నాచరింపుము.

130. ప్రాప్స్యసే చేతస శ్శుద్ధిం
యయాఽధికురుషే దృఢమ్.
శ్రీరామచరణాంభోజ
ప్రపత్తౌ రాజసత్తమ !

130. ఓ రాజతిలకమా ! శ్రీరామచంద్ర చరణకమలముల నాశ్రయించిన మనోనైర్మల్యము సిద్ధించును.

# శ్రీరామాయణ మాహాత్మ్యమ్

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 131. సాత్త్వికాని పురాణాని<br>సేతిహాసాని సంతతమ్,<br>శృణ్వన్ రామాయణం భూయః<br>శృణు భక్త్యా మహామతే! | 131. రామాయణ మహాభారతాది సాత్విక పురాణముల ననవరతము వినుచు మరల మరల భక్తితో రామాయణము నాకర్ణింపుము. |
| 132. శ్లోకరత్నసమాకీర్ణం<br>సర్గకల్లోలసంకులమ్,<br>సప్తకాణ్డమహాద్వీపం<br>భజ రామాయణార్ణవమ్. | 132. శ్లోకము లను రత్నములతో నిండి సర్గ లనెడు తరంగభూయిష్ఠమై సప్తకాండములనెడు గొప్ప దీవులతో గూడిన రామాయణ మను మహా సముద్రమున నీదులాడుము. |
| 133. విష్ణువైష్ణవగుర్వాదీన్<br>అభ్యర్చ్యయ యథావిధి,<br>సత్యం భవేః కృతార్థ స్త్వం<br>నాత్ర కార్యా విచారణా. | 133. యథావిధిగ విష్ణువును, విష్ణుభక్తులను, గురువులు మొదలగువారి నారాధింపుము. నీవు తప్పక కృతార్థుడ వగుదువు. సంశయించకుమని తెలిపెను. |
| మహేశ్వర ఉవాచ – | ఈశ్వరుడు పలికెను – |
| 134. ఇత్యుక్త్వా పార్థివ స్తేన<br>సంశ్రావ్య భగవత్కథాః,<br>అష్టోత్తరశతావృత్త్యా<br>రామాయణకథామృతమ్. | 134. ఇట్లు పలికి యా గాలవ మహర్షి రాజునకు భగవత్కథలను చెప్పియు నూటయెనిమిది పర్యాయములు రామాయణ కథామృతమును |
| 135. కారయిత్వా యథా శాస్త్రం<br>వినియోజ్య ధనం బహు,<br>మహాసామ్రాజ్యపట్టాభి<br>షేకదివ్యమహోత్సవమ్. | 135. యథా శాస్త్రముగ వినిపించియు చాల ధనము వ్యయపరిపించి మహాసామ్రాజ్యపట్టాభిషేకమహోత్సవమును, |
| 136. కారయిత్వా రఘూత్తంసే<br>న్యస్తభారం విధాయ చ,<br>అర్చిత స్తేన విధివత్<br>స జగామ యథాగతమ్. | 136. చేయించి శ్రీరామచంద్ర చరణారవిందముల యందే యాతని భారమునంతయు నుంచునట్లు చేసి యా రాజుచే పూజింపబడి వచ్చి నట్లేగెను. |

# శ్రీరామాయణ మాహాత్మ్యమ్

సంస్కృతమూలమ్

137. రాజాపి సుచిరం కాలం
నయన్ శ్రీవైష్ణవార్చనైః,
ఆచార్యకృపయా ప్రాప
కృతార్థో వైష్ణవం పదమ్.

138. స ప్రాప్య నిత్యకైంకర్య
సామ్రాజ్యం విధిదుర్లభమ్,
శ్రీమతా వాసుదేవేన
తేనైవ సహ మోదతే.

139. తస్మా ద్దరిద్రవ త్స్వల్పం
ధనీ దద్యా న్న జాత్వపి,
అరురుక్షతి య శ్శ్రేయాం
స్యుత్తరోత్తర మూర్జితమ్.

140. ఇత్యేత త్కథితం దేవి!
యత్పృష్టోఽహ మిహ త్వయా,
నిస్సందేహాసి కచ్చిత్త్వం
కి మన్య చ్ఛ్రోతు మిచ్ఛసి.

ఇతి
శ్రీమత్పారాశర్యే ఉపపురాణే
శ్రీరామాయణ మాహాత్మ్యే
సప్తమోఽధ్యాయః.

ఆంధ్రానువాదము

137. రాజును చాలకాలము శ్రీవిష్ణుభక్తుల నారాధించుచు గడపి యాచార్యుల యనుగ్రహముచే విష్ణుపదసామ్రాజ్యమునంది కృతార్థుడాయెను.

138. అచట నాతడు బ్రహ్మకుగూడ దుర్లభమగు భగవంతుని నిత్యకైంకర్యమనెడు సామ్రాజ్య పదవి నంది శ్రీమన్నారాయణునితో గూడ నిత్యానందము ననుభవించుచుండెను.

139. కావున ధనికుడగు మనుజు డుత్తరోత్తర మత్యుజ్జ్వలమగు శ్రేయస్సుల నందగోరుచో నొకప్పుడును దరిద్రునివలె స్వల్పధనము నీయరాదు.

140. ఓ పార్వతీ! నీవడుగుటచే నే నిట్లు చెప్పితిని. నీకు సందేహము పోయినదా? ఇతర మేమైన విన గోరుచుంటివా? యని యీశ్వరుడు పార్వతి నడిగెను.

ఇది
శ్రీమత్పరాశరవిరచితమగు ఉపపురాణమున
శ్రీరామాయణ మాహాత్మ్యమున
నేడవ యధ్యాయము.



సంస్కృత మూలమ్. | ఆంధ్రానువాదము.

# అష్టమోఽధ్యాయః

# ఎనిమిదవ అధ్యాయము

## గుణతః పురాణవిభాగః

## గుణముల ననుసరించి పురాణవిభాగము

పార్వత్యువాచ –

1. కతి నామ పురాణాని
సాత్త్వికా న్యత్ర కాని వా,
కానీహ శృణుయా ద్వాపి
పఠే ద్వా వద మే ప్రభో!

పార్వతి యడిగెను –

1. ప్రభూ! పురాణము లెన్ని? అందు సాత్త్విక పురాణము లెవ్వి? ఇందు వేటిని వినవలెనో ఏ పురాణములను పారాయణ చేయవలెనో యెఱింగింపు డని పార్వతి యీశ్వరు నడిగెను.

మహేశ్వర ఉవాచ –

2. ఏత త్పాద్మే పురా ప్రోక్తం
తుభ్యం హిమవత స్సుతే!
అథాపి పృచ్ఛ స్యద్య త్వం
శృణు య త్తే బ్రవీ మ్యహమ్.

మహేశ్వరుడు తెలిపెను –

2. హిమవంతుని కుమార్తెవగు నో పార్వతీ! ఈ విషయమును నీకు మున్ను పద్మపురాణమున దెలిపితిని. అయినను నీవిప్పు డడుగు చుంటివి గాన తెలిపెదను వినుము.

3. బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ
శైవం భాగవతం తథా,
తథా ఽన్య న్నారదీయం చ
మార్కణ్డేయం చ సప్తమమ్.

3. బ్రాహ్మ పురాణము, పాద్మ పురాణము, విష్ణు పురాణము, శివ పురాణము, భాగవతము, అట్లే నారద పురాణము, ఏడవది మార్కండేయ పురాణము.

4. ఆగ్నే యమష్టమం చైవ
భవిష్య న్నవమం స్మృతమ్,
దశమం బ్రహ్మకైవర్తం
లైఙ్గ మేకాదశం స్మృతమ్.

4. ఎనిమిదవది యాగ్నేయ పురాణము, భవిష్యత్పురాణము తొమ్మిదవది, బ్రహ్మకైవర్తము పదియవదియు, లింగ పురాణము పదునొకండవదియు,

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 5. వారాహం ద్వాదశం చైవ<br>స్కాన్దం చైవ త్రయోదశమ్,<br>చతుర్దశం వామనం చ<br>కౌర్మం పఞ్చదశం తథా. | 5. పండ్రెండవది వరాహ పురాణము, స్కాంద పురాణము పదుమూడవది, వామన పురాణము పదునాల్గవదియు, కూర్మ పురాణము పదునైదవదియు, |
| 6. మాత్స్యం చ గారుడం చైవ<br>బ్రహ్మాణ్డం చ తతః పరమ్,<br>మహాపురాణా న్యేతాని<br>హ్యష్టాదశ గిరే స్సుతే! | 6. మత్స్య పురాణము, గరుడ పురాణము, బ్రహ్మాండ పురాణము నను పదునెనిమిది మహా పురాణములు కలవు. |
| 7. తథా చోపపురాణాని<br>మునిభిః కథితాని చ,<br>సర్గ శ్చ ప్రతిసర్గశ్చ<br>వంశో మన్వన్తరాణి చ. | 7. అట్లే ఉప పురాణములును మునులచే చెప్పబడినవి. సృష్టి, లయము, రాజవంశములు, మన్వంతరములు. |
| 8. సర్వే ష్వేతేషు కథ్యన్తే<br>వంశానుచరితం చ యత్,<br>వైష్ణవం నారదీయం చ<br>తథా భాగవతం శుభమ్. | 8. వంశములను గుఱించిన కథలు ఇవి యన్నియు పై పురాణము లన్నిటియందును చెప్పబడుచున్నవి. విష్ణు పురాణము, నారద పురాణము, శుభప్రదమగు భాగవతమును. |
| 9. గారుడం చ తథా పాద్మం<br>వారాహం శుభదర్శనే!<br>షడేతాని పురాణాని<br>సాత్త్వికాని నిబోధ మే. | 9 గరుడ పురాణము, అట్లే పద్మ పురాణము, వరాహ పురాణ మను నీ యారు పురాణములును సాత్త్విక పురాణములని శుభములనిచ్చు దర్శనముగల యో పార్వతీ! నా వలన తెలిసికొనుము. |
| 10. బ్రహ్మాణ్డం బ్రహ్మకైవర్తం<br>మార్కణ్డేయం తథైవ చ,<br>భవిష్య ద్వామనం బ్రాహ్మం<br>రాజసాని నిబోధ మే. | 10. బ్రహ్మాండపురాణము, బ్రహ్మకైవర్తపురాణము. మార్కండేయ పురాణము అట్లే భవిష్యత్పురాణము, వామన పురాణము, బ్రాహ్మపురాణ మనునవి రాజస పురాణము లని తెలిసికొనుము, |

**సంస్కృత మూలమ్** / **ఆంధ్రానువాదము**

11. మాత్స్యం కౌర్మం తథా లైఙ్గం
శైవం స్కాన్దం తథైవ చ,
ఆగ్నేయం చ షడేతాని
తామసాని వరాననే!

11. మత్స్యపురాణము, కూర్మపురాణము, అట్లే లింగపురాణము, శివపురాణము, స్కాంద పురాణము, ఆగ్నేయపురాణ మను నీ యారు పురాణములను తామసపురాణములని తెలిసికొనుము.

12. వాయవ్యం భార్గవం సౌమం
బ్రహ్మాణ్డం కౌశికం తథా,
పారాశర్యం నారదీయం
నారసింహం చ కాపిలమ్.

12. వాయవ్య పురాణము, భార్గవ పురాణము, సౌమ పురాణము, బ్రహ్మాండ పురాణము, కౌశిక పురాణము, పరాశర పురాణము, నారద పురాణము, నృసింహపురాణము, కపిలపురాణము,

13. వాసిష్ఠం శివధర్మం చ
మారీచం మానవం తథా,
స్కాన్దం దౌర్వాస మాదిత్యం
వారుణం శాంబరం తథా.

13. వసిష్ఠ పురాణము, శివధర్మ పురాణము, మానవపురాణము, స్కంద పురాణము, దుర్వాస పురాణము, ఆదిత్య పురాణము, వరుణ పురాణము, శంబర పురాణము

14. ఏతాన్యుపపురాణాని
ప్రోక్తా న్యష్టాదశ ప్రియే!

14. అను నీ పదునెనిమిదియు నుపపురాణములని చెప్పబడినవి.

**శాస్త్రవిభాగః -**

శాస్త్రాణ్యపిచ సర్వాణి
త్రివిధాని వరాననే!

**శాస్త్రముల విభాగము -**

ఇట్లే శాస్త్రములన్నియు మూడు విధములు.

15. నారాయణం పరం యాని
వదన్తి జగదీశ్వరమ్,
తాని సర్వాణి శాస్త్రాణి
సాత్త్వికాని మతాని వై.

15. ఏ శాస్త్రములు జగత్ప్రభువగు నారాయణుని పరత్వమును చెప్పుచున్నవో యాశాస్త్రములన్నియు సాత్త్వికశాస్త్రములని తలంపబడుచున్నవి.

16. చతుర్ముఖం కృశానుం చ
తథా దేవీం సరస్వతీమ్,
పరత్వేన వదే చ్ఛాస్త్రం
రాజసం త త్ప్రచక్షతే.

16. చతుర్ముఖుని యొక్కయు, అగ్నిహోత్రుని యొక్కయు, అట్లే సరస్వతీదేవి యొక్కయు పరత్వమును చాటు శాస్త్రములు రాజసశాస్త్రములని నుడువబడుచున్నవి.

సంస్కృత మూలమ్

17. మల్లిఙ్గ దుర్గా విఘ్నేశ
కుమార ప్రముఖాన్ సురాన్,
ప్రశంసతి చ యచ్ఛాస్త్రం
తత్తామస ముదాహృతమ్.

తామసాదీనాం ప్రయోజన తారతమ్యం —

18. తామసం దుర్గతిం దత్తే
రాజసం స్వర్గదం భవేత్,
సాత్త్వికం మోక్షసామ్రాజ్య
ధౌరంధర్యం దదాత్యహో!

19. ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా
మధ్యే తిష్ఠన్తి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా
అధో గచ్ఛన్తి తామసాః.

20. తస్మాత్తామస శాస్త్రాణి
స్వప్నేఽపి న విలోకయేత్,
శ్రుతాని యాని శ్రోతౄణాం
మతిభ్రంశం దదత్యలమ్.

శ్రీరామాయణ మహాభారతయోరితిహాసయోః
మాహాత్మ్యమ్ —

21. ఇతిహాసా విమే ప్రోక్తే
శ్రీరామాయణభారతే,
అత్యర్థసాత్త్వికతమే
శ్రోతవ్యే మోక్షకాంక్షిభిః.

22. అష్టాదశ పురాణానాం
సార ముద్ధృత్య తత్త్వవిత్,
కృష్ణద్వైపాయనోఽకార్షీ
న్మహాభారత సంహితామ్.

ఆంధ్రానువాదము

17. శివలింగము, దుర్గ, విఘ్నేశ్వరుడు, కుమార స్వామి మొదలగు దేవతల నేశాస్త్రములు పొగడుచున్నవో యా శాస్త్రములు తామసములని చెప్పబడుచున్నవి.

తామసాదుల ఫలభేదము —

18. తామసమగుపురాణము శాస్త్రము దుర్గతి నిచ్చును రాజసమగుపురాణము శాస్త్రము స్వర్గము నిచ్చును. సాత్త్వికమగుపురాణము శాస్త్రము మోక్షసామ్రాజ్యాధిపత్యమునే యొసంగును కదా!

19 సత్త్వగుణము ప్రచురముగానుండి చనిపోయినవారూర్ధ్వలోకమగు మోక్షమును, రజోగుణము ప్రచురముగానుండి చనిపోయినవారు స్వర్గాది మధ్యలోకములను, తమోగుణము ప్రచురముగానుండి చనిపోయినవా రధోలోకము నందుదురు.

20 కావున తామస గ్రంథములను స్వప్నమందైనను చూడరాదు. వాటిని వినుటవలన వినువారికి మతిభ్రంశము తప్పక కలుగును.

శ్రీరామాయణ మహాభారతములను నితిహాసముల వైభవము —

21. శ్రీరామాయణము, భారత మను నీ రెండితిహాసములును నత్యంత సాత్త్వికములని చెప్పబడినవి. మోక్షమును కోరువార లీ రెండు ఇతిహాసములను వినవలయును.

22. తత్త్వము నెఱింగిన కృష్ణద్వైపాయనుడు అష్టాదశపురాణములయొక్క సారము నుద్ధరించి మహాభారతసంహితను రచించెను.

సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము

23. యదిహాఽస్తి తదన్యత్ర
యన్నేహాస్తి న తత్క్వచిత్,
భారతాద్యన్తయో రిత్థం
ప్రతిజజ్ఞే మహామునిః.

23. ఈ మహాభారతమున నేదికలదో. అదియే మతి యితర గ్రంథములందు గానవగ్గును. ఇందు కానరానిది మరియేగ్రంథమునను కానరాదు. అని మహాభారతముయొక్క ప్రారంభమునను ముగింపునను మహాముని ప్రతిజ్ఞ కావించెను.

24. చిత్తాని విమలీకర్తుం
అల మేకం హి భారతమ్,
తమాంసి దూరతః కర్తుం
నాలం కిం భానుమణ్డలమ్?

24. మనస్సులను పవిత్రములుగా జేయుటకు భారతమొకటియే సమర్థమైనది. ఎన్ని చీకటుల నైనను పారద్రోలుటకు భానుమండలమొకటియే సమర్థమైన దగునుకదా!

25. ద్వైపాయనౌష్ఠపుటనిస్సృతమప్రమేయం
పుణ్యంపవిత్రమథపాపహరంశివం చ,
యోభారతంసమధిగచ్ఛతివాచ్యమానం
కిం తస్య పుష్కరజలై రభిషేచనేన?

25. కృష్ణద్వైపాయనుని యధరములనుండి బయలు దేరినట్టియు, ప్రమాణములచే నూహింపదగ నట్టియు, పుణ్యమును, పవిత్రమును, పాపహరమును, మంగళప్రదము నని చెప్పబడు భారతము నెవ్వడు పఠించునో యాతడు పుణ్యనదీజలములయందు స్నానముచేయు నవసరము లేదు (ఆఫలము భారతమును పఠించుటవలననే కలుగుచున్నది)

26. యో గోశతం కనకశృఙ్గమయందదాతి
విప్రాయ వేదవిదుషే చ బహుశ్రుతాయ,
పుణ్యాం చ భారతకథాం శృణు
యాచ్చ సత్యం
తుల్యంఫలం భవతి తస్య చ తస్యచైవ.

26. వేదములయందసమాన పాండిత్యము కలిగినట్టియు సర్వశాస్త్రములను చక్కగా నెఱింగినట్టి బ్రాహ్మణునకు బంగారు కొమ్ముకుప్పెలుగల నూరుగోవులను దానమొసంగినవారికి కలుగు ఫలితమును, పుణ్యమగు భారతకథను వినిన మనుష్యుడు నిక్కముగా పొందగలుగుచున్నాడు.

27. భారతా ద్రామవృత్తా ద్వా
యస్య న స్యాత్ కృతార్థతా,
తం కృతార్థయితుం దేవి!
బ్రహ్మాపి నహి శక్నుయాత్.

27. ఓ దేవీ! భారతమువలనగాని రామాయణము వలనగాని కృతార్థుడు కాజాలనివానిని కృతార్థుడుగా నొనర్చుటకు బ్రహ్మయును సమర్థుడు కాజాలడు.

| సంస్కృతమూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 28. నాఽవైష్ణవగ్రంథరుచి ర్నాఽసచ్ఛాస్త్రపరో భవేత్, సాత్త్వికాన్యేవ శాస్త్రాణి శృణుయా న్మానయే దపి. | 28. విష్ణుపరతత్త్వ బోధకములుకాని గ్రంథములయం దాసక్తి కలిగియుండరాదు. తామస శాస్త్రములయం దాసక్తుడు కారాదు. సాత్త్విక శాస్త్రములనే వినవలెను, వాటినే గౌరవించవలెను. |
| 29. సాత్త్వికై స్సహ సంసర్గం సాత్త్వికై స్సహ భోజనమ్, సాత్త్వికే శ్రీహరౌ భక్తిం కురు నారాయణే దృఢామ్. | 29. సాత్త్వికులతో స్నేహము చేయుము. సాత్త్వికులతో భుజింపుము. శుద్ధ సత్త్వగుణ విశిష్టుడగు నారాయణునియందే దృఢమగు భక్తి కలిగి యుండుము. |
| 30. ఇత్యేత దఖిలం దేవి! కథితం తే వరాననే! కచ్చి దేత చ్ఛ్రుతం సాధు త్వయైకాగ్రేణ చేతసా? | 30. సుందరముఖముగల పార్వతీ! ఇట్లంతయు నీకు తెలిపితిని. నీ వచంచల మనస్సుతో సావధానముగ దీనిని వింటివి కదా! |
| 31. కచ్చి ద్రామాయణే శ్రద్ధా పూర్ణా తవ దృఢవ్రతే! గతా స్తే సంశయా: కచ్చిత్? బ్రూహి కిం తే వదా మ్యహమ్. | 31. ధృఢవ్రతముగల పార్వతీ! నీకు రామాయణమునందు పూర్తిగా శ్రద్ధకలిగినది గదా! నీ సంశయములు పోయినవి గదా! ఇటుపై నేనేమి చెప్పవలయునో తెలుపుము. అని యీశ్వరుడు పార్వతి నడిగెను. |
| **పార్వత్యువాచ –** | **పార్వతి పలికెను -** |
| 32. భగవన్! భవతా ప్రోక్తం మయా ఽవహితయా శ్రుతమ్, గతా మే సంశయా స్సర్వే శ్రద్ధా రామాయణే దృఢా. | 32. ఓ పూజ్యుడా! నీచే చెప్పబడినదంతయు నేను శ్రద్ధగా వింటిని. నా సంశయము లన్నియు తీరినవి. నాకు రామాయణమున ధృడమగు శ్రద్ధ కలిగినది. |
| **శ్రీసనత్కుమార: –** | **శ్రీసనత్కుమారుడు చెప్పెను –** |
| 33. ఇత్యుక్త్వో త్థాయ గిరిజా పరిక్రమ్య మహేశ్వరమ్, ప్రణమ్య కృతకృత్యా సా ముముదే సహవల్లభా. | 33. అని పలికి పార్వతిలేచి ఈశ్వరునకు ప్రదక్షిణమాచరించి నమస్కరించి కృతకృత్యురాలై తన భర్తతోగూడ మిక్కిలి సంతసించెను. |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 34. ఏత త్తే కథితం సర్వం<br>శ్రీరామాయణవైభవమ్,<br>య దుమాయై మహేశేన<br>కథితం మునిస త్తమ! | 34. ఓ మునిశ్రేష్ఠా! ఈశ్వరునిచే పార్వతి కుప దేశింపబడిన రామాయణవైభవమంతయు నీ కిదే చెప్పబడినది. అని సనత్కుమారుడు తెలిపెను. |
| శ్రీ పరాశర: - | శ్రీపరాశరుడు పలికెను – |
| 35. ఇత్థం సనత్కుమారేణ<br>కథితం శ్రుతిసమ్మతమ్,<br>శ్రుత్వా దేవముని: ప్రీత:<br>శ్రీరామాయణవైభవమ్. | 35. ఇట్లు శాస్త్రసమ్మతముగ సనత్కుమారునిచే చెప్పబడిన శ్రీరామాయణవైభవమును విని నారదమహర్షి సంతసించెను. |
| 36. ఉత్థాయ తం పరిక్రమ్య<br>సాష్టాఙ్గం ప్రణిపత్య చ,<br>గురవే దక్షిణాం దత్త్వా<br>ప్రతిపూజ్య యథావిధి. | 36. మరియు లేచి గురువగు సనత్కుమారునకు ప్రదక్షిణముచేసి సాష్టాంగముగ నమస్కరించి దక్షిణ నొసంగి యథావిధిగ పూజించి, |
| 37. తస్మిన్ యథాగతం యాతే<br>స్మృత్వా తదనుశాసనమ్,<br>తచ్చోదితేన మార్గేణ<br>అన్వతిష్ఠ త్త మాదరాత్. | 37. ఆ గురువు తాను వచ్చిన మార్గముననే వెళ్ళిన పిమ్మట వారియాజ్ఞను తలంచుకొని యా గురు వుపదేశించిన మార్గముననే యాదరముతో ననుష్ఠించెను. |
| 38. ఏత ద్వో ఽభిహితం సర్వం<br>య త్పృష్టం భగవత్తమై:,<br>భవద్భి స్సాధ్విదం చిత్తే<br>ధార్యతా మప్రమాదత:. | 38. పూజ్యతములగు మీచే నడుగబడిన దంతయు మీకు చెప్పితిని. మీరును పరాకులేకుండగా దీనిని చక్కగా మనస్సున ధరింతురు గాక! |
| 39. ఇత్యాదిష్టా యథాఽఽదేశం<br>పీత్వా రామాయణామృతమ్,<br>కృతార్థా మునయ స్సర్వే<br>పరం హర్ష మవాప్నువన్. | 39. అని యాజ్ఞాపింపబడినవారై రామాయణా మృతమును త్రాగి కృతార్థులై మునులందరును మిక్కిలి సంతసించిరి. |

| సంస్కృత మూలమ్ | ఆంధ్రానువాదము |
|---|---|
| 40. పరాశరం మునివరం<br>సాష్టాఙ్గం ప్రణిపత్య తే,<br>హర్షబాష్పా న్విముఞ్చన్తః<br>ప్రాశంసం స్తే ముహుర్ముహుః. | 40. వారు మునిశ్రేష్ఠుడగు పరాశరునికి సాష్టాంగముగ నమస్కరించి యానందాశ్రువులను విడచుచు మాటిమాటికి స్తోత్రము చేసిరి. |
| 41. సర్వే ఒపి తే ఒనుతిష్ఠన్తో<br>యథావ దనుశాసనమ్,<br>కృతార్థా స్సతతం ప్రాపూ<br>రామ కైఙ్కర్యసంపదమ్. | 41. వారందరును వారానతిచ్చిన ట్లాచరించుచు కృతార్థులై రామకైంకర్యసంపద నెల్లపడును. పొందిరి. |
| 42. మధుమథనచరిత్రద్రావితం యస్య చిత్తం<br>వ్యయ మయతి తదీయా రాధనై ర్యస్య విత్తమ్,<br>హరిగురుచరణామ్భోజార్చనే ష్వప్రమత్తం<br>వదతి పురుష మేనం సర్వలోకో ఒప్యుదాత్తమ్. | 42. ఎవని మనస్సు మధువనురాక్షసుని సంహరించిన శ్రీమన్నారాయణుని చరిత్రచే ద్రవించునో, ఎవని ధనము భగవద్భక్తుల యారాధనకై వ్యయమగుచున్నదో, ఎవడు శ్రీమన్నారాయణుని యొక్కయు, తన యాచార్యుల యొక్కయు, పాదపద్మములను పూజించుటయం దేమరకయుండునో అట్టి పురుషునే యీ ప్రపంచమంతయు నుత్తమపురుషునిగా (సచ్చరిత్ర కలవానినిగా) స్తుతించుచున్నది |

ఇతి<br>శ్రీమత్పారాశర్యే ఉపపురాణే<br>శ్రీరామాయణ మాహాత్మ్యే<br>**అష్టమో ఒధ్యాయః.**

ఇది<br>శ్రీమత్పరాశరవిరచితమగు ఉపపురాణమున<br>శ్రీరామాయణ మాహాత్మ్యమున<br>నెనిమిదవ యధ్యాయము.

శ్రీ రామాయణ మాహాత్మ్యం

స మా ప్త మ్.

శ్రీమతే రామానుజాయ నమః.

    

హరిః ఓమ్.

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీమద్రామాయణే శ్రీగోవిందరాజీయవ్యాఖ్యానవిశిష్టే

## బాలకాండ ప్రారంభః

తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్. ౧

---

## శ్రీగోవిందరాజీయవ్యాఖ్యా

### మంగళశ్లోకాః

ఆచార్యం శఠకోపదేశికమథ ప్రాచార్యపారంపరీం, శ్రీమల్లక్ష్మణయోగివర్య యమునావాస్తవ్యనాథాదికాన్, వాల్మీకిం సహ నారదేన మునినా వాగ్దేవతావల్లభం సీతాలక్ష్మణవాయుసూనుసహితం శ్రీరామచంద్రం భజే. శ్రీమత్యంజనభూధరస్య శిఖరే శ్రీమారుతేస్సన్నిధావగ్రే వేంకటనాయకస్య సదనద్వారే యతిక్ష్మాభృతః, నానాదేశసమాగతైర్బుధగణై రామాయణవ్యాక్రియాం విస్తీర్ణాం రచయేతి సాదరమహం స్వప్నేఽస్మి సంచోదితః. క్వాహం మందమతిః క్వగభీరహృదయం రామాయణం తత్క్వచ వ్యాఖ్యానేఽస్య పరిభ్రమన్నహమహో హాసాస్పదం ధీమతామ్, కో భారోఽత్ర మమ స్వయం కులగురుః కోదండపాణిః కృపాఽకూపారో రచయత్యదస్సపది మజ్జిహ్వాగ్రసింహాసనః. వైయర్థ్యం పునరుక్తతా మనుచితారంభం విరోధం మిథో సాధుత్వం చ పదప్రబంధరచనావాక్యేషు నిశ్శేషయన్, స్వారస్యం చ పదే పదే ప్రకటయన్రామాయణస్య స్వయం వ్యాఖ్యామేష తనోతి సజ్జనముదే గోవిందరాజాహ్వయః. పూర్వాచార్యకృతప్రబంధజలధేస్తాత్పర్యరత్నావళీర్గ్రాహం గ్రాహ మహం శఠారిగురుణా సందర్శితేనాధ్వనా, అన్యవ్యాకృతిజాతరూపశకలైరాయోజ్య సజ్జీకృతైః శ్రీరామాయణభూషణం విరచయే పశ్యంతు నిర్మత్సరాః. సుస్పష్టమష్టాదశకృత్వ ఏత్య శ్రీశైలపూర్ణాద్యతిశేఖరోఽయం, శుశ్రావ రామాయణసంప్రదాయం వక్ష్యే తమాచార్యపరంపరాత్తమ్. క్వచిత్పదార్థం క్వచిదన్వయార్థం క్వచిత్పదచ్ఛేదసమర్థనాని, క్వచిత్ క్వచిద్గాఢనిగూఢభావం వక్ష్యే యథాపేక్షమవేక్షణీయమ్.

అవతారికా- శ్రియఃపతి రవాప్తసమస్తకామ స్సమస్తకల్యాణగుణాత్మక స్సర్వేశ్వరః, వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణురచింత్యాత్మా భక్తైర్భాగవతైస్సహ' ఇత్యుక్తరీత్యా శ్రీవైకుంఠాఖ్యే దివ్యలోకే శ్రీమహామణిమంటపే శ్రీభూమినీళాభిస్సహ రత్నసింహాసన

మధ్యాసీనో నిత్యైర్ముక్తైశ్చ సహ నిరంతర పరిచర్యమాణచరణనళినోపి తద్వదేవ స్వచరణ యుగళపరివరణార్హానపి తద్ధీనాన్ ప్రళయే ప్రకృతివిలీనా న్మధూచ్ఛిష్టమగ్నహేమకణ సదృక్షాన్ క్షీణజ్ఞానాన్ జీవానవలోక్య, 'ఏవం సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాప్యుపజాయత' ఇత్యుక్తరీత్యా దయమానమనాః, 'విచిత్రా దేహ సంపత్తిరీశ్వరాయ నివేదితుం, పూర్వమేవ కృతా బ్రహ్మన్ హస్తపాదాదిసంయుతే' త్యుక్తప్రకారేణ మహదాదిసృష్టిక్రమేణ తేషాం స్వచరణకమలసమాశ్రయణోచితాని కరణకళేబరాణి దత్వా, నదీతరణాయ దత్తైః ప్లవైర్నదీరయానుసాగరేణ సాగరమవగాహమానేష్వివ తేషు తైర్విషయాం తరప్రవణేషు, తేషాం సదసద్వివేచనాయ 'శాసనాచ్ఛాస్త్ర' మిత్యుక్తరీత్యా స్వశాసనరూపం వేదాఖ్యం శాస్త్రం ప్రవర్త్యాపి తస్మిన్నప్రతిపత్తివిప్రతిపత్త్యన్యథాప్రతిపత్తిభి స్తైరనాదృతే స్వశాస నాతిలంఘినం జనపదం స్వయమేవ సాధయితు మభియియాసురివ వసుధాపతిః స్వాచారముఖేన తాన్ శిక్షయితుం రామాదిరూపేణ చతుర్ధావతితీర్షు రంశరామరగణైస్సహద్రుహిణైరభ్యర్థితః స్వారాధకస్య దశరథస్య మనోరథమపి పూరయితుం చతుర్ధావతతార; తత్ర రామరూపేణావతీర్య రావణం నిహత్య పితృవచనపరిపాలనాది సామాన్యధర్మ మన్వతిష్ఠత్. లక్ష్మణరూపేణ రావణిం నిరస్య భగవచ్ఛేషత్వరూపం విశేషధర్మం, భరతరూపేణ గంధర్వాన్నిర్వాస్య భగవత్పార తంత్ర్యరూపం, శత్రుఘ్నరూపేణ లవణాసురం ధ్వంసయిత్వా భాగవతశేషత్వం; తానిమాన్ ధర్మాంస్తానీమాని చాపదానానితత్కాలమాత్రపర్యవసితాని భవిష్యంతీతి మన్వానస్సర్వలోకహిత పరః పితామహో భగవాన్ బ్రహ్మా రామచరిత్రపవిత్రితం శతకోటిప్రవిస్తరం ప్రబంధం నిర్మాయ తం నారదాదీనధ్యాప్య భూలోకేపి సంతతరామమంత్రానుసంధానసంధుక్షితహృదయ వాల్మీకి ముఖేన సంగ్రహేణ ప్రవర్తయితుం నారదం ప్రేషయామాస తదుక్తం మాత్స్యే - 'వాల్మీకినా చ యత్ ప్రోక్తం రామోపాఖ్యానముత్తమం, బ్రహ్మణా చోదితం తచ్చ శతకోటిప్రవిస్తరం, ఆహృత్య నారదేనైవ వాల్మీకాయ నివేదిత' మితి. వాల్మీకిరపి నిఖిలవేదాంతవిహితపరతత్వనిర్ధిధార యిషయా యదృచ్ఛయోపగతం నారదం పృష్ట్వావగతపరతత్వస్వరూపస్తదను ప్రసన్నేన విధినా దత్తసకలసాక్షాత్కారప్రబంధనిర్మాణశక్తిర్వేదోపబృంహణమారభమాణస్తస్యార్థప్రధాన సుహృత్స మ్మితేతిహాసతాం వ్యంగ్యప్రధానకాంతాసమ్మితకావ్యతాం చ పురస్కుర్వన్, కావ్యాలాపాంశ్చ వర్జయేదితి నిషేధస్యాసత్కావ్యవిషయతాం చ నిర్ధారయన్, స్వగ్రంథే ప్రేక్షావతాం ప్రవృత్త్యర్థం తదంగాని దర్శయతి ప్రథమత శ్చతుస్సర్గ్యా. తత్ర ప్రథమసర్గేణ విషయప్రయోజనే దర్శయతి. తత్ర చ 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయే'తి వేదాంతరహస్యస్య ప్రశ్నపూర్వకం జ్ఞేయత్వ విధానా 'న్నాపృష్టః కస్యచిద్బ్రూయా' దిత్యపృష్టోత్తరస్య ప్రత్యాదిష్టత్వాచ్చ ప్రశ్న మావిష్కరోత్యాదితః పంచశ్లోక్యా.

అథ ప్రారీప్సితస్య గ్రంథస్య నిష్ప్రత్యూహపరిపూరణాయ ప్రచయగమనాయ చ గురునమ స్కారందేవతానమస్కారం చ విదధాతి తపస్స్వాధ్యాయేతి.తత్ర'ఆచార్యాద్ధైవ విద్యా విదితా సాధిష్టం

